శ్రీమదాంధ్ర మహాభారత

# శిల్ప కళా దర్శనము

చతుర్థ భాగము

*

డాక్టర్ శోభిరాల సత్యనారాయణ
యం.ఏ. పి.హెచ్.డి

*

శ్రీ విశ్వకర్మా విజ్ఞానకేంద్ర
శ్రీకాకుళము - 532 001.

# శ్రీమదాంధ్ర మహాభారత

# శిల్ప కళా దర్శనము

## చతుర్థ భాగము

[ శిల్ప భారతము - శిల్పాచార్యులు ]

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారిచే స్వర్ణ పదక బహూకృతి నందుకున్న
విశిష్ట సిద్ధాంత గ్రంథ [illegible] వారి




డాక్టర్ శోభిరాల సత్యనారాయణ
యం.ఎ., పిహెచ్.డి.

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
శ్రీకాకుళము - 532 001.

Srimadandhra Mahabharata

# SILPAKALADARSANAMU

Silpabharatamu - Silpacharyulu



ప్రచురణ ఫిబ్రవరి 8, 1997
ధాత మాఘ శుద్ధ పాడ్యమి

ప్రతులు : 500

మూల్యము : రూ. 60/-

ప్రతులు దొరుకుచోటు :

శ్రీమతి శోభిరాల సుందరం
G.F. 3. అలంకృత అపార్ట్‌మెంట్స్
పడమటలంక
విజయవాడ - 522 014.

సంచాలకులు
విశ్వబ్రాహ్మణ ధర్మపీఠము
4-1-11, విశ్వకర్మ భవనం
తిలక్‌రోడ్, బొగ్గులకుంట
హైదరాబాద్ - 500 001.

ప్రఫుల్లచంద్ర
2-6-36, కళాప్రపూర్ణ భవనం
గాంధీనగర్
తెనాలి - 522 001.

ముద్రణ : శ్రీ వాణీ ఆర్ట్ ప్రింటర్స్
తెనాలి - 522 001.
Phone : 24019



నారాయణం నమస్కృతం నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ ॥

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్ప ప్రజాపతిః ।
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ॥

భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః ।
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకారహ ॥

మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ।
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్॥

నరనారాయణ తత్త్వము
నరోత్తముని ధర్మమును మనంబున వెలుఁగన్
విరచింతును 'జయ' గ్రంథము
సరస్వతీదేవి కెఱిఁగి సకలార్థముగా.

— శోభిరాల

# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం సకలాయై నమః

* * *

సకలజగజ్జనయిత్రిని
సకలాధిష్ఠానరూప సర్వాధారన్
సకల మనోన్మని సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి
కరుణ మమ్మేలు గాత విజ్ఞానకలన.

లక్షణోజ్జ్వలదివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధసంపత్సమున్నతి లభ్య మగుత

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణసౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.



శోభిరాల

# అంకితము

ఈ సిద్ధాంత గ్రంథమును
స్వర్లోకవాసులైన పుణ్యశ్లోకులు
నా తలిదండ్రులు
నాగరత్నమాంబా లింగయాచార్యులకు
శ్రద్ధాంజలి ఘటించి
సమర్పిస్తున్నాను

శ్రుతి శోధించి రచించితి
నతిరమ్యంబైన శ్రీమదాంధ్ర మహాభా
రత శిల్పకళాదర్శన
కృతి; నంకిత మిత్తు జననికిని జనకునకున్

— సత్యనారాయణ

# చైతన్య దీప్తి

సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

సిద్ధపురుషుఁడు కైలాసశిఖరవాసి
యొక మహాయోగి యేతెంచి యొకదినమ్ము
వెలుఁగుఁ జూపించె విద్యావివేకదీప్తి
నమ్మహాత్మునిఁ దలఁతు నత్యంతభక్తి.

రాగమయికావ్యతత్త్వార్థరామణీయ
కములు విని మెచ్చి హర్షబాష్పముల తోడ
శిరముపై హస్తముంచి యాశీస్సు లిడిన
శ్రీ శ్రీయానందనాథ దేశికు స్మరింతు.

వేదాధ్యయనపరాయణుఁ
డాదర్శగుణుండు లింగయాచార్యునకున్
స్వాదిష్ఠున కస్మత్ పితృ
పాదుల కభివాదనములు ప్రత్నర్షులకున్,

తన తనయుని బహువిద్యా
ధనయుతునిగఁ జేయ సంతతము దైవతపూ
జనములఁ గడపిన జననికి
మనస్వినికి నాగరత్నమకు వందనముల్.

శతసంఖ్యాకవిమర్శకాగ్రగణులు విస్తారంబు శోధించి భా
రత మందున్న విశేషముల్ తెలిపి అశ్రాంతంబుగా మత్పురా
కృతభాగ్యోన్నతి నే మనీషియుఁ గళాదృష్టిన్ గనన్ లేదు, సు
వ్రతుడై శిల్పకళారహస్యములు తెల్పన్ లేదు నా కిమ్మగా.

చూచితి నాంధ్రభారతముఁ జూచితి వ్యాసకృతార్థవేదమున్,
జూచితి నిందు నందుఁ గల సుందరశిల్పకళాప్రబంధముల్;
సూచనలన్ గ్రహించి పరిశోధనఁ జేయుచు భవ్యభారతీ
శ్రీ చరణాబ్జసేవనము చేసితిఁ బ్రాజ్ఞులు చూచి మెచ్చఁగా.

మధురాక్కర :

చెలిమి శ్రీమహాభారతశిల్పకళాదర్శనా
కలనఁ జేదోడువాదోడుగా నిల్చిన కులపాలిన్
బలుకుఁజెలి వంటి నేర్పరిన్ బాలాత్రిపురసుందరిన్
గలిమిచూపుల గ్రాలంటి కరుణతోఁ బ్రోచుఁ గాత

కూచిపూడి నృత్యకుశల, రాష్ట్రస్థాయి
పాటవంపు స్పర్థఁ బ్రథమగణ్య;
కొమరుమిగులు కూర్మి కొమరిత శ్రీవిద్య
నేలుఁగాత జగము లేలు తల్లి.



# AWARD OF GOLD MEDAL

*Andhra University*

No. S. I. (3) /6/85, Waltair, Dt. 22-5-1985

## NOTIFICATION

## AWARD OF RESEARCH MEDALS / PRIZES

The following candidates whose Ph.D. thesis have been adjudged to be the best among those accepted by the University, during the years mentioned, have been awarded the Research Medals/Prizes noted against each.

Faculty of Arts :

| Name of the Candidate | Prize/Medal | Year |
|---|---|---|
| 1) — — — — | — — — | — |
| 2) Dr. S. Satyanarayana, Lecturer in Telugu, Govt. Arts College, SRIRAKULAM. | Sri Tripuraneni Gopichand Memorial Medal | 1984 |

University Office,
Waltair
Date : 28-5-1985

Sd/- C.V. APPA RAO
Controller of Examinations.

/True Extract/

' సాహిత్యబ్రహ్మ '
డా॥ వి.వి.యల్. నరసింహారావు
జాతీయ సార్వత్రిక విద్యాలయం,
ప్రాంతీయ సమన్వయాధికారి,
భారత ప్రభుత్వం,
'మానవ వనరుల' మంత్రిత్వశాఖ.

# శిల్ప మహా మేరువు

ఇది 'విశ్వజ్ఞ' డా॥ శోభిరాల సత్యనారాయణగారి సిద్ధాంత గ్రంథం 'శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము' లోని చివరి భాగమైన చతుర్థభాగం. ప్రథమభాగానికి 'సిద్ధాంత సిద్ధాన్న' మనే పేరుతో పీఠిక సంతరించాను. అది డా॥ శోభిరాలవారి అభ్యర్థనను పురస్కరించుకొని వ్రాశాను. ఆ ప్రజ్ఞామూర్తి ఇప్పుడు లేడు. ఆయన అర్ధాంగి శ్రీమతి బాలాత్రిపుర సుందరిగారి ప్రార్థన మేరకు ఇప్పుడీ పరిచయ వాక్యాలు వ్రాస్తున్నాను.

శ్రీమతి బాలాత్రిపురసుందరి, కళాప్రపూర్ణ దర్శనాచార్య డా॥ కొండూరు వీరరాఘవాచార్యులవారి పుత్రిక; వృత్తిచే ఈమె గారుకూడా డా॥ శోభిరాలవారిలాగే ఆంధ్రోపన్యాసకురాలు. మీదు మిక్కిలి శోభిరాలవారి ' రాగమయి ' పద్యకావ్యాన్ని అంకితం తీసుకొన్న అపూర్వరాగమయి. ఆత్మేశుడు కన్నుమూయగా, ఆయన పరిశోధన గ్రంథ ముద్రణను పరిసమాప్తి చేయాలన్న ఆరాటంతో అశ్రునయనాలతో నిలిచిన ఆర్ద్రహృదయ. ' శ్రీవిద్యా ' వర్తన ప్రశమితచిత్త బాలాత్రిపురసుందరి; 'ఆనందవర్ధన' సహోదరి.

శోభిరాల పరిశోధన డాక్టరేట్ పట్టంకోసం మాత్రమే చేసింది కాదు. కేవలం పట్టంకోసమే అయితే ఆయన ఏనాడో బహువిషయ పట్టభద్రుడు. ప్రస్తుత పరిశోధన గ్రంథానికి 1984లో ఆంధ్ర విశ్వ

విద్యాలయ స్వర్ణపతక బహూకృతి రావటం కూడా అతిసాధారణ సంగతే అనిపిస్తుంది.

ఇందులోని పరిశోధిత విషయపరిధి పరామర్శిస్తుంటే డా॥ శోభిరాలలో సముద్రాని కెత్తా మెత్తిన సాహసం స్ఫురిస్తుంది.

భారతేతిహాసంలోని బహు విషయాలపై పరిశోధన సాగించిన ప్రాజ్ఞులు పలువురున్నారు. ఒక్క తెలుగులోనే వందలమంది ఉన్నారు. 'శిల్పకళా దర్శనము' చేసినవారైతే శోభిరాలవారొక్కరే. తన పరిశోధనను దర్శనస్థాయిలో రూపొందించాలనే పరమలక్ష్యంతోనే పరిశోధన శీర్షికలో 'దర్శన' శబ్దాన్ని బుద్ధిపూర్వకంగానే చేర్చుకొన్నారు. లక్ష్యశుద్ధి వల్లనే లక్ష్యసిద్ధి కలిగింది. ఈ కారణంవల్లనే పరిశోధనగ్రంథ ప్రథమభాగానికి నే వ్రాసిన పీఠికను 'సిద్ధాంతసిద్ధాన్న' మని పేరు పెట్టాను. ఆ పేరు ఆయనకు పరిశోధన పరమార్థం సిద్ధించినంత ఆనందం కలిగించింది.

'ఉన్మేష' మంటే 'వికాస' మని అర్థం.

గ్రంథప్రథమ భాగాన్ని రెండున్మేషాలుగా, ద్వితీయ భాగాన్ని కూడా రెండున్మేషాలుగా, తృతీయాన్ని నాలుగున్మేషాలుగా చివరిదైన ఈ చతుర్థాన్ని మూడున్మేషాలుగా మొత్తం గ్రంథాన్ని ఏకాదశోన్మేషాలుగా సుప్రకాశ శోభితం చేశారు శోభిరాల. విషయ వివరణలోనేకాక నామ నిర్దేశంలో కూడా కవిహృదయం ప్రదర్శించిన ప్రజ్ఞాశాలి శోభిరాల. శబ్దసంయోజనంలో కూడా ఈ ప్రజ్ఞ భాసిస్తుంది.

ఉదా :- త్వాష్ట్రి విజ్ఞాన మధు మరీచి దధీచి (పుట 89)
శిల్ప విజ్ఞాన విశిష్టుడు వసిష్ఠుడు (పుట 113)
మృతసంజీవినీ విద్య కావ్యకళ (పుట 122)

కావ్యుడంటే శుక్రాచార్యుడు. ఆ అర్థంతోపాటు కవి సంబంధమైన కావ్యకళ మృతప్రాయమైన మానవలోకాన్ని కూడా ప్రాణకళతో వెలిగిస్తుందన్న మహార్థం ఈ శీర్షికలో నిక్షిప్తమై ఉండటం విశేషం.

గ్రంథాంతంలోని 'పంచాననాలోకము' (పుట 147) శ్లేషార్థ శోభితమై శోభిరాల పరిశోధన శోభను ఇనుమడింప జేస్తున్నది. 'పంచానన' సమాసానికి 'సింహ'మనే అర్థంతోపాటు 'విశ్వకర్మ' అనే అర్థంకూడా ఉంది. సింహార్థంలో గ్రంథాన్ని సింహావలోకనం చెయ్యటమనే అర్థం స్ఫురిస్తుంది. విశ్వకర్మార్థంలో విశ్వకర్మపంచముఖ నామాలైన సద్యోజాత, వామదేవ, అఘోర, ఈశాన తత్పురుష ములు స్ఫురిస్తాయి. ఈ ముఖాలైదింటా సముత్పన్నమైన సర్వశిల్పాల ప్రసక్తి గ్రంథమంతటిలోను పఱచుకొని ఉంది గదా! స్వర్ణ, దారు, కాంస్య, అయ, శిలాశిల్పాలు అయిదూ సింహావలోకనం చేసినట్లైంది గదా!

ఇక గ్రంథస్థ విషయమంటారా? తొలి మూడు భాగాలలోని ఎనిమిది ఉన్మేషాలలోను సాహిత్యం, శిల్పం, వాస్తు శిల్పం, యజ్ఞశిల్పం పూర్తశిల్పం (వాపీకూప తటాకారామ దేవాలయాదులు)రూప ప్రతి రూప శిల్పాలు, రథశిల్పం, యంత్రశిల్పం, ప్రకీర్ణ శిల్పం సాధికారికంగా సప్రమాణంగా వివరించబడినాయి. ఈ చతుర్థ భాగంలోని నవమో న్మేషంలో-భారతకాలంనాటి సమాజంలోని శిల్పుల స్థితిగతులు, దశమోన్మేషంలో శిల్పవిద్యా ప్రకాశకుల వివరాలు, ఏకాదశో న్మేషంలో సింహావలోకన రూపంగా శిల్పవిశ్వం, పంచమ వేదార్థ దర్శనం ప్రాధాన్యం వహిస్తాయి.

ఈ విధంగా ఈ పరిశోధన గ్రంథం అదృష్టపూర్వమైన భారత శిల్ప మహామేరువును సహృదయ పరిత్ర్యలోకం ముందు సాక్షాత్కా రింపజేస్తుంది.

ధాతృనామ సంక్రాంతి
14-1-1997 — వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు

# A MONUMENTAL WORK

"Andhra Mahabharata Silpakala Darsanamu" of Dr. Sobhirala is a **Manumental work** which will last for a long time for edification of future generations of not only Shilpis—but also students of Indian Culture. It treats not only the art of shilpa or architecture and sculpture of Andhra Mahabharata but also the whole literature on silpa.

A neglected subject is resurrected by the author and he deserves all our praise.

Nebha Chandrasekharacharya
Former Gourava Sabhapathi.
VISWABRAHMANA DHARMAPEETAM

ఆచార్య డా॥ రవ్వా శ్రీహరి, M.A; Ph.D.,
తెలుగు శాఖాధ్యక్షులు,
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం,
హైదరాబాదు - 46.

# అభినందన

సాధారణంగా సాహిత్యపండితులకు సాంకేతిక శాస్త్రాలలో అభినివేశం ఉండదు. సాంకేతిక శాస్త్రాలలో నిష్ణాతులైనవారికి సాహిత్యంలో పాండిత్యం ఉండదు. శోభిరాలవారు ఇందుకు అపవాదం. వారికి అటు సాహిత్యంలోనూ, ఇటు శిల్పవిజ్ఞానంలోనూ సమానమైన పాండిత్యం ఉన్నది. పాండిత్యంతోపాటు పరిశోధన దక్షతా ఉన్నది. కనుకనే వారు 'ఆంధ్ర మహాభారతం - శిల్పకళా దర్శనం' అన్న బృహత్సిద్ధాంత గ్రంథాన్ని రచించగలిగినారు. ఇలాంటి సిద్ధాంత గ్రంథాలు క్వాచిత్కంగానూ, కాదాచిత్కంగానూ రచింపబడుతుంటాయి.

ఆంధ్ర మహాభారతంలో ప్రతిబింబించిన శిల్పకళకు సంబంధించిన సర్వవిషయాలను సమగ్రంగా శోభిరాలవారీ గ్రంథంలో చర్చించినారు. వేదాలు, వేదభాష్యాలు, ఉపనిషత్తులు, రామాయణ భారతాలు, వాస్తుశాస్త్ర గ్రంథాలు, శిల్పశాస్త్ర గ్రంథాలు ఎన్నెన్నో ప్రాచీన గ్రంథాలను, ఆంగ్లంలో వెలసిన ఆధునిక శిల్పాదిశాస్త్ర గ్రంథాలను పరిశీలించి చేసిన వారి సమన్వయం వారి ప్రామాణికతకు, పాండితీప్రకర్షకు నిదర్శనం.

శోభిరాలవారు రచించిన సిద్ధాంతగ్రంథం ముద్రణలో సుమారు వేయి పేజీల బృహద్గ్రంథం కావడంవల్ల దీన్ని నాలుగు భాగాల్లో ముద్రించడం జరిగింది. మొత్తం పదకొండు ఉన్మేషాలలో రచింపబడింది. చివరి మూడున్మేషాలుగల చివరి భాగం ఈ చతుర్థ భాగం.

మొదటి మూడు భాగాల్లో మహాభారతంలో ప్రతిబింబించిన వాస్తుశిల్పం, రథశిల్పం, యంత్రశిల్పం, యజ్ఞశిల్పం, రూప శిల్పం, ప్రకీర్ణశిల్పం అనే అంశాలు చర్చించబడ్డాయి. ఐతే ఈ వివిధ శిల్పకళలను ఆరాధించిన శిల్పాచార్యులను గురించి వివరించకపోతే ఈ సిద్ధాంతగ్రంథం అసమగ్రమే అవుతుంది. అందువల్ల శోభిరాలవారు ఈ భాగంలో శిల్పాచార్యులకు సంబం ధించిన అనేక వివరాలను పొందుపరచడం ఎంతో ఔచితీమంతంగా ఉన్నది.

మహాభారతకాలంలో శిల్పులకు సమాజంలోనూ, రాజ్యాంగం లోనూ ఉన్న ప్రాధాన్యమూ, వారి స్థితిగతులూ ఈ గ్రంథం తొలి భాగంలో వివరింపబడ్డాయి. వివిధ శిల్పకర్మల్లో నిపుణులైన విశ్వ కర్మలను రాజు సత్కరించేవాడనే, శిల్పులు ఆచార్య నామంతో వ్యవహరింపబడేవారనీ, శిల్పులకు యజ్ఞభాగార్హత ఉండేదనీ అనేక విషయాలను సప్రమాణంగా నిరూపించినారు. ప్రసక్తాను ప్రసక్తంగా శిల్పుల్లోని భేదాలనూ, వారి లక్షణాలనూ వివరించారు.

వివిధ శిల్పాచార్యుల చరిత్రను వివరించడం ఈ భాగంలోని ప్రధానాంశం. దధీచిమహాముని అస్థులతో ఇంద్రునికి వజ్రాయు ధాన్ని చేసి యిచ్చినవాడు దేవతాశిల్పియైన త్వష్ట. దేవతలకు రథాలు నిర్మించే రథకారులుగా ప్రసిద్ధి పొందినవారు ఋభువులు. అగ్నిదత్తమైన అర్జునుని దివ్యరథాన్ని నిర్మించినవాడు భౌమన విశ్వకర్మ. శిల్పకళలన్నింటికీ మూలపురుషుడైనవాడు విశ్వకర్మ. సర్వప్రథమంగా నౌకను నిర్మించినవాడు వైవస్వతమనువు. అష్టాదశ శిల్పశాస్త్ర ప్రవర్తకులలో అన్యతముడు వసిష్ఠుడు. గార్గేయాగమమనే శిల్పశాస్త్ర గ్రంథాన్ని రచించినవాడు గర్గమహర్షి పుత్రుడు గార్గేయుడు. యంత్ర సర్వస్వం, భరద్వాజ శిల్పం, అంశుబోధిని, ఆకాశీతంత్రం అనే వైజ్ఞానిక గ్రంథాలను రచించిన

వాడు భరద్వాజుడు. అనేక శిల్పశాస్త్ర విషయాలను శుక్రనీతిలో నిబంధించినవాడు శుక్రాచార్యుడు. త్రిపుర నిర్మాతయైనవాడు మయుడు. లాక్షాగృహాన్ని నేర్పుతో నిర్మించినవాడు పురోచనుడు. ఈ విధంగా శిల్పవిద్యాప్రకాశకులైన ఎందరెందరో శిల్పాచార్యులను గురించి శోభిరాలవారు అమూల్యమైన విషయాలనెన్నింటినో సప్రమాణంగా వివరించినారు.

ఆంధ్రమహాభారతాన్ని సాహిత్యదృష్టితో వివిధ కోణాలలో పరిశోధించినవారెందరో ఉన్నారు. కాని శిల్పశాస్త్ర దృష్టితో పరిశోధించినవారు శోభిరాలవారొక్కరే. విలక్షణమైనరీతిలో, విశిష్టమైన రీతిలో ఈ సిద్ధాంతగ్రంథాన్ని రచించిన శోభిరాల సత్యనారాయణ గారి కృషి అభినందించదగినది.

వారు ప్రస్తుతం మన మధ్యలో లేకపోవడం విచారకరమైన విషయం. వారి ఆత్మకు శాంతి కలగాలని ఆకాంక్షిస్తున్నాను.

అముద్రితంగా ఉన్న ఈ సిద్ధాంతగ్రంథ భాగాన్ని వెలుగులోకి తీసుకువచ్చిన డా॥ శోభిరాల సత్యనారాయణగారి శ్రీమతిగారు విద్యాధికురాలైన శ్రీమతి శోభిరాల బాలాత్రిపుర సుందరం ఎమ్.ఏ. గారిని అభినందిస్తున్నాను.

హైదరాబాదు
8-2-'97

రవ్వా శ్రీహరి

# కృతజ్ఞతా నివేదనము

విశ్వజ్ఞ బిరుద విభూషణులు, వాస్తు జ్యోతిష విద్యాప్రవీణులు శ్రీ శోభిరాల సత్యనారాయణగారు సుమారు దశాబ్దకాలం పరిశోధించి రచించిన శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము మూడు భాగములు ప్రచురించి, విద్వజ్జనుల ప్రశంసలకు పాత్రులైనారు. వారు 8-2-'96 న బ్రహ్మైక్యమందుటచే చతుర్థభాగ ప్రచురణ విశ్వకర్మ విజ్ఞాన కేంద్ర పక్షాన నేను వహించవలసివచ్చినది. ఆ భారము నా యోపినకొలది నెరవేర్చి ఈ భాగము వెలయించితిని. ఆ కృషిలో నాకు సహాయ సహకారములొసల్పిన ప్రతి యొక్కరిని స్మరించుట నా విధి.

మునుముందుగా గ్రంథాన్ని ఆమూలాగ్రం పఠించి, శిల్ప మహామేరువను పేర అభిప్రాయమొసగిన సాహిత్య బ్రహ్మ శ్రీ వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు, గ్రంథాన్ని సమీక్షణమొనర్చి అభినందన వందచేసిన హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య రవ్వా శ్రీహరిగార్లకు నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

గ్రంథావిష్కరణ సభను హైదరాబాదులో ఏర్పాటు చేసిన విశ్వబ్రాహ్మణ ధర్మపీఠం సంచాలకులు శ్రీ వడ్లమూడి చంద్రశేఖర శాస్త్రిగారు తదితర కార్యకర్తలకు, సభాధ్యక్ష స్థానాన్ని అలంకరించిన ధర్మపీఠ సభాపతి శ్రీ వాసిలి వేంకట లక్ష్మీ నరసింహారావుగారికి, గ్రంథావిష్కర్త ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారికి, గ్రంథాన్ని సమీక్షించి ఉపన్యసించిన ఆచార్య రవ్వా శ్రీహరిగారికి నా నమస్సుమాంజలులు.

గ్రంథ ప్రచురణ బాధ్యత వహించి సకాలములో దానిని నెరవేర్చిన ప్రఫుల్లచంద్రకు ఆశీస్సులు.

ఈ గ్రంథాన్ని సకాలములో ముద్రణ మొనర్చిన వాణీ ఆర్టు ప్రింటర్స్, తెనాలి యజమానులు శ్రీ టి. శివశంకరరావు గారికి, వారి సిబ్బందికి నా ధన్యవాదాలు.

ఆంధ్రపాఠకలోకము ముందరి మూడు భాగములవలెనే ఈ చతుర్థ భాగమును ఆదరింతురు గాక!

విజయవాడ
25-2-'97

శోభిరాల సుందరం
(బాలాత్రిపుర సుందరి)

# విషయానుక్రమణిక



నవమోన్మేషము


| | |
|---|---|
| సమాజము - శిల్పి జనాదరణము | 1 |
| శిల్పిపూజ | 2 |
| విశ్వకర్మ - హావిర్భాగములు | 4 |
| శిల్పులకు యజ్ఞ భాగార్హత | 5 |
| శిల్పాచార్యుల పురోహితత్వము | 6 |
| దేవబ్రాహ్మణ పూజ | 9 |
| బ్రాహ్మణానుగ్రహము | 11 |
| విశ్వకర్మల కాచార్యనామ ప్రసిద్ధి | 13 |
| రాజ్యాంగమున రథకారులు | 14 |
| కర్మారులు | 18 |
| చక్రవర్తి - చతుర్దశ రత్నములు | 19 |
| ప్రకృతులు - శ్రేణీముఖ్యులు | 21 |
| శ్రేణీముఖ్యుల ప్రాముఖ్యము | 23 |
| శిల్పిజనపోషణము | 24 |
| వార్త | 25 |
| శిల్పుల వేతనములు | 27 |
| శిల్పి పర్యాయపదములు | 28 |
| చతుర్విధ శిల్పులు | 29 |
| అష్టాదశ తీర్థులు శిల్పులు | 31 |
| స్థపతి | 34 |
| సూత్రగాహి | 35 |
| తక్షకుడు | 36 |
| వర్ధకి | 37 |

పాతాళలోక ప్రభువు 132
సౌరవిజ్ఞానవేత్తలు : సంపాతి జటాయువులు 134
దూరవీక్షణ యంత్రము 135
అస్త్రకళాచార్యుడు : ద్రోణాచార్యుడు 136
వస్వంశ సంభూతుడు : గాంగేయుడు 139
ధౌమ్య పురోహితుడు 140
పురోచన శిల్పాచార్యుడు 142
లోహితాక్ష స్థపతి 143

ఏకాదశోన్మేషము

పంచాననాలోకనము - పంచమవేదార్థ దర్శనము 147

అనుబంధములు

చతుష్షష్టి కళలు 157
విశ్వకర్మ సూక్తము - 1 162
విశ్వకర్మ సూక్తము - 2 164
దుర్గాస్తోత్రము 166





8-2-97న హైదరాబాదులో జరిగిన గ్రంథావిష్కరణ సభలో వరుసగా
డా॥ రవ్వా శ్రీహరి, సాహిత్యబ్రహ్మ డా. వి.వి.యల్. నరసింహారావు
ఆవిష్కర్త డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, విశ్వశ్రీ వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రిగారలు.



గ్రంథకర్త డా॥ శోభిరాల సత్యనారాయణగారి ప్రథమ సంస్మరణ సభలో
డా॥ దోరణాల సోమనాధరావు, డా॥ వి.వి.యల్. నరసింహారావు,
డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, పసునూరి బ్రహ్మానందాచార్యులు,
విశ్వజ్ఞ వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి, డా॥ రవ్వా శ్రీహరి, మాతృశ్రీ చిట్టిమెళ్ళ బృందావనంగారలు.



శోభిరాల సత్యనారాయణగారి ప్రథమ వర్ధంతి సభలో స్మారక పురస్కారాన్ని
డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారికి అందజేస్తున్న వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి తదితరులు



గ్రంథకర్త ధర్మపత్ని శోభిరాల బాలాత్రిపుర సుందరిగారికి జ్ఞాపికను అందజేస్తున్న
డా॥ వి.వి.యల్. నరసింహారావుగారు



# శ్రీ మహాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## నవమోన్మేషము

## సమాజము - శిల్పిజనాదరణము

త్వామిద్ధి హవామహే సాతా వాజస్య కారవః

— ఋగ్వేద 6-46-1 *

ఐశ్వర్యవంతుడయిన ఓ రాజా! నీవు మా సహాయమును స్వీకరించినచో శిల్పులమయిన మేము మా శిల్పవిద్యతో ననేక వస్తువులను త్పత్తి చేసి నిన్ను మిక్కిలి ధనవంతుని చేయుదుము.1

ఇంద్ర సదృశుడయిన ఓ రాజా! విద్యవలన - విజ్ఞానము వలన నగు వివిధ కార్యములను చేయు శిల్పులను సమీకరించి సత్య ప్రకాశకుడవు గమ్ము.

ఇది రాజధర్మము.2

---

* పోల్చు :- యజుర్వేద. 27-37; అథర్వ. 20-98-1

1. కారవః - కారీగర్, 'హమ్ లోగ్ శిల్ప విద్యాసే అనేక పదార్థోం కో రచకర్ ఆప్ కో బనా ధనీకరేఁ.'

—దయానంద ఋగ్వేద భాషా భాష్యము - పు - 563

2. 'శిల్పియోం కా సంగ్రహ కర్నే ఔర్ సత్యకే ప్రచార్ కర్నేవాలో హోఁ!

—దయానంద యజుర్వేద భాషా భాష్యము - పు-231

తమస్సు నుండి వెలుగులోనికి పోవునట్లు, అవిద్యను- అజ్ఞానమును తొలగించి విద్యను - ఆత్మజ్ఞానమును శిల్పక్రియా కౌశలమును పొందునట్లు మేము పాపకర్మాచరణమును దూరము చేసి సత్కర్మాచరణము చేయుదుము గాక.

విద్యాధన సంపన్నుడవు, విద్యాధనరక్షకుడవు నగు నో యింద్రా! బహుముఖ ప్రజ్ఞావంతుండయిన శిల్పి వాక్కులను పాలింపుము.[1]

జ్యోతిర్వృణీత తమసో విజానన్నారే స్యామ దురితా దభీకే।
ఇమా గిరః సోమపాః సోమవృద్ధ జుషస్వేంద్ర మాన్యస్య కారోః॥[2]
— ఋగ్వేద. 3-39-7

## శిల్పి పూజ

సత్కృతాశ్చ ప్రయత్నేన ఆచార్య ఋత్విక్ పురోహితాః।
మహేష్వాసాః స్థపతయః సాంవత్సర చికిత్సకాః॥
ప్రజ్ఞా మేధావినో దాంతా దక్షా శ్శూరా బహుశ్రుతాః।
కులీనా స్సత్త్వ సంపన్నా యుక్తా స్సర్వేషు కర్మసు॥
పూజయే ద్ధార్మికాన్ రాజా నిగృహ్ణీయా దధార్మికాన్।*

వ్యా. భా. శాంతి 86-16, 17

1. దయానంద — ఋగ్వేద భాషా భాష్యము— పు. 341, 342.
2. (కారోః) శిల్పిజన్ కో (ఇమా గిరః) ఉన్ వాణీ యోం కా (జుషస్వ) సేవన్ కరో.

* "Sthapatis meaning appearently architects, are stated here to be very learned, meritorious, patient, dexterous, champion of large experience of high birth, full of resources and capable of appreciation all works".

—P. K. Acharya: A Dictionary of Architecture.

రాజగువాడు ఆచార్య ఋత్విక్ పురోహితులను ధనురాచార్యులను, శిల్పాచార్యులను, (స్థపతులను) సత్కరించుచుండవలయు నని మహాభారతము శాసించుచున్నది.

కృత మెఱిగి కర్త నుత్తమనుతుల సభల
సంస్తుతుంచి మఱవక తగ స
త్కృతి సేయుదె ? కృత మెఱిగెడు
పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించున్.

—నన్నయ-సభా, 1-38

అని నారదుడు ధర్మరాజును ప్రశ్నించినాడు. ఇట కర్త యన శిల్పకార్యకర్తయే. మూల శ్లోకమునకు వివరణము వ్రాయుచు శ్రీపాద దామోదర సాతవలేకర్ అట్లే వివరించినాడు.[1]

కశ్చిత్ కృతం విజానీషే కర్తారం చ ప్రశంససి।
సతాం మధ్యే మహారాజ సత్కరోషి చ పూజయన్ ।

—వ్యా. భా., సభా-5-108

'పురోచనుండు తన చేసిన శతుశ్శాల సకల జనమనోహారం బయిన దానిని జూపినం జూచి పాండుసుతులు సంతసిల్లి పురోచన శిల్పాచార్యులం బూజించి పుణ్యాహవచన పూర్వకంబుగా గృహ ప్రవేశము చేసిరి.' —నన్నయ- ఆది. 6-150

సభాభవనమును 'విచిత్రంబుగా రచియించి తెచ్చి' యిచ్చిన మహాశిల్పి మయుని ధర్మరాజు సత్కరించినాడు. 'ధర్మరాజు చేత సత్కృతుండయి మయుండరిగె.' —నన్నయ- సభా., 1-7, 14

ఈ విధముగా మహాభారతమున భవననిర్మాణాదులు చేయు స్థపతులు- శిల్పులు పూజింపబడుచుండిరి.

1. 'శిల్పియోంకా కియా కార్య తో జాన్‌లేతే హో ఔర్ ఉన్ కీ ప్రశంసా తో కర్ తేహో .... .... .... .... ఉన్ కా సత్కార్ తో కర్ తేహో ॥
—వ్యా. భా. సభా. 5-108 (సాతవలేకర్ ప్రతి)

# విశ్వకర్మ : హవిర్భాగములు

అగ్నే పత్నీరిహా వహ దేవనా ముశతీరుప ।
త్వష్టారం సోమ పీతయే॥ —ఋగ్వేద. 1-22-9 *

ఓ అగ్నిహోత్రుడా! సోమము నపేక్షించు నట్టి దేవభార్యలగు నింద్రాణ్యాదులను, త్వష్టయను దేవతను, సోమపానము కొఱకు యజ్ఞ సమీపమునకు పిలుచుకొనిరమ్ము.

శిల్పవిద్యా సిద్ధి కొఱకు పృథివ్యాది పదార్థముల సామర్థ్యము ను ప్రకాశింపజేయుటకు ముఖ్యసాధనము భౌతికాగ్ని. అట్టి అగ్నిని స్వీకరించి, పత్నీ రూపమున నున్న పృథివ్యాది పదార్థములను త్వష్టను- శిల్పిని- శిల్ప విద్యారూప యజ్ఞమునకు మీ చెంత చేర్చుకొనుడు. —దయానంద : ఋగ్వేద భాషాభాష్యము- పు. 28

ఒకానొకప్పుడు ప్రమాదవశమున విష్ణువు శిరము తెగిపోగా బ్రహ్మదేవుడు విశ్వకర్మను పిలిచి, 'ఓ సురవర్ధకీ ! సమస్త యజ్ఞము లందు నీకు భాగము కల్పింతును. సోమయాగము నందు నీవు వేద విదులచేత మొట్టమొదట పూజింప బడుదువు. తెగిపోయిన విష్ణుమూర్తి శిరము నదికింపు' మని యర్థించినట్లును, విశ్వకర్మ యందుల కంగీకరించినట్లును స్కాందపురాణమునందు గలదు.

దా స్యామి సర్వయజ్ఞేషు విభాగం సురవర్ధకీ ।
సోమే త్వం ప్రథమం వీర పూజ్యసే శ్రుతి కోవిదైః॥
తద్విష్ణోశ్చ శిరస్తావత్ సంధత్స్వా ఽమరవర్ధకే।
—హయగ్రీవోపాఖ్యానము-41-6

* పోల్చు :- 'సజూర్దేవేన త్వష్టా సోమం పిబస్వాహా'
కృష్ణ. యజు. 1-4-27-1

బ్రహ్మదేవుని కోరికపై నతిచతురుఁడైన విశ్వకర్మ, హాయ శీర్షమును ఖండించి విష్ణుమూర్తి మొండెమున కదికి సమస్త యజ్ఞము లందు ప్రథమగణ్యుడైనాడు.[1]

## శిల్పులకు యజ్ఞ భాగార్హత

శిరః పశోస్తే దాస్యంతి భాగం యజ్ఞేషు మానవాః।
ఏష తే ఽనుగ్రహస్తక్షన్ శీఘ్రం కురు మమప్రియమ్॥
— వ్యా. భా. ఉద్యోగ. 8-38 *

ఓ తక్షుడా! మానవులు నీకు యజ్ఞములందు ముఖ్య భాగము నొసగుదురు. కావున నన్ననుగ్రహించి త్వరగా నాకు మేలు చేయుమని యింద్రుడు తక్షుని ప్రార్థించెను.

అమరేంద్రు డిట్లుక తక్షకుని శరణుఁజొచ్చి ప్రాధేయపడుటకు కారణ మీ క్రింది కథయందు గాననగును.

"దేవతల యందు మాన్యుండైన త్వష్టయను పేరంబరగువాడు వాసవునకు గీడు దలంచి మూడు తలలవాని నొకని సృజియించి విశ్వరూప నామధేయుం జేసిన నతం డింద్ర పదవిఁ గోరి ఘోర తపంబు చేయుచున్న దానికి భయంబంది నిలింపపతి యప్సర స్త్రీల దత్తపోభంగంబు సేయుండని నియమించి"[2] పంపెను. కాని ప్రయోజ నము లేకపోయెను. అపుడు వజ్రియే వాని తలలు ద్రెళ్ళనేసెను.

1. స్కంద పురాణము-1. హయగ్రీవోపాఖ్యానము. అ. 41. శ్లో. 6, 7. సంక్షిప్త ప్రతి : శ్రీరామశర్మా ఆచార్య భాషానువాద సహితము. పు. 479. పోల్చు :- దేవీభాగవతము-స్కంద-1, అ. 5-104.

* పోల్చిచూడు :- వ్యాస, దేవీభాగవతము- స్కం. 6. అ. 2. శ్లో. 19-20
ఇంద్రఉవాచ॥ మఖేషు ఖలు భాగం తే కరిష్యామి సదైవ హి॥
శిరః పశోస్తు తే భాగం యజ్ఞే దాస్యంతి మానవాః।

2. తిక్కన. ఉద్యోగ. 1-117

తెగిపడిన శిరములు మరల సజీవములయి భయంకరాకృతి దాల్చుచుండెను. ఇంద్రుడు భీతచిత్తుడై ఉపాయాంతర మాలోచించుచుండగా నంతలో నొక వర్ధకి భుజస్కంధముపై పరశువును బెట్టికొని యా దారిని బోవుచు గన్పించెను.[1] ఇంద్రుడు వానిని శరణువేడి యీ విశ్వరూపుని శిరచ్ఛేదము చేసినచో నికముందు నీకు యజ్ఞములలో భాగము కల్పింతునని చెప్పి వానిచేత నొప్పించెను.

—వ్యా. భా. ఉద్యోగ. అ. 8.

ఇంద్రుడు చెప్పిన పనిచేసి యింద్రునకు ప్రీతిపాత్రుడై యజ్ఞ భాగార్హత పొందిన తక్షుడు త్వష్టకంటే భిన్నుడైన యొక సామాన్య దేవవర్ధకి. వీనివలన విశ్వకర్మ స్థానీయులగు శిల్పుల కెల్లరకు యజ్ఞ భాగార్హత కలిగినది.

## శిల్పాచార్యుల పురోహితత్వము

అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాది।
తస్య త్వష్టా విదధద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజానమగ్రే॥*

1. వ్యా. భా. ఉద్యోగ. 8-28

* 'విశ్వం సర్వం కర్మ క్రియమాణ మస్య స విశ్వకర్మా.'
'తస్య పరమేశ్వరస్య సామర్థ్య మధ్యే కారణాఖ్యే ఽగ్రే సృష్టేః ప్రాగ్ జగత్ సమవర్తత వర్తమానమాసీత్. తదానీం సర్వ మిదం జగత్కారణ భూతే మేవ నేదృశమితి. తస్య సామర్థ్యాంశాన్ గృహీత్వా త్వష్టా రచన కర్తేదం సకలం జగత్ విదధత్, పునశ్చేదం విశ్వం రూపవత్వమేతి.

— దయానంద సరస్వతి

యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః।
పూర్వో యో దేవేభ్యో జాతః నమో రుచాయ బ్రాహ్మయే॥*

—శుక్ల. యజుర్వేద : వా. సం. అ. 31. 17-20

'పరమేశ్వరుడగు విశ్వకర్మ జలములనుండి సారమును గ్రహించి భూమిని రచించినాడు. జగత్తు పుట్టకముందది యీశ్వరుని సామర్థ్యము వలన కారణ రూపమున నుండెను. ఆ విశ్వకర్మ పరమేశ్వరుని సామర్థ్యాంశమును గ్రహించి రూపకర్తయగు త్వష్ట కార్యజగత్తును నిర్మించినాడు. అట్లు జగత్తునకీ స్థూలరూప మేర్పడినది.

ఆ త్వష్ట్ర ప్రజాపతియే దేవతలకు వెలుగు నిచ్చువాఁడు. అతడే దేవతలకు పురోహితుడు. అతడే అందరికంటే ముందు జన్మించినవాఁడు. అట్టి యానంద స్వరూపునకు నమస్కారము.'

త్వష్ట్ర విశ్వకర్మయే దేవతల కాచార్యుడు

— (వాయు. ఉ. భా. 22-19)

అంగిరోముని మరుత్తుని పితామహుడగు కరంధముని కుపాధ్యాయుడు.[1] అంగిరసుండయిన బ్రహ్మమానసపుత్రుని కొడుకులలో

'బృహస్పతి వేల్పుల కాచార్యుఁడై లోకపూజితుఁడై వెలింగె.'

(నన్నయ. ఆది. 3-66)

* The Universe before the creation existed (potentially) in its cause called the Samarthya of God who is called Viswakarma-the Universal Architect....
The Tvasta—the Fashioner- (as it made the Universe with parts of that Samarthya. Then the whole universe assumed visible form."
—An introdudtion to the commentary on the Vedas by Swamy Dayananda Saraswathi.
—English tr. by Ghasi Ram p. p. 80, 81.

1. తిక్కన. అశ్వమేధ. 1-32; 1-53

అంగిరసుని చిన్నకొడుకు సంవర్తుడు. మరుత్తుని అశ్వమేధ యాగమునం దుపద్రష్ట.[1]

బ్రహ్మ హృదయంబునఁ బుట్టిన భృగుమహర్షి వంశమున 'శుక్రుండు పుట్టి యసురుల కాచార్యుండయ్యె.'

— నన్నయ. ఆది. 3-69

త్రైలోక్యాధిపత్యము కొఱకు పరస్పరము కలహించుచు దేవతలు బృహస్పతిని, అసురులు శుక్రుని పురోహితులుగా నెన్నికొనిరి.

జిగీషయా తతో దేవావవ్రిరే ఽంగిరసం మునిమ్ ।
పౌరోహిత్యేన యాజ్యార్థే కావ్యం తూశనసం పరమ్॥

—వ్యా. భా. ఆది. 76-6, 7

శుక్రాచార్యుని తనయుడయిన త్వష్టాధరుడు- లేక త్వష్ట-శండామర్కుల వలె అసురయాజకుడే. — నన్నయ ఆది. 3-69

త్వష్ట్ర ప్రజాపతి కుమారుఁడయిన విశ్వరూపుఁడు బృహస్పతి లేని సమయమున దేవతలకు పురోహితుఁడై దేవగురు పీఠ మలంకరించినాడు.

విశ్వరూపో హి వై త్వాష్ట్రః పురోహితో దేవనామాసీత్ ।

వ్యా. భా. శాంతి. 343-20 *

ఈ విధముగా అంగిరసులు, భృగుకులోత్పన్నులు మొదలగు శిల్పి బ్రాహ్మణులు సురాసురులకు పురోహితులుగా నాచార్యులుగా నున్నట్లు తెలియుచున్నది.

1. తిక్కన అశ్వమేధ. 1-80

* పోల్చు :- 'విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్॥'

— కృష్ణయజుర్వేద- 2-51.

'దేవాచార్యస్య మహతో విశ్వరూపస్య ధీమతః।'

— బ్రహ్మాండ 2-3-59-20

## దేవబ్రాహ్మణ పూజ

దేవబ్రాహ్మణులనగా దేవకార్యములు చేయు బ్రాహ్మణులు. 'రాజ్యపదస్థుడయిన క్షత్రియుడు భూరి దక్షిణంబులయిన యజ్ఞంబుల దేవబ్రాహ్మణులం దృప్తులం జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులు గోసహస్రంబులు నిచ్చి దురితంబు వలనం బాసి తమోవిముక్తుం డయిన చంద్రుండునుం బోలె వెలుగు.'

— నన్నయ- అరణ్య-1-256

వణిజః కర్షకా గోపాః కారవః శిల్పిన స్తథా।
దేవకర్మ కృతశ్చైవ యుక్తాః కామేన కర్మసు॥

వా. భా. శాంతి. 167-32

కారు[1]వన సృజనాత్మక శక్తిగల శిల్పకళాకారుడు.

శిల్పి[2]యన చిత్రలేఖనాది శిల్పములు రచించువాడు.

దేవకర్మకృత్తు- అనగా దేవతా విగ్రహ రచనా స్థాపనాది దేవశిల్పములు చేయువాడు.

నిత్యం శుద్ధం కారు హస్తః॥

— మనుస్మృతి 5-129

"The hand of an artist employed in his art is pure"

1. చూడు :- డా॥ శోభిరాల- శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము ప్రథమ భాగము పు- 11-16

2. చూడు :- డా॥ శోభిరాల- శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము ప్రథమ భాగము పు- 54

బ్రాహ్మణులలో 'శిల్పకృతుల బ్రతుకువారు' గలరు.[1] శిల్పులలో 'దేవకర్మ కృత్తులు' గలరు.

దేవకర్మ కృత్తులనగా యజ్ఞశాలా యజ్ఞవేదికా దేవతాయతన నిర్మాణాది దైవశిల్పములు చేయువారు. వీరినే దేవబ్రాహ్మణులనియు, శిల్పిబ్రాహ్మణు లనియు నందురు. ఈ శిల్పాచార్యులనే నేడు విశ్వబ్రాహ్మణు లనుచున్నారు.

మహాభారతమున యజ్ఞశిల్పములు వర్ణింపబడినవి. అశ్వమేధ యాగ మొనరింప దలపెట్టిన ధర్మనందను డనిలనందను జూచి

"యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారకు
విడియం దగియెడు వివిధ గృహంబుల నొనరింపు"

మని పనిచెను.*

అతడును శిల్పులచేత,

'యజ్ఞవాటమును జనాధిపులకు ముని
వ్రాతములకు విడియ వలయు నట్టి
మందిరములు కనకమయంబులుగా'[2] నొసరింపజేసెను.

ధర్మజు నశ్వమేధమున యజ్ఞవాటమును విడిదిగృహములు నిర్మించిన ఈ స్థపతులు ప్రాజ్ఞులు, యజ్ఞకర్మలకు యజ్ఞకర్మకుశలురు

తతో యయౌ భీమసేనః ప్రాజ్ఞైః స్థపతిభి స్సః ।
బ్రాహ్మణా నగ్రతః కృత్వా కుశలాన్ యజ్ఞకర్మణి ॥
వ్యా. భా. అశ్వ- 85-11

1. తిక్కన. అనుశాసనిక- 3.175 (వ్యా. భా. అనుశాసనిక-90-8)
'శిల్పం యశ్చోప జీవతి'

* శ్రీమదాంధ్రమహాభారతము. అశ్వమేధ. అశ్వ 4-132

2. తిక్కన- అశ్వమేధ- 4-132 (వ్యా. భా. అశ్వమేధ- 85-11)

తన్నిర్మాణ కౌశలము నెఱిగిన జనులు పొగడిరి.

యజ్ఞారంభముననే ధర్మరాజు శిల్పసంఘములకు బహుమతు లిచ్చి పంపెను.

'యజ్ఞవాటంబు దక్కటి యాలయములు, లలితభంగి రమ్యములు సలక్షణములుగా నొనర్చిన శిల్పినికాయమునకు బసదనం బిచ్చె సంతసం బెసకమెసగ'[1]

యాగాంతమున ధర్మజుడు విప్రాదులకు దానము లిచ్చినాడు.

'అతుల కనక మయములైన యజ్ఞవాట వేదికా
యూప తోరణ వివిధ భాండ
దండ శయ్యాసనమ్ము ధరణీనాథు డొసగె
విప్రచయంబుల కుల్లమలర.[2]

దీనినిబట్టి మహాభారత కాలమున రాజులు యజ్ఞములతో శిల్పిబ్రాహ్మణులను, బ్రాహ్మణులను పూజించుచుండిరని తెలియ వచ్చును.

## బ్రాహ్మణానుగ్రహము

'బ్రాహ్మణానుగ్రహంబునం జేసి తొల్లి వైరోచనాదు లనేక కాలంబు లక్షయ లక్ష్మీవిభవు లయి సముద్రనేమి భూ చక్రంబు రక్షించిరి. అనిల సహాయుండయిన యగ్నిదేవు డరణ్యంబు దహించునట్లు బ్రాహ్మణ సహాయుం డయిన మహీశు డు శత్రువర్గంబు నిశ్శేషంబు సేయు' నని ఒక దాల్భ్యుడు ద్వైతవనంబు నందున్న ధర్మరాజుతో చెప్పినాడు.

— నన్నయ. అరణ్య. 1-207

1. తిక్కన- అశ్వమేధ 4-139
2. తిక్కన- అశ్వమేధ 4-199

ద్వైతవనమున పాండవులతో నున్న భూసురోత్తములలో భృగువులు, అంగిరసులు, వాసిష్ఠులు, కాశ్యపులు, ఆగస్త్యులు, ఆత్రేయులు మున్నగు సర్వజగచ్ఛ్రేష్ఠులయిన బ్రాహ్మణులున్నారు.

భృగవో౽ంగిరసశ్చైవ వాసిష్ఠాః కాశ్యపైః సహ।
ఆగస్త్యాశ్చ మహాభాగా ఆత్రేయాశ్చోత్తమ వ్రతాః॥
సర్వస్య జగతః శ్రేష్ఠా బ్రాహ్మణాః సంగతాస్త్వయా।
— వా. భా. వన. 26-7, 8.

భృగ్వంగిర ఆదులు అథర్వణ బ్రాహ్మణులు, శిల్పాచార్యులు. వీరు అథర్వణవేదోక్త విధులతో శాంతికపౌష్టికాదులొనరించి రాజునకు రాజ్యమునకు మేలు గూర్తురు.

'రాజ్ఞ స్త్వథర్వవేదేన సర్వకర్మాణ్యకారయత్'
— బ్రహ్మాండ. 1-2-33-20

తమ శిల్పకౌశలముతో శస్త్రాస్త్రములు, సాంగ్రామిక రథములు మంత్రపూర్వకముగా నొనరించి రణరంగమున రాజునకు జయము గూర్తురు.[1]

—oo:o:oo—

1. శిల్పులు యుద్ధోపకరణములు చేయవలసిన విధానము అగ్నిపురాణమునందు గలదు.
'కేతుం కృష్ణన్నితిత్యేతత్ సంగ్రామే జయవర్ధనమ్'
అగ్నిపురాణ. 260-66
'యమేన దత్త మిత్యస్య కోటిహోమ విచక్షణః।
రథ ముత్పాదయే చ్ఛీఘ్రం సంగ్రామే విజయప్రదమ్॥'
అగ్ని...260-72, 73
'అయన్నో అగ్నిరీత్యే తత్ సంగ్రామే జయవర్ధనమ్.'
అగ్ని.... 260-20

# విశ్వకర్మల కాచార్యనామ ప్రసిద్ధి

విశ్వకర్మల కాచార్య శబ్దము బిరుదవాచకముగా ప్రాచీన కాలమునుండియు నున్నది. ఇందుకు వ్యాసకృత మహాపురాణములే సాక్ష్యము.

శ్రీ విష్ణుపురాణమునందు, '...అనేక శిల్పకల్పనాచార్యుం డైన విశ్వకర్మ నాకర్షించి...'[1] అనియు,

భాగవతము నందు, 'వసువునకు నాంగిరసయందు విశ్వకర్మ యను శిల్పాచార్యుం డుదయించె'[2] ననియు, త్రిపుర నిర్మాత యగు మయుడు శిల్పుల కాచార్యుడనియు ('మాయినాం పరమాచార్యం మయం...')[3] వ్రాయబడి యున్నది.

కావుననే వ్యాసభారతము నందున్నను లేకున్నను, నన్నయ శిల్పులకు గౌరవ పురస్సరముగా 'శిల్పాచార్య' శబ్దము ప్రయోగించినాడు.

జనమేజయుని సర్పయాగమండపము 'శాస్త్రోపదిష్టప్రమాణ లక్షణ నిపుణ శిల్పాచార్య వినిర్మితము'. (నన్నయ-ఆది-2-209)

1. పెన్నెలకంటి సూరనార్యుడు : ఆంధ్ర శ్రీవిష్ణుపురాణము. అ.5-155.
'తత్రచాశేష శిలకల్ప ప్రణేతారం ధాతా మివాన్యం విశ్వకర్మాణ మాహూయ ....తతశ్చ తథైవానుష్ఠిత మశేషశిల్పవిశేషాచార్య స్త్వష్టా దన్మితవాన్'....
—వ్యాస : శ్రీ విష్ణుపురాణము 4-2-53, 54
2. ఆంధ్రభాగవతము 6-254. వసోరాంగిరసీ పుత్రో విశ్వకర్మాఽఽకృతీపతిః॥ 6-6-15

మూలమునందలి 'ఆకృతీ పతిః' అను పదమునకు
'ఆకృతీ పతిః శిల్పాచార్యః' అని శ్రీధర వ్యాఖ్య. (6-6-15)

3. వేదవ్యాస : శ్రీ మద్భాగవత : స్కంధ 7. అ. 11 శ్లో-53

వారణావతమున నూతన చతుశ్శాలా గృహమును ప్రవేశము చేయుటకు ముందు పాండవులు 'పురోచన శిల్పాచార్యు లం బూజించిరి'. (నన్నయ-ఆది-6-150)

హస్తినాపురమున ధృతరాష్ట్రుడు 'వేవురు శిల్పాచార్యుల రావించి... యొక్క సభ నిర్మింపం బనిచెను'. (నన్నయ-సభా-2-129)

దీనిని బట్టి నన్నయ కాలమున (పదునొకండవ శతాబ్దమున) విశ్వకర్మలకు - శిల్పిబ్రాహ్మణులకు - 'ఆచార్య' శబ్దము బిరుద వాచకముగా నున్నట్లు తెలియుచున్నది.

## రాజ్యాంగమున రథకారులు

యే ధీవానో రథకారాః కర్మారా యే మనీషిణః।
ఉపస్తీన్ పర్ణ మహ్యాం త్వం సర్వాన్ కృణ్వభితో జనాన్॥
—అథర్వవేద 3-5-6 *

ఓ పర్ణమణీ ! ధీమంతులయిన రథకారులను, మేధాసంపన్నులైన కర్మారులను మాకు సన్నిహితులను జేయుమని రాజు ప్రార్థించుచున్నాడు.

* 1. "యే తక్షణో రథకారాః కర్మారా యే మనీషిణః।"
—అని పాఠాంతరము గలదు.
(చూడు :- పైప్పలాద సంహిత)

2. CF :- Bloomfield : Hymns of the Atharvaveda-P. 114 "The Skillful builders of chariots and ingenious workers of metal, the folk about me all, do thou, O parna, make my aids." (A.V. 3-5-6)

ఈ మంత్రార్థ మిట్లు వివరింపబడినది.

'భూజలాంతరిక్ష రథ నిర్మాతలను, లోహకారులను తదితర శిల్పకర్మములందు ప్రవీణులైన విశ్వకర్మలను (విశ్వకర్మ వంశీయులగు శిల్పవిద్వాంసులను) రాజు సత్కరించుచుండ వలయును. అట్లొనర్చినచో వారొనర్చు ననేక శిల్పకార్యముల వలన రాజునకు లోకమునందౌన్నత్యము కలుగును.*

వైదిక యుగమున రాజులు తమ రాజ్యములు స్థిరముగానుండుటకు రాజ్యాభిషేక సమయమున రథకారాధిశిల్పుల సాహాయ్యమర్థించుచుండెడివారు.

రథకార కర్మార సూత గ్రామణ్యాది రాజకర్తలకు రత్నులనిపేరు. కుటుంబ సభ్యుల వంటి వీరిని రాజు పూజింపవలయును.**

---

* చూడు :- క్షేమకరణదాస్ త్రివేది-అధర్వవేద భాషాభాష్యము- పు. 40
—దయానంద సంస్థాన్ ప్రచురణ.

"సబ్ మనుష్యాం ఔర్ విశేష్ కర్ రాజాలోగోం కో చాహియే కి భూమిరధ్, ఆకాశరధ్, జలరధ్ ఆదికే బనానేవాలే ఔర్ 'అన్య శిల్పకర్మా విశ్వకర్మా చతుర్ విద్వానోం కా సత్కార్ కర్ తే రహే, జిస్ సే అనేక వ్యాపారోం సే సంసార్ మే ఉన్నతి హోయే॥"

** Cf :- Bloomfield : Hymns of Atharvaveda P. 333
Notes on stanzas 6 and 7. A. V. 3-5
"The four classes of persons whose aid is regarded as desirable for the king belong to the socalled Ratnas "Jewels" of the court i. e., they are honoured and indespensible members of his household. →

రాజసూయ యాగమున రత్నహావిస్సు (రత్నినాం హావింషి) అను నొక ముఖ్యమయిన క్రతువు గలదు.

'రత్నినా మేతాని హవీగ్ంషి భవన్తి।
ఏతే వై రాష్ట్రస్య ప్రదాతారః ఏతేఽపాదాతారః॥

తైత్తిరీయ బ్రాహ్మణము 1-7-3-1

రత్నులే రాష్ట్రప్రదాతలు; వారే అపాదాతలు.

రాజ్యభారమంతయు రత్నులపై నుండును. కావున రాజు వారి గృహములలో హోమము చేసి వారిని సంతోష పెట్టవలయును.

కృష్ణయజుర్వేదము ద్వాదశరత్నులను పేర్కొన్నది.

—కృష్ణ. యజు. 1-8-9

1. పురోహితుడు, 2. రాజన్యుడు, 3. మహిషి, 4. వావాత 5. పరివృక్తి, 6. సేనాని, 7. సూతుడు, 8. గ్రామణి, 9. క్షత్త, 10. సంగ్రహీత, 11. భాగదుగ, 12. అక్షావాపుడు- అను వీరు ద్వాదశ రత్నులు.

2. The worker in wood has clearly the place of honour, needed as he was to produce the Chariots for war and the race, and the carts for agricultural purposes. He was carpenter, joiner, wheel right in one: and the fashioning of chariot is a frequest source of metaphor, the poet comparing his own skill to that of the wheelright. Next in importance was the worker in metal who melted the ore in furnace using the wing of bird in the place of bellows to fan the flame. Kettles and other domestic vessels were made of metal.

—E. J. Rapson -The Cambridge History of Indus P.89.

మైత్రాయణీసంహిత తక్షక రథకారులను పేర్కొన్నది.*

* Cf : 1. Dr. R. K. Mookerjee : Hindu Civilization
Part-I PP. 103, 104.
"...... While Maitrayani Samhita (2-ō-5) adds the Takshan (carpenter), Rathakara (Chariot-maker) called the Rajanya Raja and the Gramani as Vysya Gramani."

2. Ibid – P. 104.
" the industrial interests were represented by the Karmara, the military by the Senani, Rathakara and Suta."

3. Indus Valley Civilization : : Arts and Crafts
"among the industrial classes the potter, the weaver, the carpenter, the mason, the black-smith, the gold-smith, the jeweller, the ivory-maker and stone-cutter were the most important."
P. 20 An Advanced History of Indus

4. 'A great advance in technical knowledge is indicated by the potter's wheel, klin-burnt brick, the loring of hard substance like carnilian, and the casting and alloy of metals. A high aesthetic sence is indicated by the beautiful designs of ornaments, the superb relief figures on seals and the execution of fine stone statues.
–Ibid

5. "It is logical to conclude for this that the Rathakara being placed after the Brahmana, Rajanya and Vysya and having a special Atharva Mantra represents a different class and has the right to perform sacrifices."
–A.C. Benerjee : Studies in the Brahmanas P. 80.

6. "Oh Lord of the Vows (Agni), I place thee with the Vows of the Ribhu Gods, for performing Agnadhana (placing the fire) according to the diety ...
Ibid P. 79.

# కర్మారులు

బ్రహ్మాణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్ — ఋగ్వేద

కర్మారారిష్టశాలాసు జ్వాలే దగ్ని స్సురక్షితః ।
గృహాణి చ ప్రవేశ్యాంతర్విధేయః స్యా ద్భుతాశనః॥
—వ్యా. భా. శాంతి. 69-49 *

నగరము నందలి లోహకారుల కర్మశాల లాచ్ఛాదితములై యుండవలయును. అప్పుడు కర్మాగారముల యందలి యగ్నివలన ప్రమాదము లుండవు.

మహాభారత కాలమున నగరములందు కర్మాగారములు వెలసి యున్నవి.

రాజు ఋష్టిశక్తిప్రాసాద్యాయుధములు కవచములు మొదలగు యుద్ధసామగ్రిని చేయించుచుండవలయును.

ఆయుధాని చ సర్వేషాం శక్త్యృష్టి ప్రాస వర్మణామ్ ।
సంచయానేవ మాదీనాం కారయీత నరాధిపః ॥
—వా. భా. శాంతి 69-58

ఈ యుద్ధసామగ్రిని చేయువారు కర్మారులే.

కర్మారులు ఖడ్గాద్యాయుధములు చేయుటయే కాక వానికి పదును పెట్టుట, మెఱుగుపెట్టుట, బంగారురంగు పూత పూయుట మొదలగు పనులను చేయుచుండెడివారు.

'హారిద్రవర్ణాః సుముఖాః పీతాః[1] సర్వాయసాః శరాః' ।
—వ్యా. భా. విరాట. 42-7.

* కర్మారః లోహకారాదిః తచ్ఛాలాసు అరిష్టం సూతికాగృహం తద్రూపాసు శాలాసు అంతర్విధేయంః అచ్ఛాదితః కర్తవ్యం. —నీలకంఠ

1. పీతాః కర్మారేణ తేజనజలం పాయితాః ।

'తతస్స మాధాయ విమలాన్ భల్లాన్ కర్మార చిత్రితాన్।'

—వ్యా. భా. భీష్మ. 96-34

'తే శరాన్ సూర్యసంకాశాన్ కర్మార పరిమార్జితాన్।'

—వ్యా. భా. భీష్మ. 112-47

'సూర్యరశ్మి ప్రతీకాశైః కర్మార పరిమార్జితైః।'

—వ్యా. భా. ద్రోణ. 21-25

శాంతి సమయములందు యుద్ధ సమయములందు దేశసేవ చేయు కర్మారులు ప్రశంసనీయులు.

'..... కర్మారేభ్యశ్చ వో నమః। - యజుర్వేద

## చక్రవర్తి : చతుర్దశరత్నములు

దుష్యంతుఁడు, 'శరతలాలంకృతచక్రుఁడు చక్రవర్తి లక్షణ లక్షితుఁడు'నైన భరతుని యౌవరాజ్యమున కభిషిక్తుని జేసినాఁడు.

—నన్నయ. ఆది. 4-63; 4-103

భరతుడు తన దివ్య రథచక్ర ధ్వానములతో నింపుచు లోక మంతయు తిరిగి, రాజులనెల్లరను జయించి, వారిని వశపఱచుకొని చక్రవర్తియై సార్వభౌమ పదవి నలంకరించినాడు.

భరతం నామతః కృత్వా యౌవరాజ్యే உభ్యషేచయత్॥
తస్య తత్ ప్రథితం చక్రం ప్రావర్తత మహీత్మనః।
భాస్వరం దివ్యమజితం లోక సంనాదనం మహత్॥
స విజిత్య మహీపాలాం శ్చకార వశవర్తినః।......
స రాజా చక్రవర్త్యాసీత్ సార్వభౌమః ప్రతాపవాన్॥

—వ్యా. భా. ఆది. 74-26-29

రథచక్రములతోగాని (రథములపై నెక్కి యుద్ధములు చేసి-విజయయాత్రలు చేసి) తన యాజ్ఞలతోగాని సర్వజగత్తును వ్యాపించి యుండువాఁడు చక్రవర్తి యని టీకాకారుడు వ్రాసినాడు.*

చతుర్దశరత్నములు గలవాడు చక్రవర్తి యని బ్రహ్మాండాది పురాణములందు చెప్పబడినది.

చక్రం రథో మణిః ఖడ్గ శ్చర్మరత్నం చ పంచమమ్ ।
కేతుర్నిధిశ్చ సప్తైవ ప్రాణహీనాని చక్షతే ॥75॥
భార్యా పురోహితశ్చైవ సేనానీ రథకృచ్చ యః ।
మంత్ర్యశ్వః కలభశ్చైవ ప్రాణినః సప్తకీర్తితాః ॥76॥
రత్నాన్యేతాని దివ్యాని సంసిద్ధాని మహాత్మనామ్ ।
చతుర్దశ విధేయాని సర్వేషాం చక్రవర్తినామ్ ॥77॥**

బ్రహ్మాండ. 1-2-29

చతుర్దశ రత్నములలో ప్రాణహీనము లేడు, ప్రాణు లేడు.

చక్రము, రథము, మణి, ఖడ్గము, చర్మము, కేతువు, నిధి అను యేడును ప్రాణహీనములగు రత్నములు.

భార్య, పురోహితుడు, సేనాని, రథకారుడు, మంత్రి, అశ్వము, గజము నను యేడును ప్రాణముగల రత్నములు.

ఇట ప్రాణహీనములైన వానిలో రథము, ప్రాణులలో రథకారుడు నుండుట గమనింప దగినది.

* 'చక్రం రథచక్రం ఆజ్ఞావా అన్యతరేణ సర్వం వ్యాప్నోతీతి చక్రవర్తీ' ॥
—నీలకంఠ

** పోల్చిచూడు :- వాయుపురాణ- అ. 57. శ్లో. 68-71.
వాయు పురాణమునందు 'చర్మరత్న' స్థానమున 'ధనూరత్న' మని యున్నది.

# ప్రకృతులు : శ్రేణీముఖ్యులు

'ధర్మరాజు శుభముహూర్తమున విశ్వకర్మ నిర్మితమైన యింద్రప్రస్థపుర ప్రవేశంబు సేసి సర్వప్రకృతిజనానురాగ పరుం డయినాడు. —నన్నయ. ఆది. 8-80.

ప్రకృతిజను లనగా నెవరు ? భారతమిట్లు చెప్పుచున్నది.

'స్వామ్యమాత్యజనపదకోశ సైన్య మిత్ర దుర్గంబులను రాజ్యాంగ సప్తకంబుఁ గన్నిడి యరయవలయు నది...... ధర్మనిష్ఠం జేసి ధరణీపాలనంబు సుస్థిరంబై చెల్లు, నాంగిరస భార్గవాదులగు పెద్ద లిట్లని చెప్పిరి.'

తిక్కన. శాంతి. 2-85 *

నారదమహర్షి ధర్మజుని పరిపాలనముతో ప్రకృతుల స్థితిని గురించి యిట్లు ప్రశ్నించినాడు.

'కచ్చిత్ ప్రకృతయః సప్త న లుప్తా భరతర్షభ॥'

—సభా. 5-23

ఇట సప్తప్రకృతుల విషయమై టీకాకారుడిట్లు వివరించినాడు**

స్వామ్యమాత్య సుహృత్కోశరాష్ట్ర దుర్గబలాని చ॥

శుక్ర. 1-61

చూడు :- వా. భా. శాంతి. 69-64. (మనుస్మృతి 9.294)

** స్వామి, మంత్రి, మిత్ర, కోష, రాష్ట్ర, దుర్గ తథా సేనా ఏవం పురవాసీ-యే రాజ్యకీ సాత్ అంగ్ హై సాత్ ప్రకృతి యా హై! అథవా దుర్గాధ్యక్ష, బలాధ్యక్ష, ధర్మాధ్యక్ష, సేనాపతి, పురోహిత, వైద్య ఔర్ జ్యోతిషీ-యే భీ సాత్ ప్రకృతియా కహీ గయీ హై!

వ్యా. భా. సభా. 5-23 (అనువాదకర్త) పండిత రామనారాయణదత్త పాండేయ (చూడు : మహాభారత, గోరఖ్‌పూర్ ప్రతి)

అథవా శ్లో॥ దుర్గాధ్యక్షో ధనాధ్యక్షో ధర్మాధ్యక్షోశ్చ భూపతిః।
దూతః పురోధా దైవజ్ఞః సప్తప్రకృతయః స్మృతాః॥

ఈ సప్త ప్రకృతులకు శ్రేణీముఖ్యులను చేర్చినచో ప్రకృతుల సంఖ్య యెనిమిది యగును. లేకున్నను రాజ్యాంగ సప్తకము చెంత శ్రేణీముఖ్యులుండనే యున్నారు.

రామాయణ కాలమునందును శ్రేణీముఖ్యుల ప్రాబల్యము కలదు.

న త్వాం ప్రకృతయ స్సర్వాః శ్రేణీముఖ్యాశ్చ భూషితాః।
అనువ్రజితు మిచ్ఛంతి పౌరజానపదా స్తథా॥

—వాల్మీకి. రామా. అయోధ్య. 26-14

నందిగ్రామము వద్ద బ్రాహ్మణశ్రేష్ఠులు, శ్రేణీముఖ్యులు మాల్యమోదక హస్తములతో రాజునకు స్వాగతమును చెప్పిరి.

— వా. రా. యుద్ధ 127-14

—ooo—

## శ్రేణీముఖ్యుల ప్రాముఖ్యము

మహాభారత కాలమున వివిధవృత్తుల నవలంబించు కర్మకారులు సంఘములుగా-శ్రేణులుగా* నేర్పడుచుండిరి. ఇట్టి సంఘములకు-శ్రేణులకు-నాయకులయినవారిని శ్రేణీముఖ్యులందురు. పరిపాలనా వ్యవస్థలో శ్రేణీముఖ్యులు ప్రముఖ స్థానము వహించుచుండిరి.

హిందూ ఆర్య సమాజములో క్రీ. పూ. 500 సంవత్సరముల క్రితము లోహకారులు, దారుశిల్పులు, శిలాశిల్పులు, దంతశిల్పులు, చిత్రకారులు మున్నగువారి శిల్ప పారిశ్రామిక సంఘము లున్న వని విల్ డ్యూరంట్ వ్రాసినాడు.**

ఘోషయాత్రయందు గంధర్వులచే పట్టువడి పరాభూతుడైన దుర్యోధనుడు, 'బ్రాహ్మణులకు శ్రేణీముఖ్యులకు నేమని సమాధానము చెప్పవలయు' నని యనుకొనినాడు.

* 1. "Artisans produeing specilised goods were organised into guilds called Srenis. These guilds in course of time became sub-castes."

—History of Mankind P. 89

2. SRENI = A company of artisan following the same business, a guild or association of traders dealing in the same articles.

—Monier Williams. SED. P. 1102

** Will Durant : The Story of Civilisation — Part-I
Our Oriental Heritage - Page 400

బ్రాహ్మణాః శ్రేణీముఖ్యాశ్చ తథోదాసీనవృత్తయః ॥
కిం మాం వక్ష్యంతి కిం చాపి ప్రతివక్ష్యామి తా నహమ్॥ *
వ్యా. భా. వన. 249-16

శ్రేణీముఖ్యులనగా శిల్పసంఘాధ్యక్షులనియు ప్రకృతులనియు నీలకంఠుడు వివరించినాఁడు. "శ్రేణీముఖ్యాం శిల్పసంఘాతముఖ్యాః ప్రకృతయ ఇత్యర్థః॥

## శిల్పిజనపోషణము

గురుల వృద్ధశిల్పి వరవణిగ్బాంధవజనుల
నాశ్రితులను సాధుజనులఁ
గరుణ పేదరికము వారయకుండఁగఁ బ్రోతి
సకలజనుల నిన్ను సంస్తుతింప?

-అని నారదుడు ధర్మజుని ప్రశ్నించినాడు.

—నన్నయ. సభా. 1-47.

శిల్పిజనులు పేదఱికము పొందకుండ ధనధాన్యము లొసగి రాజు వారిని కరుణతోఁ బ్రోవవలయును.

'కశ్చిజ్జ్ఞాతీన్ గురూన్ వృద్ధాన్ వణిజః శిల్పినః శ్రితాన్ ।
అభీక్ష్ణ మనుగృహ్ణాసి ధనధాన్యేన దుర్గతాన్॥'

— వ్యా. భా. సభా. 5-73

రాజు తన కొలువులోనున్న సకల శిల్పకళాకారులకు కావలసిన సామగ్రిని, వేతనములను నాలుగేసి మాసముల కొకమారు క్రమము తప్పక యొసఁగుచుండవలయును.

* The heads of guilds are mentioned next after the priests as objects of a king's anxious concern.

—Mbh III-249-16; XII-54-20 Ravi VI, III-13

'ద్రవ్యోపకరణం కించిత్ సర్వదా సర్వశిల్పినామ్।
చాతుర్మాస్యా వరం సమ్యక్ నియతం సంప్రయచ్ఛసి?'

-అని నారదుడు ధర్మరాజు నడిగినట్లు మూలమునందున్నది.

—వ్యా. భా. సభా. 5-119*

స్వర్ణకార లోహకారాది శిల్పులను ప్రోత్సహించి వారి యభ్యున్నతికి చేయూత నొసగుట రాజధర్మము. రాజు శిల్పులకు పన్నులు విధించు నపుడు వారి ఆయవ్యయములను, శిల్పకళాస్థితిని దృష్టియం దుంచుకొనవలయును.

ఉత్పత్తిం దానవృత్తిం చ శిల్పం సంప్రేక్ష్య చాసకృత్ ।
శిల్పం ప్రతి కరానేవం శిల్పినః ప్రతి కారయేత్ ॥

—వ్యా. భా. శాంతి అ. 87, 14, 15**

## వార్త

వార్త యందు జగము వర్తిల్లుచున్నది. యదియు లేనినాడ యఖిల జనులు నంధకార మగ్నులగుదురు గావున వార్త నిర్వహింప వలయుం బతికి.

—నన్నయ సభా. 1-51

* 'Givest thou always, O king, regularly unto all the artisans and artists employed by thee the materials of their wages fcr periods not more than four months'

-P.C. Roy. Mbh. P 21.

** 'సునార్ లుహార్ ఆది శిల్పియోం కో ఉత్సాహితకర్ ఉన్‌కీ ఉన్నతి కర్‌నా రాజా కా కర్తవ్య హై. ఇన్ శిల్పియోంకీ ఆమ్‌దనీ ఔర్ ఖర్చ్ కీ పడ్‌తాల్ కర్ ఔర్ శిల్పకళా కీ దశా దేఖ్ రాజా శిల్పియోం కీ కర్ లగా వే.'

చ.ద్వా. శర్మ. హిందీ మహాభారత. శాంతిపర్వ. పు-311.

'కచ్చిత్ స్వ నుష్ఠితా తాత వార్తా సాధుభిర్జనైః।'
—వ్యా. భా. సభా. 5-80

వార్త యన కృషి పాశుపాల్య వాణిజ్యము లని దేవబోధుఁడు వివరించినాఁడు.[1] కాని అర్థ సముపార్జనోపయుక్తములగు వివిధ శిల్ప కర్మములను వార్తాశబ్దము చేత తెలియనగును.[2]

కర్మ భూమి రియం రాజ న్నిహ వార్తా ప్రశస్యతే।
కృషి వాణిజ్య గోరక్ష్యం శిల్పాని వివిధాని చ॥
అర్థ ఇత్యేవ సర్వేషాం కర్మణా మవ్యతిక్రమః।
న హ్యృతేర్థే న వర్తేతే ధర్మకామా వితి శ్రుతిః॥
—వ్యా. భా. శాంతి. 167-11, 12

ఈభూమి కర్మభూమి. ఈ భూమిపయి జనులెల్లరు కర్మశీలురు కావలయును. కృషి, వాణిజ్యము, పశుపాలనము, వివిధ శిల్పకర్మములు, ధనార్జనమునకు ముఖ్యసాధనములు; సమాజాభ్యున్నతి మూలములునని అర్థశాస్త్ర విశారదుఁడు, ధర్మార్థతత్త్వజ్ఞుఁడు నైన యర్జునుఁడు చెప్పినాడు.

వార్త యన జీవనోపాయ మని చెప్పవచ్చును.[3] రాజగువాడు ప్రజలకు శిల్పాది విద్యల ద్వారమున జీవనోపాధి - వార్త - గల్పింపవలయును.

1. వార్త : కృషి పాశుపాల్య వాణిజ్యాః। —దేవబోధ-సభా. 5-80

2. వార్తాః : శిల్పశాస్త్రి ముఖ్యేవాదిః।
చూడు. విష్ణుపురాణ. 1-9-121. శ్రీధరీయ వ్యాఖ్య.
'ఆన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతి త్వమేవ చ'

3. వార్తః : వృత్తాంతము, వర్తనము, జీవనోపాయము, అర్థానర్థ వివేచన విద్య, వార్తాకము, సంభాషణము. (శ. చం)

## శిల్పుల వేతనములు

తత్రాసన్ శిల్పినః ప్రాజ్ఞాః శతశో దత్తవేతనాః॥

—వ్యా. భా. ఉద్యోగ. 151-12

ధర్మరాజుని శిబిరములలో వివిధ వేతనములు గల శిల్పులు గలరు గదా! పనితనమును బట్టి వారి వేతనము లిట్లుండి యుండవచ్చును.

| క్రమ సంఖ్య | ఉద్యోగము | Office and Work | సంవత్సర వేతనము (పణములలో) |
|---|---|---|---|
| 1. | కార్మాంతికులు | Superintendent of manufacturers | 12,000 |
| 2. | శ్రేణీముఖ్యులు | Chief of military corporations | 8,000 |
| | రథముఖ్యులు | Chief of chariots | |
| 3. | రథాధ్యక్షులు | Superintendent of chariots | 4,000 |
| 4. | వర్ధకులు | The Carpenters | 2,000 |
| 5. | శిల్పవంతులైన పదాతులు | Trained Soldiers | 500 |
| 6. | కారువులు-శిల్పులు | Artisans and carpenters | 120 |
| 7. | ఆచార్యులు, విద్యావంతులు (అర్హత ననుసరించి) | Teachers and Learnedmen | 50C-1,000 |

1. పౌరవావ్యహారిక కార్మాంతిక మంత్రిపరిషద్ రాష్ట్రపాలాశ్చ ద్వాదశ సహస్రాః।

2. శ్రేణీముఖ్యా హస్త్యశ్వరథముఖ్యాః ప్రదేష్టారశ్చ అష్ట సాహస్రాః।

3. పత్త్యశ్వరథహస్త్యధ్యక్షా ద్రవ్యవన హస్తిపాలా శ్చతుస్సాహస్రాః।

4. రథానీక చికిత్స శాశ్వదమక వర్ధక యో యోనిపోషకాశ్చ ద్విసహస్రాః।
5. శిల్పవంతః పాదాతాః సంఖ్యాయన లేఖకాది వర్గాః పంచశతాః।
6. కారుశిల్పినో వింశతి శతకాః।
7. ఆచార్యా విద్యావంతః పూజవేతనాని యథార్హం లభేరన్ పంచశతా ఽపరం సహస్రపరమ్॥*

## శిల్పి పర్యాయ పదములు

మహాభారతము నందు శిల్ప ప్రజాపతిగా[1] విశ్వకర్మయు, దానవ విశ్వకర్మగా[2] మయుడును పేర్కొనబడినారు.

స్థపతి, తక్షక, వర్ధకి, రథకార, కర్మార, హిరణ్యకారాది శబ్దములు శిల్పి పర్యాయ వాచకములు.

1. స్థపతి (వ్యా.భా.-ఆది, 57-15; అశ్వమేధ-85-25)
2. తక్షక (నన్నయ-ఆది, 2-183)
తక్ష (వ్యా. భా,-సభా, 45-47) = వర్ధకి.
ఉద్యోగ, 8-31, 8-39

* కౌటిల్య అర్థశాస్త్ర అధి-5. అ-3. శ్రీ భారతీయ యోగి హిందీ అనువాద సహితము. —పుటలు-434, 435.

డా. శ్యామశాస్త్రి ఆంగ్లానువాదము. —పుటలు. 276-2

1. నన్నయ-ఆది, 3-68 (వ్యా. భా.-ఆది, 66-28)
2. నన్నయ-సభా, 1-4.

3. వర్ధకి (వ్యా. భా.-ఆది, 66-38; ఉద్యోగ-8-28)
4. రథకార (వ్యా. భా.-విరాట, 49-4)
5. కర్మార (వ్యా. భా.-విరాట, 42-7; ద్రోణ, 21-25)
6. హిరణ్యకర్త (వ్యా. భా.-శాంతి, 280-28)
సువర్ణకర్త (వ్యా. భా.-అశ్వమేధ, 4-37)
7. దేవకర్మకృత్తు (వ్యా. భా.-శాంతి, 167-32)
8. కారువు (వ్యా. భా.-శాంతి, 167-32)
9. శిల్పి (తిక్కన-అశ్వమేధ, 4-132)
శిల్పినికాయము (తిక్కన-అశ్వమేధ, 4-139)
శిల్పవతాంవరః (వ్యా. భా.-ఆది, 66-29; సభా, 1-11)
10. విశ్వకర్మ (నన్నయ-సభా. 1-4); (వ్యా. భా.-సభా, 1-18)
11. మహాకవిః (వ్యా. భా.-సభా, 1-6)
12. శిల్పాచార్య (నన్నయ-ఆది, 2-209; 6-150; సభా, 2-129)
ఇవిగాక చిత్రకార (వ్యా. భా.-ఉద్యోగ, 148-23).
లేఖక (సభా-5-72, అశ్వమేధ-14-8) శబ్దములు గలవు.

## చతుర్విధ శిల్పులు

శిల్పికః శిల్పినాం శ్రేష్ఠః సర్వశిల్ప ప్రవర్తకః॥
—వ్యా. భా. శాంతి. 285-77.

శివుడే సర్వశిల్ప ప్రవర్తకుడని భారతము చెప్పుచున్నది.

మానసారమునియు శిల్పశాస్త్రమునకు శివుడే మూలపురుషుడనియు నాతడే సృష్టికర్తయనియు చెప్పుచున్నాడు.

ఆ విశ్వశిల్పి చతుర్ముఖుడు. వానికి
'విశ్వభూ' అను ప్రాచీదిఙ్ముఖమునుండి విశ్వకర్మయు
'విశ్వస్రష్ట' అను ప్రతీచీదిఙ్ముఖమునుండి మనువును
'విశ్వవిత్' అను దక్షిణ దిఙ్ముఖమునుండి మయుడును
'విశ్వస్థ' అను ఉదీచీ దిఙ్ముఖమునుండి త్వష్టయు
-అను నలువురు శిల్పాచార్యులు జన్మించిరి.

విశ్వకర్మ వలన స్థపతులు, మనువు వలన తక్షకులు, మయుని వలన సూత్రగ్రాహులు, త్వష్టవలన వర్ధకులు అను చతుర్విధ శిల్పులు వృద్ధిచెందిరి.*

| మూలపురుషుడు | శివుడు జగచ్ఛిల్పి | | | |
|---|---|---|---|---|
| దిక్కులు | ప్రాక్ | ప్రతీచీ | దక్షిణ | ఉత్తర |
| ముఖములు | విశ్వభూ | విశ్వస్రష్ట | విశ్వవిత్ | విశ్వస్థ |
| శిల్పర్షులు | విశ్వకర్మ | మను | మయ | త్వష్ట |
| వంశములు | స్థపతి | తక్షక | సూత్రగ్రాహి | వర్ధకి |
| శిల్పకర్మములు | స్థాపనార్హుడు ఆచార్యుడు | రూపకల్పన చేయువాడు | సూత్రము పట్టువాడు | భవనాది నిర్మాత |

* 1. జి.కె. పిళ్ళె : ది వేస్ ఆఫ్ ది శిల్పిస్-పుటలు. 277-279.
2. విశ్వకర్మ వాస్తు శాస్త్రము:
3. "భవన్తి శిల్పినో లోకే చతుర్ధా స్వస్వకర్మణి।
స్థపతిః సూత్రగ్రాహీ చ వర్ధకి స్తక్షక స్తథా॥
—మయమతము

## అష్టాదశ తీర్థులు శిల్పులు

రాజనీతీ శాస్త్ర విషయములు చెప్పుచు కణికుడు దుర్యోధను నితో నిట్లనినాడు.

నానా విహార శైలోద్యాన సభా తీర్థ దేవతాగృహ మృగయా స్థానముల కరుగునెడ మును మానుగ శోధింపవలయు మానవపతికిన్. నన్నయ. భార. ఆది. 6-109

చారులు శోధింపవలసిన వానిలో తీర్థులునుగలరు. ఇట తీర్థు లనగా నష్టాదశమంత్రులు.

వ్యాసభారతమునం దిట్లున్నది.

(చూడు :- వ్యా. భా. ఆది. 140-64, 65)

ఉద్యానేషు విహారేషు దేవతాయతనేషు చ
పానాగారేషు రథ్యాసు సర్వతీర్థేషు[1] చాప్యథ ॥64॥

---

1. దీనికి నీలకంఠవ్యాఖ్య యిట్లున్నది.
ఉద్యానాది స్థానేషు యే సమవాయాః జనసమూహాస్తేషు ।తీర్థేషు।
'మంత్రీ పురోహితశ్చైవ యువరాజ శ్చమూపతిః।
పంచమో ద్వారపాలశ్చ షష్ఠో౽ంతర్వశిక స్తథా॥
కారాగారాధికారీ చ ద్రవ్యసంచయకృత్తథా।
కృత్యాకృత్యేషు చార్థానాం నవమో వినియోజకః॥
ప్రదేష్టా నగరాధ్యక్షః కార్యనిర్మాణకృత్తథా।
ధర్మాధ్యక్షః సభాధ్యక్షో దండపాల స్త్రిపంచమః॥
షోడశో దుర్గపాలశ్చ తథా రాష్ట్రాంతపాలకః।
అటవీపాలకాంతాని తీర్థాన్యష్టాదశైవ తు॥'
ఇతి నీతిశాస్త్రోక్తేషు॥ విచారయేత్ చారద్వారా శత్రుమ్ చికీర్షితు మితి శేషః।
కార్యనిర్మాణకర్త=శిల్పియోంకా పరిచాలక్. (గోరఖ్‌పూర్ ప్రతి)

చత్వరేషు చ కూపేషు పర్వతేషు వనేషు చ।
సమవాయేషు సర్వేషు సరిత్సుచ విచారయేత్ ॥65॥

కచ్చిదష్టాదశాన్యేషు స్వపక్షే దశపంచ చ।
త్రిభిస్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని* చారకైః॥

—సభా. 5-38 (గోరఖ్‌పూర్ ప్రతి)

మంత్రులు 'శాస్త్రవిధిజ్ఞులు' గావలయును.[1] ఈ శాస్త్రములలో నర్థశాస్త్రము ప్రధానమయినది. అర్థశాస్త్ర మనగా రాజనీతి శాస్త్రమే కాక శిల్ప శాస్త్రమును.

అష్టాదశ తీర్థులలో రాజపురోహితుడు ప్రముఖుడు. స్థాపత్యమునెఱిగి స్థపతిసవము-బృహస్పతిసవము - చేసినవాడే పురోహితుడుగా నుండ నర్హుడు.

అనవద్య వేదవేదాంగవిశారదు జపహోమయజ్ఞ ప్రశస్తు...
...బురోహితు జేసిన భూపతి తోలుఃు నుర్వీతలంబెల్ల...

—నన్నయ-ఆది. 7-61

* దీనికి పండిత, రామనారాయణ దత్త శాస్త్రి పాండేయ 'రామ' వివరణ మిట్లున్నది.

1. శత్రుపక్షకీ మంత్రి, పురోహిత్, యువరాజ్, సేనాపతి, ద్వారపాల్, అంతర్వేశిక్ (అంతఃపురకా అధ్యక్ష్), కారాగారాధ్యక్ష, కోశాధ్యక్ష, యథాయోగ్య కార్యోంమే ధన్‌కో వ్యయ కర్‌నేవాలాసచివ్, ప్రదేష్టా (పహరే దారోంకో కామ్ బతానే వాలా), నగరాధ్యక్ష (కోత్‌వాల్), కార్యనిర్మాణకర్తా (శిల్పియోంకా పరిచాలక్), ధర్మాధ్యక్ష, సభాధ్యక్ష, దండపాల్, దుర్గపాల్, రాష్ట్రసీమాపాల్ తథావనరక్షక్-యే అఠారహ తీర్థ్ హై, జిస్‌పర్ రాజాకో దృష్టి రఖ్‌నే చాహియే.

2. ఉపర్ యుక్త్ టిప్పణీమే అఠారహ తీర్థోంమే సే ఆదికీ తీన్‌కో ఛోడ్‌కర్ శేష్ పంద్రహ తీర్థ్ అపనేపక్షమే సదా పరీక్షణీయ హై.

1. నన్నయ-సభా-1-2;

దేశక్షేమము కొఱకు కాతడు చేయు శాంతికపౌష్టికాదులు అథర్వవేద విహితములు కావున పురోహితుఁ డాథర్వణ బ్రాహ్మణుడై యుండవలయును.

సైన్యాధ్యక్షులను గూర్చి నారదుఁ డిట్లు ప్రశ్నించినాఁడు-

నానావిధ రణవిజయమహానిపుణు లవార్యవీర్యు లనదగువారిన్
సేనాధ్యక్షులఁ జేసితె నీ నమ్మినవారి మాననీయుల
హితులన్ —నన్నయ-సభా, 1-3

యుద్ధము లందు విజయము సాధించుటకు చమూపతులు వ్యూహారచనము నందు యంత్రాయుధ నిర్మాణము నందు దక్షులై యుండవలయును.

మొనదీర్చు వెరవు యంత్రము లనేకము లొనర్చు నేర్పు
నాయుధముల వి
న్ననువును బోటుల కర్జంబును సేనాపతికి నైజములు
గావలయున్ *

దుర్గాధ్యక్షుడు వాస్తువిద్యావిశారదుఁడైన స్థపతియై యుండవలయును.

'దుర్గాధ్యక్షో హితో ధీమాన్ స్థపతి ర్వాస్తువేదవిత్'
(అగ్ని పురాణము, 220-7)

అష్టాదశతీర్థులలో కార్యనిర్మాణకృత్తొకడు. ఇతడు ప్రజోపయోగకార్యములను పర్యవేక్షించు ఉన్నతాధికారి.

(Chief Engineer Public Works Dept)[1]

ఈ విధముగా మహాభారత కాలమునందు అష్టాదశతీర్థులలో శిల్పులకు, శిల్పశాస్త్రజ్ఞులకు చోటుండుట గమనింపదగినది.

* తిక్కన-శాంతి, 2-380.

1. Radha Kumud Mookerji-Ancient India.

# స్థపతి

స్థపతిః స్థాపనాయార్హః వేదవిచ్ఛాస్త్ర పారగః।
స్థాపనాధిపతిర్యస్మాత్ తస్మాత్ స్థపతి రుచ్యతే॥

—మానసారము.*

ఆయా దేవతామూర్తులను స్థాపించుటకు అర్హతగల వేదవేత్తయు వివిధశాస్త్ర పారంగతుడును నై విగ్రహస్థాపన కధిపతియైన వాడు స్థపతి యనబడుచున్నాడు. స్థపతి ఆచార్యపీఠము నలంకరింపదగినవాడై యుండవలయును. అధర్వణ వేదమును ద్వాత్రింశత్

---

* పోల్చుచూడు :- శిల్పరత్నమ్. 1-34
"స్థపతి స్థాపనార్హః స్యాత్ సర్వశాస్త్రవిశారదః"

Cf. Manasara Silpa Sastra-1. Quoted in "The Art of Indian Asia" complied and edited by Joseph Campbell. P. 320. -Pantheon Books.

"The artificier should undrestand Atharvaveda, the thirty two craft manuals (Silpa Sastras) and the Vedicmantras by which the dieties are invoked. He should be one who wears the sacred thread (i.e. he should be member of one of the upper twice born class), a necklace of holy beads and on his finger a ring of sacred kusa grass in the worship of God. He should be faithful to his wife, avoiding strange woman and should have acquired, piously, a knowledge of the various sciences. Only such a one is truely a carftsman. He must work moreover in solitude or with another artist present never before a layman."

శిల్పశాస్త్రములను అధ్యయనముచేసి తత్తద్దేవతామంత్రానుష్ఠాన పరుండై యుండవలయును. సదాచారసంపన్నుడై సద్గుణ గరిష్ఠుడై యుండవలయును.

## సూత్రగ్రాహి

సూత్రగ్రాహి వేదశాస్త్రపారంగతుడై యుండవలెను. చిత్ర రచనా నిపుణుడై యుండవలెను.

సూత్రగ్రాహి యనగా కేవలము సూత్రము పట్టువాడని చెప్పుట యసంగతము. దానికి సామాన్య కర్మకరుడు చాలును. వేద శాస్త్ర పరిజ్ఞానమేల?

ఇక్కడ సూత్ర మనగా శిల్పులు కొలతలు తీసికొనుట కుపయోగించు త్రాడు మాత్రమే కాదు. సూత్రమన శిల్ప రహస్యము.[1]

సూత్రమనగా సమస్త శిల్ప నిర్మాణములకు ముందుగా శిల్పు లేర్పరచుకొను ప్రతిరూపము, రేఖాత్మకమైన రచనాప్రణాళిక.[2]

'విశ్వకర్మ ప్రకాశిక' యను శిల్పశాస్త్రగ్రంథము సురగణము లకు సూత్రధారుడైన విశ్వకర్మచే రచింపబడినట్లు గ్రంథాంతశ్లోకము వలన తెలియుచున్నది.

1. G.K. Pilli : The ways of the Silpis. P. 278
'Sutra here is meant the secret of things.'

2. "Lines or plans drawn up by the architect."
—E.W. Hopkins : The Great Epic of India. P. 56.

అథ సువిమల విద్యో విశ్వకర్మా మహాత్మా
సకల గుణవరిష్ఠ స్సర్వశాస్త్రార్థ వేత్తా
సకల సురగణానాం సూత్రధారః కృతాత్మా
భువననివసతాం సచ్ఛాస్త్రమేత చ్ఛకార

—విశ్వకర్మ ప్రకాశిక

సూత్రధారుడు శాస్త్రజ్ఞుడు, శిల్పములందు నేర్పరి, వాస్తు విద్యాబోధకుడు, మహాప్రాజ్ఞుడు, నిరంతరము యజనయాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహాది షట్కర్మనిరతుడుగా నుండవలయును.

శాస్త్రజ్ఞః కుశలో దక్షో వాస్తు విద్యా విబోధకః।
సూత్రధారో మహాప్రాజ్ఞః షట్కర్మ సు నిరంతరమ్॥

అపరాజితపృచ్ఛా. అ. 50-1,2.

# తక్షకుడు

సర్వలక్షణ త శ్శుద్ధ స్తస్మాత్ తక్షక ఈరితః॥

—విశ్వకర్మ శిల్పము.

శిల్పాచార్యున కుండవలసిన సర్వలక్షణములు కలిగి పరిశుద్ధుడై నందున 'తక్షకుడు' అనబడుచున్నాడు. తక్షణమనగా చెక్కుట. అనగా ముడి వస్తువులైన (Raw materials) అయో దారు తామ్ర శిలా స్వర్ణాదులను చెక్కిగాని, కరిగిగాని, కావలసిన రూపములు కల్పించువాడు తక్షకుడు.[1]

తక్షకుడును వేదశాస్త్ర పరిజ్ఞానము కలవాడు కావలయును. కొందరనుకొనునట్లాతనిపని కేవలము తక్షణము కాదు. నిరాకార

1. డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : శిల్పదర్శనము-పు. 253

మైన ఘనపదార్థములకు రూపకల్పన చేయుట యాతని ముఖ్యమైన పని. తక్షణేష్టకాన్యాసమూర్తి నిర్మాణ లోహకర్మ చిత్రలేఖనాదు లాతని కృత్యములే.[1]

# వర్ధకి

దేవాలయాదికాన్ సర్వాన్ వర్ధయే దితి వర్ధకిః॥

—విశ్వకర్మ శిల్పమ్.

దేవాలయములను మనుష్యాలయములను (గృహభవనప్రాసా దాదులను) తన నిర్మాణ కౌశలము చేత వృద్ధిపొందించువాడు వర్ధకి. వర్ధన మనగా వృద్ధిచేయుట-చెక్కుట యను రెండర్థము లున్నవి. వర్ధనమనగా కొయ్య మొదలగువాటిని చెక్కి రూపకల్పనముచేయుట యని కొందరు భావించిరి.[2]

వర్ధకి వేదవిదుడై మానశాస్త్రజ్ఞుడై యుండవలయును. ఇట మానమనగా వివిధ వాస్తువుల కనువగు స్థలనిర్ణయము తదనురూప మానకల్పనా నిర్మాణాదికము.

వర్ధకి చిత్రలేఖనమునందును ప్రవీణుడై యుండవలయును.[3]

1. జి.కె. పిళ్ళే : ది వేస్ ఆఫ్ ది శిల్పిస్.
2. డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : శిల్పదర్శనము-పు. 254.
3. జి.కె. పిళ్ళే : ది వేస్ ఆఫ్ ది శిల్పిస్.

# The Four Classes of Silpis

I. Stapathi : He should be proficient in all the Sastras and Vedas, in other words his study should cover all the fields of knowledge. He should be endowed with all the qualifications of an Acharya, a guru or preceptor. He must be capable of directing, and under his direction all the other classes of Silpis should work.

II. Sutragrahi : He should be well-versed in all the Sastras and the Vedas, and he should be an expert in drawing and design. The word Sutra-grahi is often interpreted literally as one who holds the string or the measuring tape; this is absurd, for holding the string only a labourer is needed, but not an expert in the Vedas and Sastras or Sciences unless the Sutra here is meant the secret of things.

III. Vardhaki : He should know the Vedic literature; should be well-versed in the science of measurement. The measurment here will mean the selection and judging of proper measure and dimensions for respective works as well as the design and construction. He should be an expert in painting and capable of judging.

IV. Thakshaka : He should study the Vedas (probably Sastras as well). He should know his work; and he should be sociable, faithful and kind in nature. He is so called because of his wo.k. His work is stated by some as carpentary; but surely it is a wrong interpretation, for. his work includes all that involve skill and labour such as carpentary, masonry, sculpture, iron-mongery, painting etc in which form and regularity is to be given to shapeless mass.

—Pillai-The Ways of the Silpis-P.P. 278-279.

## శిల్పాచార్య లక్షణము

విశ్వకర్మ కుల శ్రేష్ఠో ధర్మజ్ఞో వేదపారగః।
సాముద్రగణితానాం చ జ్యోతి శ్శాస్త్రస్య చైవ హి॥
లోహపాషాణకాష్ఠానా మిష్టకానాం చ సంకలే।
సుధానాం చిత్రకానాం చ చతుష్షష్టిక మర్మగః॥
సూత్రశాస్త్రక్రియాప్రాజ్ఞో వాస్తువిద్యాబ్ధిపారగః।
శైవవైష్ణవశాక్తేయం గాణాపత్యం చ బౌద్ధకమ్॥
కాపాలికం చ షడ్దర్శం నిర్మాణం స్థాపితం తథా।
శ్రౌతస్మార్త క్రియాప్రాజ్ఞో మంత్రతంత్రార్థకోవిదః॥
సంకల్పం చానువాకం చ మార్జనం చాఘమర్షణమ్।
పంచాంగలక్షణం స్నానం సంధ్యాదిజపతత్పరః॥
పంచయజ్ఞో మహాధ్యానం వైశ్వదేవం చ సంతతమ్।
సత్యవాక్య స్సదాచారః విద్యాకుశలబుద్ధిమాన్॥
సర్వలక్షణసంపన్నః సర్వావస్థా సుశోభితః।
ఆరోగ్య శ్చాప్రమాదీ చ సప్తవ్యసన వర్జితః॥
వేదకర్మా సదాచారః ఏకపత్నీవ్రత స్తథా।
మనుసూత్రాదిశాస్త్రజ్ఞో గుణవాన్ సత్యవాచకః॥
ఏవం గుణగణై ర్యుక్తః శిల్పాచార్య స్సదోచ్యతే॥

—మయశిల్ప శాస్త్రము. *

* చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము. పు. 191.

1. పోల్చు :- 'గణితజ్ఞః పురాణజ్ఞః సత్యవాదీ జితేంద్రియః।
చిత్రజ్ఞః సర్వదేశజ్ఞః.........
సునామా దృఢబుద్ధిశ్చ వాస్తువిద్యాబ్ధిపారగః॥—మయమతము.

చూడు :- స్థాపత్యవేదాచార్య పెదపాటి నాగేశ్వరరావు
'శిల్పము-శిల్పశాస్త్రములు' అను వ్యాసము-విశ్వశిల్పి.

2. చూడు :- వాద్రేవు సూర్యనారాయణమూర్తి -వాస్తు నారాయణీయము
ప్రతిమా లక్షణము-పుట. 98.

## పంచశిల్పములు : పాంచాలబ్రాహ్మణులు

బ్రాహ్మణానాం చ జన్మైవ శివవక్త్రాచ్చ జాయతే।
పంచవక్త్ర సముత్పన్నాః పంచభిః కర్మభిర్ ద్విజాః॥
మనుర్మయ స్తథా త్వష్టా శిల్పికశ్చ తథైవ చ।
దైవజ్ఞః పంచమశ్చైవ బ్రాహ్మణాః పంచకీర్తితాః॥
—బ్రాహ్మణోత్పత్తిమార్తాండ.*

పరమేశ్వరుని పంచముఖములనుండి పంచశిల్ప ప్రవర్తకు లయిన మను మయ త్వష్ట శిల్పి దైవజ్ఞ లనెడి పంచబ్రాహ్మణు లుద్భవించిరి.

వీరు క్రమముగా అయోదారుతామ్రశిలాస్వర్ణ శిల్పములకు మూలపురుషులై లోకమునందు ప్రవర్తింపజేసిరి.

అయసాం చ మనుః కర్తా కాష్ఠకారో మయః స్మృతః।
త్వాష్ట్రికః కాంస్యకర్తా చ శిలాకర్తా చ శిల్పికః॥
దైవజ్ఞః స్వర్ణకారశ్చ పంచానాం కర్మపంచకమ్।
యో వేద పంచకర్మాణి సర్వపాపైః స ముచ్యతే॥ **

మన్వాది పంచబ్రహ్మ కులోత్పన్నులును వారి శిష్యప్రశిష్యులును లోకమునందు పంచశిల్పములను విస్తరింపఁజేసిరి. ఈ విధముగా వంశపారంపర్యముగా పంచశిల్పముల నొనర్చు శిల్పిబ్రాహ్మణుల కే

---

* బ్రాహ్మణోత్పత్తి మార్తండ-పాంచాల బ్రాహ్మణోత్పత్తి ప్రకరణము.
అ. 51-1, 2. (లైంగే శైవాగమే)

** అదే-శ్లో. 18, 19.

పాంచాల బ్రాహ్మణులని పేరు.[1] పంచాంగుల శబ్దమునందలి 'గు' వర్ణము లోపించి, పంచాంగులములున్న చతురహస్తములు గల వీరికి పంచాల యను సంజ్ఞ యేర్పడినది.

పంచాంగులాం స్తా నిహ వర్ణలోపాత్ పంచాల సంజ్ఞా
శ్చతురాంశ్చ హస్తాన్ ॥
— రుద్రయామల వాస్తు తంత్రమ్[2]

## పాంచాల బ్రాహ్మణోత్పత్తి

అథ శైవపాంచాల బ్రాహ్మణ బ్రహ్మపాంచాల బ్రాహ్మణోప పాంచాల బ్రాహ్మణోత్పత్తిమాహా॥ —లైంగే శైవాగమే

బ్రాహ్మణానాం చ జన్మైవ శివవక్త్రాచ్చ జాయతే।
పంచవక్త్ర సముత్పన్నాః పంచభిః కర్మభి ర్జితా॥
మనుర్మయ స్తథా త్వష్టా శిల్పికశ్చ తథైవ చ।
దైవజ్ఞ పంచమశ్చైవ బ్రాహ్మణాః పరకీర్తితాః॥
మనుః సంహారకర్తా చ మయో వై లోకపాలకః।
త్వష్టా చోత్పత్తికర్తా చ శిల్పిలో గృహకారకః॥
దైవజ్ఞః పర్వభూపాదికర్తా వై హితకామ్యయా।
లోకానాం పంచ పాంచాలాః అభూవ శ్శివవక్త్రితః॥

1. పంచభిః శిల్పైః లోకం అలంకుర్వన్తీతి పంచాలాః॥ అనియొక నిర్వచనము.
2. చూడు : శ్రీ విశ్వకర్మావంశప్రకాశ. పు. 10
వైద్యవర్ జ్యేష్ఠరామ్ సూత్రధార్.

పాంచాలానాం చ పంచానాం వక్ష్యే లక్షణముత్తమమ్।
తస్య విజ్ఞానమాత్రేణ శిల్పాచారః స్ఫుటో భవేత్॥

ఐశ్వర్యం మనురూపం చ మయరూపం చ వైష్ణవమ్।
వైరించం త్వాష్ట్రిరూపం చ మాహేంద్రం శిల్పికస్య చ॥

రూపం నారాయణస్యైవ దైవజ్ఞస్య ప్రకీర్తితమ్।
పంచరూపాణి యోవేద ముచ్యతే సర్వకిల్బిషాత్॥

తమో గుణో మనుశ్చైవ మయః సత్వగుణః స్మృతః।
రజోగుణోఽథ త్వష్టా చ శిల్పిక స్త్రిగుణాత్మకః॥

దైవజ్ఞః శుద్ధసత్వశ్చ బ్రహ్మాండే స విజాయతే।
యో వై గుణత్రయం వేద ముచ్యతే సర్వబంధనాత్॥

మనుః స్ఫటికవర్ణశ్చ నీలవర్ణో మయః స్మృతః।
త్వాష్ట్రికో రక్తవర్ణశ్చ శిల్పికో ధూమ్ర వర్ణకః॥

స్వర్ణ వర్ణశ్చ దైవజ్ఞః పంచవర్ణాః ప్రకీర్తితాః।
పంచవర్ణాశ్చ యో వేద ముచ్యతే సర్వపాతకాత్॥

మనోః కుండం త్రికోణం చ చతుష్కోణం మయస్య చ।
వర్తులం త్వాష్ట్రికం చైవ షట్కోణం శిల్పికస్య వై॥

దైవజ్ఞస్యాష్టకోణం తు పంచ కుండాని తాని వై।
ఏతాని చైవ యో వేద సర్వదోషాద్విముచ్యతే॥

రజతస్య మనోర్దండో వేణుదండో మయస్య చ।
త్వాష్ట్రిస్య తామ్ర దండశ్చ లోహదండశ్చ శిల్పినః॥

సువర్ణదండ ఆఖ్యాతో దైవజ్ఞస్యాగమాత్మకైః।
పంచదండాశ్చ యో వేద ముచ్యతే సర్వతో భయాత్॥

రజతశ్చ మనోః సూత్రం పద్మసూత్రం మయస్య చ।
తామ్రసూత్రం త్వాష్ట్రికస్య కార్పాసం శిల్పికస్య చ॥

దైవజ్ఞస్య సమాఖ్యాతం స్వర్ణం సూత్రం మహర్షిభిః।
పంచసూత్రాణి యో వేద సర్వప్రాప్తైః ప్రముచ్యతే॥

అయసాం చ మనుఃకర్తా కాష్ఠకారో మయః స్మృతః।
త్వాష్ట్రికః కాంస్యకర్తా చ శిలాకర్తా చ శిల్పికః॥

దైవజ్ఞః స్వర్ణకారశ్చ పంచానాం కర్మపంచకమ్।
యో వేద పంచకర్మాణి సర్వప్రాప్తైః సముచ్యతే॥

ఋగ్వేదశ్చ మనోశ్చైవ యజుర్వేదో మయస్య చ।
సామవేద స్త్వాష్ట్రికస్య త్వథర్వా శిల్పికస్య చ॥*

సుషుమ్నా భిద వేదోసౌ దైవజ్ఞానాం ప్రకీర్తితః।
పంచవేదాంశ్చ యో వేద సాయుజ్యం లభతే నరః॥

— బ్రాహ్మణోత్పత్తి మార్తండ**

మహాభారతమున బహువిధ శిల్పకారులు కన్పించుచున్నారు. వారిలో తక్షకులు, వర్ధకులు, రథకారులు, కర్మారులు, సువర్ణకారులు, దంతకారులు, మణికారులు మున్నగువారు ముఖ్యులు.

రథకార కర్మారాదులలో కొందఱు రాజోద్యోగులు కలరు. పురోచన శిల్పాచార్యుడు దుర్యోధనసార్వభౌముని సచివుడు

* పోల్చు : "ఋగ్వేదశ్చ మనూనాం చ మయూనాం యాజుషం తథా।
త్వష్ట్రాణాం సామవేదశ్చ దైవజ్ఞానాం త్వథర్వతః॥
శిల్పినాం ప్రణవంచైవ గాయత్ర్యం సమాచరేత్।"

—స్కాంద. నాగరఖండ. అ. 13

(చూడు : కనుపర్తి బసవాచార్యస్వామి : రథకారాధికరణమ్.పు.140)

** చూడు : పం. హరికృష్ణశాస్త్రి నిర్మిత బృహజ్జ్యోతిషార్ణవాంతర్గత షష్ఠస్తబక స్కంధోక్త షోడశాధ్యాయాత్మక బ్రాహ్మణోత్పత్తిమార్తండ.పు 562.

యజ్ఞవాట యజ్ఞోపకరణాది యజ్ఞశిల్పములు చేయు శిల్పాచార్యులను, గృహనిర్మాణము చేయు స్థపతులను యజమానులు పూజించుచుండిరి.

ఈ విధముగా మహాభారతకాలీన సమాజమున శిల్పులు గౌరవప్రతిష్ఠలు గలిగి సమాజమునందు సముచిత స్థానము లలంకరించుచుండిరి.

ఈ శిల్పుల కారాధ్యదైవము విశ్వకర్మ. శిల్పకళాకారులు నిత్యమును సకలశిల్పకళాధిదైవమయిన విశ్వకర్మను పూజించుచు సుఖజీవనము గడపుచుండిరి.

మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః।
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్॥

— వ్యా. భా - ఆది; 66-30.

—o—

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## దశమోన్మేషము

## శిల్పాచార్యులు : శిల్పవిద్యా ప్రకాశకులు

దైవ్యా హోతారా ప్రథమా సువాచా మిమానా యజ్ఞం
మనుషో యజధ్యై।
ప్రచోదయంతా విదథేషు కారూ ప్రాచీనం జ్యోతిః
ప్రదిశా దిశంతా॥

—శుక్ల యజుర్వేద-29-32*

* పోల్చిచూడు :- అథర్వవేద-5-12-7 (ఋగ్వేద-10-110-7)

1. (జ్యోతిః)-శిల్పవిద్యాకే ప్రకాశికా (విశంతా) ఉపదేశకర్తే హువే (కారూ)- దో కారీగర్ లోగ్ హోవే ఉన్సే శిల్పవిజ్ఞానశాస్త్ర పఢ్నా చాహియే॥

—దయానంద. యజుర్వేద భాషాభాష్యము-పు. 243.

'అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్ని స్స్వాహా' (యజు-3-9) అను మంత్రము నందలి జ్యోతి శబ్దమునకును శిల్పవిద్యా ప్రకాశనమని యర్థము చెప్పబడినది.

2. (విదథేషు) విజ్ఞానోంమే, (ప్రచోదయంతా) ప్రేరణ్ కర్తే హువే (కారూ) దో శిల్పిరూప్...... :- క్షేమకరణదాస్ త్రివేదీ. అథర్వ. పు. 88.

3. ఋగ్వేద—10-110-7. ఇట 'కారూ' శబ్దమునకు సత్కర్మానుష్ఠానపరులను నర్థము చెప్పబడినది. యజ్ఞములు చేయుట చేయించుట వీరి పని.

(ఓ మానవులారా! విద్వాంసులందు కుశలురు, దానశీలురలో ప్రసిద్ధులు, ప్రశస్తమయిన వాక్కులు గలవారు, సంగతి మాప యజ్ఞమును చేసి విజ్ఞాన సముపార్జనమునకు ప్రేరణము కలిగించు చున్నారు. ఈ విధముగా వేదశాస్త్ర సమ్మతమయిన సనాతన శిల్ప విద్యాజ్యోతిని వెలిగించి యుపదేశించు శిల్పాచార్యుల నుండి శిల్పశాస్త్ర విజ్ఞానమును గడింపవలయును).

ఈ మంత్రమునందు 'కారూ' అను ద్వివచనము ప్రయోగింప బడుట వలన శిల్పశాస్త్రాధ్యాపకుడు, శిల్పవిద్యార్థి అను ఇద్దరు శిల్పులని తెలియవలయును. శిల్పవిద్య నెఱిగిన శిల్పి మఱొకనికి శిల్పవిద్యను నేర్పుటవలన శిల్పవిద్యా వ్యాప్తి కలుగుచున్నది.

## త్వష్ట్ర దేవుడు

సుకృత్ సుపాణిః స్వవాన్ ఋతావా దేవస్త్వష్టావసే
తాని నోధాత్ ।

— ఋగ్వేద-3-54-12*

సుందరశిల్పకర్త, సమస్తశిల్పరచనము లందు సిద్ధహస్తుడు, హితుడు, ఋజువర్తనుడు నగు త్వష్ట్ర దేవుడు మా కోరినవస్తువుల నొసగి మాకు తోడ్పడుగాక!

త్వష్ట్ర శబ్దము తక్ష్ - తనూకరణే అనుధాతువు నుండి నిష్పన్న మయినది. తనూకరణ మనగా తనువు (ఆకృతి లేక శరీరము) లేనిదానికి

* R.V. 3-54-2—The Hymns of Rigveda, Vol. I by Griffith "Deft worker, Skilful handed, helpful, holy, may Tvastar give those things to aid us"

తనువు (రూపము) కల్పించుట.[1] ఆ పని చేయువాడు త్వష్ట. అనగా శిల్పి.

త్వక్ష్ ధాతువునకు సజాతీయమును సమానార్థకము నగు థ్వక్ష్ ధాతువు పారశీక వేద మగు జండవెస్తా యందును గలదు.

చైతన్యారోపణము చేయబడిన సృజనాత్మక శక్తియే త్వష్ట్ర దేవత యని ఓల్డెన్‌బర్గ్ అభిప్రాయపడినాడు.[2]

త్వష్ట 'సుపాణి' (ఋగ్వేద - 3-54-12; 6-49-9) సుందరశిల్ప కల్పనాచణము లయిన హస్తములు గలవాడు.

---

1. తక్ష్ : to create, to produce, to pare - Moneir Williams, SED

త్వష్ట : Tvashtri m. a carpenter, maker of carriages (A. V. 12-3-33)

Creator of living beings, the heavenly builder. N. of a God (called) Su-krit, Su-pani, Sugabhasti, Su-janiman, Su-apas, apasam-apastama...etc (R.V.)

Maker of divine implements especially of Indras thunder bolt and teacher of Ribhus.

—Moneir Williams SED.

2. Cf. Dr. P.L. Bhargava — India in the Vedic Age, P. 311

"Oldenberg considers that the God is no more than the personification of creative activity." "The word Tvastar is derived from the root tvaks, the cognate of which the thwaks is found in the Avesta and therefore means artificer."

విచక్రం పరిజగ్రాహ క్రుద్ధ స్త్వష్టా మహాబలః
వ్యా భా. – ఆది., 227-34*

ఖాండవదహన సమయమున నమరేంద్రుడు కృష్ణార్జునులతో యుద్ధము చేసినపుడు త్వష్ట 'విచక్ర' మను నాయుధమును గ్రహించి యింద్రపక్షమున నిలిచి పోరాడినాడు. విచక్ర మన త్రిశూల మని నీలకంఠుడు వివరించినాడు.

సంగ్రామరంగమున శత్రువుల ముందు స్థైర్యముగా నిలుచు త్వష్ట్ర దేవుని ఆయుధ మయోమయ మయిన వాశి (బాడిస) లేక పరశువు - అని ఋగ్వేదమంత్రముల వలనఁ దెలియుచున్నది.

వాశీ[1] మేకో బిభర్తి హస్త ఆయసీ మన్తర్దేవేషు నిధ్రువిః।
— ఋగ్వేద-8-29-3

త్వష్టా......................అపసామప స్తమః
శిశీతే నూనమ్ పరశుం స్వాయసమ్ ।

— ఋగ్వేద-10-53-9

ఈ త్వష్ట దేవతాశిల్పియే. అతని యాయుధము వాశియో పరశువో యగుట ఆతని శిల్పకళాకౌశలత్వమునకు చిహ్నము.[2]

---

* 'విచక్రమ్ త్రిశూలమ్' – నీలకంఠ
'పర్వతం చాపి జగ్రాహ క్రుద్ధ స్త్వష్టా మహాబలః। అని పాఠాంతరము.
'విచక్రమ్ పరిజగ్రాహ.... ' అను పాఠమే సరియైనదివలెనున్నది.

1. 'సంగ్రామేషు శత్రూణాం పురతోఽ తిశయేన స్థైర్యవాన్ ఏతాదృశ ఏక స్త్వష్టృ నామకో దేవ ఆయసీ మయోమయధారాం వాశీమ్'– సాయణ.

2. 'One brandishes in his hand an iron knife firm in his seat amid the deities' (One brandishes : Tvastar, as the artificier of the Gods – Griffith.

2. 'His characterstic feature is the iron axe which he bears in his hand which marks him out as the skilled artificer'
— Dr. P.L. Bhargava, India in the Vedic Age.

మహాభారతకాలమున నది 'విచక్రము'గా మారినది.

దీనిని బట్టి త్వష్ట మహాశిల్పి యగుటయే గాక మహా బలుఁడయిన యుద్ధవీరుఁడనియు తెలియుచున్నది.

దేవతలు ప్రార్థింపగా దధీచి మహాముని యస్థులతో త్వష్ట యింద్రునకు వజ్రాయుధమును చేసి యిచ్చినాడు.

త్వష్ట యంత నూఱుధారల రమ్యమై
యనలకణ కరాళమైన వజ్ర
మొనరఁజేసి డీన నొర్వుము దైత్యుల
ననుచు నిచ్చె దాని నమరపతికి.

నన్నయ-అరణ్య, 3-7 (వ్యా.భా-వన, 100-23-24)

ప్రహృష్టరూపాశ్చ జయాయ దేవా స్త్వష్టార మాగమ్య తమర్థమూచుః ।
త్వష్టా తు తేషాం వచనం నిశమ్య ప్రహృష్టరూపః ప్రయతః ప్రయత్నాత్ ॥
చకార వజ్రం భృశ ముగ్రరూపం కృత్వా చ శక్రం స ఉవాచ హృష్టః ।
అనేన వజ్రప్రవరేణ దేవ భస్మీకురుష్వాద్య సురారి ముగ్రమ్॥

విశ్వనిర్మాత యైన త్వష్ట (విశ్వకర్మ) యింద్రుని కొఱకు వజ్రాయుధమును చేసి యిచ్చినట్లు ఋగ్వేదము నందు గలదు.

త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష। — ఋగ్వేద-1-32-2*
త్వష్టా యద్ వజ్రం సుకృతం హిరణ్యయం
సహస్ర భృష్టిం స్వపా అవర్తయత్ — ఋగ్వేద-85-9**

* త్వష్టా విశ్వకర్మా అస్మై ఇంద్రాయ స్వర్యం స్వర్గాయహితం వజ్రం తతక్ష తీక్ష్ణకృతవాన్। — సాయణ

** స్వపా శోభనకర్మా త్వష్టా విశ్వనిర్మాతా । — సాయణ

వజ్రనిర్మాత యయిన త్వష్ట దేవతాశిల్పి యని కొందరు వ్యాఖ్యానించినారు.[1]

ఋగ్వేదమున జగచ్ఛిల్పి యగు విశ్వకర్మాంశ సంభూతుఁడయిన త్వష్ట నానారూపసంపన్నము లయిన లోకముల నన్నింటిని సృష్టించిన రూపకర్తగా, మహాశిల్పిగా ప్రశంసింపఁబడినాడు

య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ
రూపై రపింశన్ భువనాని విశ్వా ।
త మద్య హోత రిషితో యజీయాన్
దేవం త్వష్టార మిహ యక్షి విద్వాన్ ॥

— ఋగ్వేద-10-110-9.

మహత్వపూర్ణుడగునట్టి త్వష్ట పౌరాణిక యుగమునం దొక దేవతగనే గాక దేవతాశిల్పిగను భావింపబడినాడు.[2]

భారతీయ దేవతాగణములో త్వష్ట గ్రీకుపురాణము లందలి 'హెఫెయిస్టస్' లేక 'వల్కన్' వంటివాఁడని 'గ్రిఫిత్' పండితుఁడు వ్రాసినాఁడు.[3]

1. Cf : Ralph, T.H. Griffith - The Hymns of the Rigveda
"Tvastar is the artist of Gods" - Note on R.V.1-32-3
"Tvastar : the heavenly artist"- Note on R.V. 1-186-6
2. Cf : Ralph, T.H.Griffith The Hymns of Rigveda, Vol-I P.24
"Tvastar - in the Pauranic mythology is the carpenter artisan of Gods. So Sayana says of him, he is a divinity whose duty, with relation to the Gods is carpentary."Sayana also calls the Ribhus the disciples of Tvasta (Notes on R.V. I.20-6)
3. Ibid, Note on the R.V. 1-12-10.
"Tvastar is the HEPHAISTOS or Vulcan of the Indian Panthean, the ideal artist, the divine artisan, the most skillful of workman, versed in all wonderful and admirable contrivances."

త్వష్టనామమే ఋగ్వేదకాలమునాటి గృహనిర్మాణ శిల్ప విజ్ఞానవికాసములను తెలుపుచున్నదని డా॥ కున్హాన్ రాజా అభిప్రాయ పడినాడు.[1]

త్వష్టా ప్రజాపతిర్హ్యాసీత్ దేవశ్రేష్ఠో మహాతపాః ।

వ్యా.భా.-ఉద్యోగ, 8-3

మహాతపస్సంపన్నుడయిన త్వష్టప్రజాపతి దేవతలలో శ్రేష్ఠుడు. దేవతలకు పురోహితుఁడయిన విశ్వరూపాచార్యుఁ డీతని పుత్రుఁడు. తన తనయుని వంచన చేతఁ జంపిన యింద్రుని హతమార్చుటకు త్వష్ట వృత్రుని సృష్టించినాఁడు.

తాండ్యమహాబ్రాహ్మణము నందలి యొక మంత్రమునకు భాష్యము వ్రాయుచు, త్వష్ట యొక విశిష్టబ్రాహ్మణుఁడని సాయణాచార్యులు వివరించినాడు.[2]

సాయణుడే మరియొకచోట త్వష్ట మహాకులోత్పన్నుడని వ్రాసినాడు.

న నాందిమ చమసం యో మహాకులే
ఒగ్నేర్ భ్రాతర్ ద్రుణా ఇద్భూతి మూదిమ

— ఋగ్వేద-1-161-1

1. Cf : Dr. C. Kunhanraja : The Quintessence of Rigveda
"The name Tvastar (Architect) itself shows the advanced stage which the science and art of house construction had reached at that time."

2. తాండ్య మహాబ్రాహ్మణము—18-9-6. 'ఇంద్రో వృత్ర మహం న్తస్యేయాం' 'త్వాష్ట్రనామకేన కౌనచిత్ విశిష్ట బ్రాహ్మణేనోత్పాదిత ఇంద్రస్య శత్రుః కస్యచిత్ వృత్రనామకం తం కదాచిదింద్రో హతవాన్'

—సాయణ-పు. 343

శిల్పాచార్యుఁడయిన త్వష్ట చేత నిర్మింపఁబడుటచేత నీ చమసము (యజ్ఞపాత్ర) మహాకులోత్పన్నమైనది.[1] కావున పవిత్రమైనది.

విశిష్ట బ్రాహ్మణుఁడు, మహాకులోత్పన్నుఁడునై దేవతలకు యజ్ఞపాత్రలు చేసి యిచ్చు త్వష్ట రొకప్పుడు యజ్ఞము నందు నేష్ట (ఒక ప్రధాన ఋత్విక్కు)గా వ్యవహరించినాఁడు.[2]

## ఋభు దేవతలు

శం న ఋభవః సుకృతః సుహస్తాః ।

— ఋగ్వేద-7-35-12; అథర్వ-19.11.1

శోభనశిల్పకర్మనిష్ఠులు హస్తకళాకుశలురు నయిన ఋభువులు మాకు మేలు గూర్తురు గాక !

'విధాతృ ననుగ్రహంబుననకాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి మర్త్యులమర్త్యత్వంబును బొందుదు' రని ధర్మజుఁడు ద్రౌపదితో చెప్పినాఁడు.[3]

1. 'అదూష్యత్వే కారణమాహః। యచ్చమసోమహాకులః మహాకులోత్పన్నః। త్వష్ట్రా నిర్మితత్వాత్ ।'
2. Cf : Ralph T.H. Griffith - Hymns of the Rigveda, Note on R.V., 1-15-4

"The Neshtar is one of the chief officiating priests, who leads forward the wife of the institutor of the sacrifice. In this place Nestar is said to be another name for the God Tvastar from his having on some ocassion assumed the function of Nestar priest."

3. నన్నయ—అరణ్య—1-230 (వ్యా.భా-వన, 31-42)
యస్య ప్రసాదాత్ తద్భక్తో మర్త్యోగచ్ఛత్యమర్త్యతామ్.

పుణ్యకర్మంబు లేవి? ఇష్టాపూర్తములు పుణ్యకర్మములు. యజ్ఞసదృశమయిన శిల్పము పుణ్యకర్మము. యజ్ఞోపకరణ నిర్మాణాది యజ్ఞశిల్పము పుణ్యకర్మము.

యజ్ఞో భవతి శిల్పమ్ శిల్పమ్ వైభవతు యజ్ఞః।
పుణ్యం భవతు శిల్పమ్॥ — యాజుషాథర్వణ శిల్పోపనిషత్తు.

చమసాది యజ్ఞోపకరణములు చేయుటలో తమ శిల్పకళా నైపుణ్యమును జూపి మర్త్యులయిన ఋభువు లమర్త్యులయినట్లు వేదములు ఘోషించుచున్నవి.

యో దేవాసో అభవతా సుకృత్యా శ్యేనా ఇవేదధి
దివి నిషేద।
తే రత్నం ధాత శవసో నపాతః సౌధన్వనా అభవతా
ఽమృతాసః
— ఋగ్వేద-4. 35-8*

సౌధన్వనాసో అమృతత్వ మేరిరే విష్టవీ శమీభిః
సుకృతః సుకృత్యయా।
— ఋగ్వేద-3.60.3.

ఋభువు, విభ్వ, వాజి యను ముగ్గురు శిల్పులకు సమిష్టిమీద ఋభువు లనిపేరు. వీరు అంగిరసుం డయిన సుధన్వాచార్యుని

* Cf : R V. 4.35-8 The Hymns of Rigveda - Tr. by Griffith
Ye, whom your artist skill hath raised to Godhead
have set you down above in heaven like falcons
so give us riches, childeren of Sudhanvan
O sons of strength ; ye have become immortal

"It is certain that they were originally mortals children of Manu who acquired immortality in consequence of thier marvellous skill."

పుత్రులు. శిల్పకళాధిదైవత మయిన త్వష్ట వీరికి సకల శిల్పకళ లందు (త్వాష్ట్రిమ్) శిక్షణ యొసగెను. వీరు శిల్పవిద్యాధికారు లయిన విశ్వేదేవులచే పరీక్షింపబడిరి. ఆ పరీక్ష యందు తీర్ణు లయిన ఋభు వులు దేవతల కెల్లరకు రథములు నాయుధములు నిర్మించి యిచ్చు చుండిరి.

సుధన్వన అంగిరస్యాసన్ పుత్రాస్త్రయః పురా।
ఋభు విభ్వా చ వాజశ్చ శిష్యా స్త్వష్టుశ్చ తే ఽభవన్॥
శిక్షయామాస తాం స్త్వష్టా త్వాష్ట్రం యత్కర్మ కించన।
పరినిష్ఠితకర్మాణో విశ్వే దేవా ఉపాహ్వాయన్।
విశ్వేషాం తే తతశ్చక్రు ర్వాహనాన్యాయుధాని చ।
— శౌనకాయ బృహద్దేవతా-3. 82-85*

ఈ విధముగా సుధన్వాచార్యుని పుత్రు లయిన ఋభువులు రథకారులుగా ప్రసిద్ధి గాంచిరి.

.....................ఋభవశ్చ సుధన్వనః
రథకారాః స్మృతాః దేవా ఋభవో యే పరిశ్రుతాః।
— బ్రహ్మాండపురాణ-2-3-1-107.

రథకారులయిన ఋభువులు యజ్ఞశిల్పము నందు నైపుణ్యమును జూపి యమరులై ఋభులోకమునందు దేవతలకు దేవతలుగా నుండుట శిల్పకళాప్రాశస్త్యమును దెలుపుచున్నది.

* Cf : Arthur Anthony Macdonell – The BRUHADDEVATA attributed to SAUNAKA, P.202

'In former times, there were three sons of Sudhanvan, son of Angiras, (Viz.) Rbhu, Vibhvan, and Vija and they became pupils of Tvastar. Tvastar instructed them in every art of which he was a master (Tvasta), the All Gods, who were thorrugh versed in the arts (Parinistita Karma) challanged them.'

That is to show their skills in the arts they had acquired. They then made for all the gods' vehicle and weapons.

# ఋభువుల శిల్పచమత్కారములు

రథకారు లయిన ఋభువులు చేసిన శిల్ప చమత్కారములను కొన్నింటి నీక్రింద పొందుపఱచుచున్నాను.

1. యజ్ఞశిల్పము లొనర్చి యజ్ఞభాగములకు పాత్రులయిరి.
2. త్వష్ట యొనరించిన చమసము నొకదానిని నాలుగు పాత్రలుగా జేసిరి.
3. అశ్వినీదేవతలకు త్రిచక్రరథమును నిర్మించిరి. ఆ రథము భూమ్యంతరిక్ష ద్యు సూర్యచంద్రలోకము లందు సంచరింప గలదు.
4. ఇంద్రుని రథమునకు కీలుగుఱ్ఱములను చేసిరి.
5. సర్వకామ ఫలప్రదమగు ధేనురూప యంత్రమును చేసిరి.

1. 'శమీభిర్యజ్ఞమాశత' — ఋగ్వేద-1-20-2
'ఆధారయంత వహ్నయో ఽభజంత సుకృత్యయా భాగం దేవేషు యజ్ఞియమ్ ।' — ఋగ్వేద-1-20-8
2. 'ఉత త్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతమ్ । అకర్త చతురః పునః ।' — ఋగ్వేద-1-20-6
'సుకృత్యయా యత్ స్వపస్యయా చన్ ఏకం విచక్ర చమసం చతుర్ధా॥' — ఋగ్వేద-435-2
3. 'తక్షన్ రథం సువృతం విద్మనాపసః ।' — ఋగ్వేద-1-111-1
'అశ్వః కర్త్వా రథం ఉతేహ కర్త్వః ।' — ఋగ్వేద-1-161-3
'త్రిబంధురేణ త్రివృతా రథేన త్రిచక్రేణ సువృతాయాత మర్వాక్ ।' — ఋగ్వేద-1-118-2
4. 'తక్షన్ హరీ ఇంద్రవాహా వృషణ్వసూ' — ఋగ్వేద-1-111-1
'యే హరీ మేధయోక్తా మదంత ఇంద్రాయ చక్రుః సుయుజా యే అశ్వాః ।' — ఋగ్వేద-4-33-10
5. 'తక్షన్ ధేనుం సబర్దుఘామ్', — ఋగ్వేద-1-20-3
'ధేనుః కర్త్వా ......।' — ఋగ్వేద-1-161,3,4.

## ఋ భు లో క ము

ఋభవో నామ తత్రాన్యే దేవానా మపి దేవతాః *
తేషాం లోకాన్ పరతరే యాన్ యజన్తీహ దేవతాః
స్వయం ప్రభా స్తే భాస్వంతో లోకాః కామదుఘాః పరే
— వ్యా. భా. - వన: 261-19,20.

ఈ మర్త్యలోకమునకు మీఁదై స్వర్లోకము వెలుఁగొందుచుండును. ఆ యింద్రలోకమున కంటె మీఁద నిశ్శోక మగు బ్రహ్మ లోక మనన్యదీప్తసదనమై తనదైన వెలుఁగునను జగంబు వెలుఁగఁ జేయుచుండును.[1]

దేవతలకుఁ గూడ దేవత లయిన ఋభువు లా సత్య (బ్రహ్మ) లోకము నందే యుందురు. సత్యలోకాంతర్గతమయిన యా ఋభు లోకము స్వయం ప్రకాశమానమై వెలుఁగుచు మానవులకు దేవతలకు సకల మనోవాంఛాపూర్తి కలిగించు చుండును.

సనాతనులు, దేవదేవులు నయిన ఋభువులు దివ్యశరీర ధారులయి యా లోకము నందుందురు. రాగద్వేషములు, సుఖ దుఃఖములు, జరామృత్యువులు మున్నగు ద్వంద్వముల కతీతమై యా ఋభులోకప్రాప్తి దుర్లభము కావున 'దాని యెడ వేడుక చేయుదు రింద్రముఖ్యులున్.'[2]

తథా దివ్యశరీరా స్తే న చ విగ్రహమూర్తయః।
న సుఖే సుఖకామా స్తే దేవదేవాః సనాతనాః॥
న కల్ప పరివర్తేషు పరివర్తంతి తే తథా ।

* పోల్చు : ఋభవో మరుతశ్చైవ దేవానాం చోదితో గణాః — శాంతి., 208-22
1. ఎఱ్ఱాప్రగడ — అరణ్య., 6-132;
2. అదే — 6-133

జరామృత్యుః కృతస్తేషాం హర్షః ప్రీతిః సుఖం న చ।
న దుఃఖం న సుఖం చాపి రాగద్వేషౌ కృతో మునే॥

దేవానామపి మౌద్గల్య కాంక్షితా సా గతిః పరా।
దుష్ప్రాపా పరమా సిద్ధి రగమ్యా కామగోచరైః॥

—వ్యా.భా-వన, 261-21-4

# స్వయంభూ విశ్వకర్మ

తొల్లి స్వాయంభువుండైన విశ్వకర్మ యజ్ఞంబు సేసి ఋత్విజుండయిన కశ్యపునకు దక్షిణ భూభాగమెల్ల యజ్ఞదక్షిణగా నొసగినాడు. దానికలిగి భూదేవి కశ్యపునకుఁ బట్టీక రసాతలమునకుఁ బోయిన దని లోమశుఁడు ధర్మరాజునకు చెప్పినాడు.

నన్నయ-అరణ్య-3.120-122. (వ్యా భా.వన-చిత్రశాలాప్రతి పుట-182)

మూలము నందిట్లున్నది :-

ఏతత్ స్వయంభువో రాజ న్వనం దివ్యం ప్రకాశతే।
యత్రాయజత రాజేంద్ర విశ్వకర్మా ప్రతాపవాన్॥

యస్మిన్ యజ్ఞే హి భూర్దత్తా కశ్యపాయ మహాత్మనే।
స పర్వతవనోద్దేశా దక్షిణార్థే స్వయంభువా॥

అవాసీదచ్చ కౌంతేయ దత్తమాత్రా మహీ తదా।
ఉవాచ చాపి కుపితా లోకేశ్వర మిదం ప్రభుమ్॥

న మాం మర్త్యాయ భగవన్ కస్మైచి ద్దాతు మర్హసి ।
ప్రదానం మోఘమేతత్తే యాస్యామ్యేషా రసాతలమ్ ॥
— వ్యా.భా. వన. 114. 17-29*

స్వయంభువనగా బ్రహ్మ. సృష్టికర్త. కావున నీ విశ్వకర్మ సృష్టికర్త సదృశుడు. ప్రతాపవంతుఁడయిన ఈ విశ్వకర్మ సార్వభౌముఁడై (లోకేశ్వరః) యజ్ఞము చేసినవాడని తెలియుచున్నది.

నీలకంఠుఁ డొసగిన ఐతరేయ బ్రాహ్మణము (8-21-10) శతపథ బ్రాహ్మణము (13-7-1-15) నందుఁగల యైతిహ్యమును బట్టి యీ యజ్ఞకర్త భౌవన విశ్వకర్మ యని తెలియుచున్నది.

భువనపుత్రుడగు విశ్వకర్మకు కశ్యపమహర్షి ఐంద్రమహాభిషేకము-సార్వభౌమ పట్టాభిషేకము-సార్వభౌమ పట్టాభిషేకము- చేసినాడు. కశ్యపునిచే నభిషిక్తుడైన భౌవన విశ్వకర్మ భూమినంతను, జయించి రాజ్యపాలనము చేసి, యశ్వమేధయాగము చేసినాడని యైతరేయబ్రాహ్మణము తెలుపుచున్నది.**

* 'భూమి ర్హా జగా విత్యుదాహరంతి। న మా మర్త్యః కశ్చన దాతు మర్హతి విశ్వకర్మన్ భౌవన మాం దిదాసిథ నిమంక్ష్యేహం సవిలస్య మధ్యే మోఘస్త ఏష కశ్యపాయాససంగరః' — ఇతిశ్రుతే రర్థం సంగృహ్ణాతి-నీలకంఠ.

ఇట భౌవన విశ్వకర్మ యనగా భువనపుత్రుఁడగు విశ్వకర్మ యని భాష్యకారులు వివరించారు.

(భౌవనః భువనస్యాపత్యం భౌవనః తం భౌవన విశ్వకర్మాణం కశ్యపః కశ్యపోనామ ఋషిః అభిషేచయా అభిషేచనం కృతవాన్.)

** Cf : Narayana Chandra Bandopadhyaya
—HINDU POLITY AND POLITICAL THEORIES
Part-I P.P. 167-78

"According to the Aitareya Brahmana the following kings attained supreme headship by the performance of Rajasuya and Aindra Mahabhisheka

| King | Consecrating Priest |
| --- | --- |
| VISWAKARMA OF THE RACE OF BHUVANA | KASYAPA |

'ఏ తేన హా వా ఐంద్రేణ మహాభిషేకేణ కశ్యపో విశ్వకర్మాణం
భౌవన మభిషిషేచ తస్మాదు విశ్వకర్మాభౌవనః సర్వతః
పృథివీం జయన్ పరి యాశ్వై రుచ మేధ్యై రీజే ।
ఐతరేయ బ్రాహ్మణము-8-21-4

అశ్వమేధ యాగానంతరమే ఋత్విజుండయిన కశ్యపున కార్త్విజ్యముగా భూమినంతయు దానము చేసినాడు.*

## విశ్వకర్మ సర్వమేధయాగము

య ఇమా భువనాని జుహ్వ దృషిర్హోతా న్యసీదత్ పితా నః।
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛద వరా ఆవివేశ॥
— ఋగ్వేద-10-81-1

ఇది విశ్వకర్మ సూక్తము నందలి పథమ మంత్రము. భువన పుత్రుడయిన విశ్వకర్మ ఋషి (విశ్వకర్మా భౌవనః) మంత్రద్రష్ట. జగచ్ఛిల్పి యగు విశ్వకర్మ పరమేశ్వరుడు మంత్రదేవత.**

భాష్యకారు లీ మంత్రార్థము నిట్లు వివరించినారు.

---

* Cf : C. Ramachari : The three Aptyas and their Descendants. P.6.

"At the end of the Asvamedha, Bhauvana, according to both Aitareya and Satapadha Brahmanas, desired to make a gift of this earth to Kasyapa his Priest."

** పోల్చు : శుక్లయజుర్వేద. 17-17.

'భువనపుత్రో విశ్వకర్మాఋషిః ।
విశ్వకర్మాదేవతా.... ॥'

'ఏ పరమేశ్వరుఁడగు విశ్వకర్మ ప్రళయకాలమునందు ఈ యనంతములగు బ్రహ్మాండములను దనయందాహుతి చేసికొనునట్లు హరించి యతీంద్రియద్రష్టయై (జితేంద్రియుడై) మాకు తండ్రియై తాను నిలిచి యుండెనో అట్టి పరమేశ్వరుడఁగు విశ్వకర్మ ఆశీర్వాద రూపముచే విస్తారమయిన ప్రజోత్పత్తి యగుగాక యను వాక్యములచే జగద్రూపమయిన ధనభోగము నపేక్షించినవాడై స్వకీయ శరీర, మధ్యంగత పుండరీకస్థానమునందు జీవస్వరూపుడై ప్రకాశించెను.'

భౌవన విశ్వకర్మయే సర్వమేధయాగము చేసి సర్వమును తన యందు హోమము చేసికొనినాడని నిరుక్తము నందు చెప్పబడినది.

విశ్వకర్మా భౌవనః సర్వమేధే సర్వాణి భూతాని
జుహావాం చకార ।
స ఆత్మాన మప్యం తతో జుహ్వాం చకార........॥'
- నిరుక్తము.

ఇట మంత్రద్రష్టయు, మంత్రోక్తదేవతయు భౌవన విశ్వకర్మయే యని కొందరు భావించుట యుక్తిసహము గాదు.

జగచ్ఛిల్పియు మానవశిల్పియు నొక్కడే యగునా? మఱి యీ మంత్రార్థమునకు భౌవన విశ్వకర్మ చేసిన సర్వమేధమునకు సమన్వయ మెట్లు కుదురును ?

సర్వజగత్సృష్టికర్తయు, జగత్పితయు, విశ్వశిల్పియునైన విశ్వకర్మపరమేశ్వరుడు[1] సర్వమేధ యజ్ఞము చేసి ప్రళయానంతరము మరల పునస్సృష్టికి కారణభూతుడయ్యెను.

1. Cf. : Ralph TH. Griffith : The Hymns of Rigveda. Vol.II Note on R.V. 10.81-1. "Visvakarman, the Omnifice is represented in this hymn as the universal Father and Generator, the creator of all things and Architect of Worlds."

ఆ విశ్వశిల్పి యజ్ఞము ననుకరించి, భౌవన విశ్వకర్మ శిల్ప విద్యా సాక్షాత్కార మొనరించుకొని, లోకకళ్యాణార్థ మీభూమిపయి సర్వమేధయజ్ఞము- సర్వశిల్పయజ్ఞము - చేసినాడు. భౌవన విశ్వకర్మ యొనరించిన సర్వశిల్ప యజ్ఞమే వైజ్ఞానిక జగత్తుగా పరిణమించినది.

ఈ విధముగా సకల శిల్పములకు మూలపురుషుడై శిల్ప విహీనమగు జగత్తు జడజగత్తనియు, శిల్పసాధనములతో పురోగమించు ప్రపంచమే పూర్ణ జగత్తనియు నిరూపించి శిల్పసామ్రాట్టుగా ప్రసిద్ధిగాంచిన భౌవన విశ్వకర్మయే ప్రథమ శిల్పప్రవర్తకుడనియు, నాతడే యాద్యశిల్పాచార్యుడనియు కొందరు పండితు లూహించుచున్నారు.*

'విశ్వకర్మ సూక్త మంత్రద్రష్టయైన బహ్మర్షియు, అశ్వమేధ యాగకర్తయు, సర్వమేధయాగ కర్తయు నయిన భౌమన విశ్వకర్మ అనువంశిక శిల్పుల కాదర్శ ప్రాయుడయిన ప్రఖ్యాత శిల్పాచార్యుడు.**



* చూడు : 1. రామకుమార్ విశ్వకర్మా : సుధారమంజరీ. పుటలు. 47-80.

2. ఆనందస్వరూప్ భరద్వాజ : జాంగిడ్ బ్రాహ్మణ్ నిదేశికా. పు.25.

** Cf ; C. Ramachari : THE THREE APTYAS AND THEIR DESCENDENTS P.8.

"A Brahman Seer of philosophical hymns and a king performing Aswamedha and Sarvamedha, Visvakarma Bhouvana is a renouned architect, an ideal of artisan."

# భౌమనో భువనప్రభుః

అగ్నిదత్తమయిన యర్జునుని దివ్యరథము భౌమన విశ్వకర్మ నిర్మితము.

రథం చ దివ్యాశ్వయుజం కపిప్రవర కేతనమ్।...
సవర్జ యం సుతపసా భౌమనో భువనప్రభుః॥

— వ్యా.భా. - ఆది. 225-10-12.

భౌమనుఁడనగా విశ్వకర్మ యని నీలకంఠుఁడు. 'భౌమనో విశ్వకర్మా'

దేవీం మాయాం రథే యుక్తాం విహితా విశ్వకర్మణా।
కాంచనం సింహలాంగూలం ధ్వజం వానరలక్షణమ్ ॥

— వ్యా.భా. విరాట-46-3.

ఆ రథముపై గల వానరధ్వజము విశ్వకర్మ నిర్మితమే.

ఇట విశ్వకర్మ యన బ్రహ్మయో భౌమనుఁడే యని నీలకంఠుడు. 'విశ్వకర్మణా బ్రహ్మణా భౌమనేన వా ।' - నీలకంఠ

తిక్కన విశ్వకర్మ యనియే యనువదించినాడు.

'విశ్వకర్మ నిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగు మహోగ్ర కేతనంబును...'

తిక్కన. విరాట. 4-170.

అర్జునుని రథముపై ధ్వజమును, దానిపై చిత్రరూపములు గల్పించినవాడు భౌమనుఁడనియు, నాతడే త్వష్టయు, ధాతయు ననియు భారతోద్యోగపర్వమున వర్ణింప బడినది.

చూడు : వ్యా.భా.ఉద్యోగ. 55.7-12

---

భౌమనుడు = విశ్వకర్మ, దేవతాశిల్పి (సూ.ని.)

భౌమన స్సహశ్రకేణ బహుచిత్రం విశాంపతే।
రూపాణి కల్పయామాస త్వష్టా ధాతా సదా విభో ॥...
తథా ధ్వజో విహితో భౌమనేన బహ్వాకారం దృశ్యతే
రూపమస్య ॥*



* 'భౌమన' శబ్ద స్థానమున కొన్ని ప్రతులందు 'భౌవన' శబ్దము గన్పించు చున్నది.
'భౌవన' శబ్దమే సరియైనదనియు, 'భౌమన' శబ్ద మపపాఠము గావచ్చుననియు మోనియర్ విలియమ్స్ అభిప్రాయము.

BHOUMANA : m.N. of Viswakarma, MBh, (Probably wrongly written for BHOUVANA)

BHOUNA : m. Patronimic of Viswakarma (cf. bhoumana) of Sadhna. Monier Williams-SED.P.768.

భౌమనః : N. of Viswakarma (Architect of Gods)
భౌవనః : See భౌమనః
N. S. Apte - SED.

# ప్రళయకాల పూర్వరాజవంశములు

| క్రమ సంఖ్య | 1. బ్రహ్మాండ పురాణ | 2. భాగవతపురాణ | 3. ఇండియన్ క్రోనాలజీప్రకారము పేరు | కలి పూర్వము | క్రీస్తు పూర్వము |
|---|---|---|---|---|---|
| 1. | స్వాయంభువ మనువు | స్వాయంభువ మనువు | స్వాయంభువ మనువు | 5100 | 8201 |
| 2. | ప్రియవ్రత | ప్రియవ్రత + బర్హిష్మతి | ప్రియవ్రత →విశ్వకర్మకూతురు | 5070 | 8171 |
| 22. | పృథుచక్రవర్తి | పృథు | పృథుచక్రవర్తి | 4470 | 7571 |
| 26. | గయ | గయ | గయ | 4320 | 7421 |
| | | .... | .... | | |
| 32. | మహత | మంథు | మహాంత | 4170 | 7271 |
| 33. | భౌమన | భౌవన | పవన* | 4140 | 7241 |
| 34. | త్వష్ట | త్వష్ట | త్వష్ట | 4110 | 7211 |
| 35. | విరజ | విరజ | విరజ | 4080 | 7181 |
| | | .... | — | | |
| 40. | — | — | వసు | 3930 | 7031 |
| 41. | — | — | విశ్వకర్మా | 3900 | 70001 |

1. బ్రహ్మాండ పురాణ. 1-2-14 శ్లో. 68-69
'గయస్యాపి నరః పుత్రో నరస్యాపి సుతో విరాట్। విరాట్సుతో మహావీర్యో ధీమాన్ తస్య సుతో ఽభవత్॥ ధీమతశ్చ మహాన్పుత్రో మహతశ్చాపి భౌవనః। భౌవనస్య సుత స్త్వష్టా విరజా స్తస్య చాత్మజః ॥'

పోల్చు : శ్రీ విష్ణుపురాణ—ద్వితీయాంశే—ద్వితీయోధ్యాయః శ్లో. 35-40

2. శ్రీమద్భాగవతమహాపురాణము : 5.15.15. 'మంథోః సత్యాయాం భౌవన స్తతో దూషణాయాం । త్వష్టాజనిష్ట త్వష్టు ర్విరోచనాయాం విరజో ॥'

3. డా. డి. యస్. త్రివేది.

* భౌవన స్థానమున 'పవన' యని యున్నది.

# శిల్ప ప్రజాపతి విశ్వకర్మ

'...ప్రభాసుం డను వసువునకు బృహస్పతి చెలియ లైన యోగసిద్ధికి విశ్వకర్మ పుట్టె.

ఆ విశ్వకర్మ నిర్మిత దేవవిమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీ విరచిత పరితోషిత దేవుండు శిల్పప్రజాపతియునై నెగడెన్.'

—నన్నయ-ఆది. 3-67, 68

వ్యాసభారతము నందలి కొన్ని ముఖ్యాంశములను నన్నయ వదలినాడు. మూలము నందిట్లున్నది.

బృహస్పతేస్తు భగినీ వరస్త్రీ బ్రహ్మవాదినీ ॥
యోగసక్తా జగత్కృత్స్న మసక్తా విచచార హ ।
ప్రభాసస్య తు భార్యా సా వసూనా మష్టమస్య హ ॥
విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పప్రజాపతిః ।
కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ॥
భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః ।
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకార హ ॥
మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ।
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్ ॥*

చూడు. వ్యా.భా. ఆది. 66. శ్లో 26-30.

* "And the sister of Vrihaspati, the first of women, uttering the sacred truth, engaged in ascetic penances, roamed over the whole Earth. And she became the wife of Prabhasa the eigthth Vasu. And she begot the illustrious Viswakarman, the founder of all arts, the engineer of the immortals, the maker of all kinds of ornaments, and the first of artists. And he it was who constructed the celestial cars of the Gods. And mankind are enables to live in consequence of the inventions of that illustrious one. And he is worshiped for that reason by men. And he is eternal and immutable this Viswakarma "

9 ] P.C. Roy-Mahabharata.Eng. Tr. P. 190.

# విశ్వకర్మ మాతాపితలు

విశ్వకర్మ మాతాపితలు యోగసిద్ధా ప్రభాసవసువు లని మహాభారతమే కాక మహాపురాణములును ముక్తకంఠముతో చెప్పు చున్నవి *

భాగవతమహాపురాణము నందు మాత్రము విశ్వకర్మ తల్లి దండ్రుల పేర్లు స్పష్టముగ లేవు.

---

*1. శ్రీ విష్ణు పురాణము. 2-270, 271.
'ప్రభాసునకు బృహస్పతి చెలియలైన యోగసిద్ధకు విశ్వకర్ముండు పుట్టె.
వసంతతిలకావృత్తము ; ఆ విశ్వకర్మ పమొదంచిత శిల్పవిద్యా
ప్రావీణ్యతం బ్రిదశపఙ్క్తికి తక్షకుండై
భావంబునందు బహుభంగుల నేమియైనన్
గావించుచుండుఁ దన కౌశలంబుల్ల సిల్లన్.
(మూలము : విష్ణుపురాణే-ప్రథమాంశే-పంచదశోధ్యాయః। శ్లో 117-120)

2. బ్రహ్మాండ పురాణ-2-3-2-శ్లో. 28, 29.
బృహస్పతేస్తు భగినీ భువనా బ్రహ్మావాదినీ
యోగసిద్ధాః జగత్కృత్స్న మశక్తా చరతి స్మ హ। —28
ప్రభాసస్యతు భార్యా సా వసూనా మష్టమస్య హ
విశ్వకర్మా సుతస్తస్యాః ప్రజాపతి పతిర్విభుః ॥ — 29

3. అదే. 2-3-59. శ్లో. 15-19.

4. వాయుపురాణ. ఉత్తరభాగ-అ. 22. 15, 16.

5. పద్మపురాణ — అ.6. 'విశ్వకర్మా ప్రభాసస్యపుత్రః శిల్పీ ప్రజాపతిః ।'

'వసోరాంగిరసీ పుత్రో విశ్వకర్మా ఒకృతీపతిః I' అని యున్నది.*

అతి ప్రాచీనకాలమునం దార్యావర్తము నాక్రమించిన బ్రహ్మకును తదనుయాయులకును భరతభూమిపై స్థిరనివాసము లేర్పరచుకొనుటకు సహాయపడిన స్థపతియే ప్రథమ విశ్వకర్మ యనియు, 'మానసార' మను వాస్తుశాస్త్ర గ్రంథములో ప్రస్తుతింపబడినవాఁడీ విశ్వకర్మయే యనియు పోపత్ భాయి అంబాశంకర్ మనకద్ అభిప్రాయపడినాడు.**

* భాగవతపురాణ-6-6-15 :- అకృతీపతిః శిల్పాచార్యః ॥ — శ్రీధరవ్యాఖ్య.
'వసువునకు నాంగిరస యందు విశ్వకర్మ యను శిల్పాచార్యుం డుదయంబందె' నని యనువదింపబడినది. ఆంధ్ర.భాగ. 6-254.
వసువు లేక వస్తువు అష్టవసువులలో నొకడు, ఆంగిరసి లేక ఆంగిరస అంగిరోముని పుత్రిక. అంగిరసుని పుత్రిక పేరు 'యోగసిద్ధ' యని వన్నయ.
'మఱి యాంగిరసుడను మానసపుత్రున కయ్యుతథ్యుండు బృహస్పతియును సంవర్తుడును గుణాశ్రయ 'యోగసిద్ధ' యన్ గూతురు పుట్టిరి —'
(ఆది. 3-66.)

**Cf : P.A. Mankad: Introduction to "APARAJITAPRICCHA" of Bhuvana Deva—P. LXXXIX.

The Viswakarma of Mana Sara (మానసార) belongs to a very distance epoch in history. Brahma (బ్రహ్మ) was the first invader and settler in India and Viswakarma referred to in Manasara (మానసార) was the architect who helped his (Brama's) colonists.

This Viswakarma was born in Brahmakula (బ్రహ్మకుల) in Margasirsha in Satya Yuga, not so the other Viswakarma, son of Prabhasavasu, who was born on the eleventh day (14th day according to Aparajita Priccha) of the bright half of Kartika."

ఈ విశ్వకర్మ కృతయుగమునందు మార్గశీర్ష శుద్ధ దశమీ శుక్రవారమున బ్రహ్మకులమునందు జన్మించినాడు.

ప్రభాస వసు పుత్రుడయిన విశ్వకర్మ కార్తీకశుద్ధైకాదశీతిథిని జన్మించినాడు.

మన్కడ్ అట్లు వ్రాయుట కాధారభూతములైన శ్లోకములు పండిత జయకృష్ణశర్మ సంపాదిత శ్రీ విశ్వకర్మా మహాపురాణము నందున్నవి.

'చతుర్భుజో విశ్వకర్మా శిల్పినాం ప్రభురుత్తమః ।
శుద్ధేకుతే బ్రహ్మకులే చ జాతో హ్యయం విశ్వకర్మా జగతి ప్రసిద్ధః ॥

కృతే యుగే యాం మహాదేవ సిద్ధైః స్తుతిః కృతాయా పృథివీధరైశ్చ ।

హేమంతా ప్రథమే మాసే దశమ్యాం భృగువాసరే॥' ఇత్యాది

... ... ...

'విశ్వకర్మా ప్రభాసస్య పుత్రోఽభూత్ కీర్తివర్ధనః । ...
కార్తికస్య సితే పక్షే ఏకాదశ్యాం శుభే దినే॥' ఇత్యాది

— శ్రీ విశ్వకర్మామహాపురాణ-అ.౯.

ప్రభాసవసు పుత్రుడును దేవవర్ధకియు నగు విశ్వకర్మ శిల్పి శ్రేష్ఠుడై లోకము నందలి యనేక శిల్పకళలకు మూలపురుషుడై

మానవ శిల్పులకు మార్గదర్శకుడైనాడు. ఆ మహాత్ముడు కనిపెట్టిన శిల్పకళలతో మానవులు జీవించు చున్నారు.*

ఈ విధముగా మహాశిల్పాచార్యుడగు విశ్వకర్మ గొప్పదనమును మహాభారతమే గాక పురాణములును చాటిచెప్పుచున్నవి.

అట్టి మహనీయుడు సకల జనులకు పూజనీయుడగుటలో నాశ్చర్యమేమున్నది ? శిల్పప్రజాపతి యైన యా మహాత్ముడు కనిపెట్టిన శిల్పములతో జీవించు శిల్పులెల్లరు నవ్యయుండైన యా విశ్వకర్మను నిత్యమును పూజించుచున్నారు.

'పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్॥'

—ఆది. 66-30

మహాభారతకాలమునుండి నేటివఱకు శిల్పులు తమ కులదైవమగు విశ్వకర్మ నారాధించుచునే యున్నారు.

* పోల్చు : 1. విష్ణుపురాణ. 1-15-119,120

'కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం చ వర్ధకీ ।
మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ॥'

2. బ్రహ్మాండపురాణ. 2-3-59. శ్లో. 16,17.

"కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం తు యోగతః ।
మానుషాస్యోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ॥"

3. వాయుపురాణ. ఉత్తర-భాగ-అ. 22-17

'కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం చ వాస్తుకృత్ ।'

4. అగ్నిపురాణ. అ. 18. శ్లో. 40,41

సకల శిల్పకళాకారులకు విశ్వకర్మయే యారాధ్యదైవము.*

అనంతర కాలమున కూడా శిల్పులు విశ్వకర్మను పూజించు చుండిరనుటకు అజంతా గుహల యందలి 10వ. నెం॥ గల విశ్వకర్మ గుహ ప్రబల నిదర్శనముగా గన్పట్టుచున్నది.

## అష్టవసువులు

'పైతామహుండయిన దేవుండను మనువునకు ప్రజాపతి పుట్టె వానికి ధూమ్రా బ్రహ్మవిద్యా మనస్వినీ రతా శ్వసా శాండిలీ ప్రభాతలనంగా నేడ్వురు భార్యలై రందు ధూమ్రకు ధరుండును, బ్రహ్మవిద్యకు ధ్రువుండును, మనస్వినికి సోముండును, రతకు నహుండును, శ్వసకు ననిలుండును, శాండిలికి నగ్నియు ప్రభాతకు ప్రత్యూష ప్రభాసు లనంగా నెనమండ్రు వసువులును బుట్టిరి.'

నన్నయ. ఆది. 3 67.

ఇట నన్నయానువాదము మూలశ్లోక వ్యాఖ్యానములకు కొంత భిన్నముగా నున్నది.

పైతామహో మని ర్దేవ స్తస్య పుత్రః ప్రజాపతిః ।
తస్యా ఉష్టౌ వసవః పుత్రా స్తేషాం వక్ష్యామి విస్తరమ్॥

** Cf : Heinrich Zimmer : Philosophies of Life :
ed : Joseph Campbell - P. 154

"....Viswakarman, the divine "Expert of All Crafts," the carpenter, architect and master craftsman of the Gods, in the patron deity of workman, artisans and artists."

ధరో ధ్రువశ్చ సోమశ్చ అహశ్చైవానిలో ఽనలః ।
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవో ఽష్టౌ ప్రకీర్తితాః॥
ధూమ్రాయాస్తు ధరః పుత్రో... —వ్యా.భా. వన. 16-17,18.

పైతామహుడయిన దేవుడే బ్రహ్మ దక్షిణ స్తనంబున బుట్టిన వాడు ధర్మఋషి యనియు, నాధర్మర్షికి దక్షప్రజాపతి తనయలలో నొకతెయైన వసువను దానికి అష్టవసువులు జన్మించినారనియు నీలకంఠుడు స్పష్టము చేసినాడు.*

ధర్మర్షికి వసు వను ధర్మపత్నియందే యష్టవసువులు జన్మించి నారని బ్రహ్మాండాది పురాణములు ఘోషించుచున్నవి.**

## దేవతలలో వసువులు

'వసువు లను వా రపేతవ్యసనులు దేవతలు లోకవంద్యులు.'
— నన్నయ. ఆది. 4-155.***

ముప్పది ముగ్గురు మూల దేవతలలో నెనమండుగురు వసువులు. పృథివి, అగ్ని, అంతరిక్షము, వాయువు, ఆదిత్యుడు, ద్యులోకము,

* పైతా మహో దేవో ధర్మః పితామహ స్తనాజ్జాతత్వాత్। తస్య పితామహస్య పుత్రో దక్షః తదంగుష్ఠాజ్జాతత్వాత్। తస్య సంబంధినీ వసునామ్నీ కన్యా తస్యాం ధర్మా ద్వసవో ఽష్టౌ జాతా ఇత్యర్థః । 'వసోస్తు వసవః పుత్రా' ఇత్యన్య త్రోక్తేః॥ ధూమ్రాయా ఇతి వసోరేవ ధూమ్రాదీని నామాంతరాణి కల్పభేదాత్ ॥ —నీలకంఠ—చిత్రశాలాప్రతి పుట. 124.

** బ్రహ్మాండ. 2-3-2 శ్లో. 1-21:
అగ్ని. అ.18; మత్స్య అ.4; భాగవత. 6-6. శ్లో. 4-10

*** 'ఏతా వై సర్వలోకస్య వసవః ...' —వ్యా.భా. ఆదీ. 99-3.
ఇమేఽష్టౌ వసవో దేవా మహాభాగా మహౌజసః ,' —ఆది. 98-19.

చంద్రుడు, నక్షత్రసమూహము వసువుల యంతర్భూతములై యున్నవి.[1]

వీరి నామధేయము లీ విషయమునే తెలియఁ జెప్పుచున్నవి.

ధరో ధ్రువశ్చ సోమశ్చ సావిత్రో ఽథానిలో ఽనలః।
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవో ఽష్టౌ ప్రకీర్తితాః॥
— వ్యా.భా. అను. 159-16,17

అష్టవసువులు రూపుదాల్చిన ప్రకృతిశక్తులే. ప్రకృతి శక్తులను వశపఱచుకొని తమ శిల్ప సామర్థ్యముచేత జగద్ధితకార్యములు చేయు వసువులు దేవతలుగా పరిగణింపబడినారు.

అష్ట వసువులు ప్రతిభావంతులు, శక్తిమంతులు నగు దేవతలు.

వసువులు, రుద్రులు, ఆదిత్యులు, సాధ్యులు, విశ్వేదేవులు, మరుద్గణములు, భృగువులు, నంగిరసులు నను నెనిమిది గణములు దేవగణములు.

ఆదిత్యా వసవో రుద్రాః సాధ్యా విశ్వే మరుద్గణాః।
భృగవో ఽంగిరసశ్చైవ తే ఽష్టౌ దేవగణాః స్మృతాః॥
—బ్రహ్మాండ. 1-2-38-2.

1. చూడు : వ్యా.భా. 1-41. నీలకంఠభాష్యము.
'త్రయస్త్రింశచ్చ దేవానాం సృష్టిః సంక్షేప లక్షణా।'
'_తే చాష్టౌ వసవ ఏకాదశరుద్రా ద్వాదశాదిత్యాః ఇంద్రః ప్రజాపతిశ్చ। తత్రవసవః పృథివ్యగ్నీ అంతరిక్షవాయూ ఆదిత్య దివౌ చంద్రా నక్షత్రాణిచ। రుద్రా ఏకాదశేంద్రియాణి ఆదిత్యా ద్వాదశమాసా ఇంద్రః పర్జన్యః ప్రజాపతిర్యజ్ఞః॥'

## వసువులు : : ఋభువులు

స మస్మే ఇషం వసవో దదీరన్ యూయం పాత స్వస్తిభిః
సదా నః ॥

— ఋగ్వేద. 7-48-4.

(వసువులు మాకు శక్తిసామర్థ్యము లొసగుదురు గాక !
ఓ దేవతలార ! మీ యాశీస్సు లెల్లపుడు మాకుండనిండు.)*

ఇది ఋభుసూక్తము. నాలుగు మంత్రములు గల యీ ఋభుసూక్తమునం దిది నాల్గవ మంత్రము. మొదటి మూడు మంత్రములలో ఋభు ప్రశంసయు శిల్పవిద్యా ప్రశంసయు గలదు.

నాల్గవ మంత్రము నందలి 'వసవః' అను పదము ఋభువులకు విశేషణ మని సాయణ భాష్యము [1] వసువులన (శిల్పాది) విద్యలందు వసించువారని దయానంద సరస్వతి వ్రాసినాడు.[2]

ఆంగిరసుండయిన సుధన్వాచార్యుని పుత్రత్రయమునకు ఋభువులని పేరు. వారు సుప్రసిద్ధులగు శిల్పులు గావున లోకము

---

* "So let the VASUS grant us strength and power, preserve us evermore, ye Gods, with blessings," Griffith

1. "The Vasus : According to Sayana Vasavah here is an epithet of Ribhavah (understood), 'the exalted Ribhus' —Wilson."

1. (See. Ralph. T.H. Griffith : Hymns of Rigveda. Vol. II. P. 520

2. 'విద్యా మే నివాస్ కర్తా' — దయానంద : ఋగ్వేదభాషాభాష్యము. పు. 51, 52.

నందలి తక్ష లోహకార స్వర్ణకార రథకారాది, శిల్పుల కెల్లరకు ఋభువులను వ్యవహారనామ మేర్పడినది.[1]

ఈ ఋభుసూక్తము నందు ఋభువులకు వసువులకు నభేదము చెప్పబడినది. కావున వసువులు శిల్పులే.

## భృంగ్వంగిరసులతో సంబంధ బాంధవ్యములు

ఇష్టో యజ్ఞో భృగుభి రాశీర్దా వసుభిః ।
తస్యన ఇష్టస్య ప్రీతస్య ద్రవిణేహాగమేః ॥

శుక్ల. యజు. వా. సం. 18-56.

(భృగువుల చేతను, వసువుల చేతను ఇష్టసిద్ధిప్రదమగు యజ్ఞ మొనరింపబడినది. ఓ ద్రవిణవరా! మాకిష్టుడగు వాని గృహము నందు ప్రవేశింపుము.)

భృగువు లనగా పరిపూర్ణ జ్ఞానము గలవారు. వసువులన అగ్ని మొదలగు అష్టవసువులు, లేక ప్రథమ శ్రేణి విద్వాంసులు.*

1. చూడు :- ఋగ్వేద. 8-35-15, పండిత. ఆర్యముని, పండిత. శివశంకర్ : భాషాభాష్యము (పుట. 175)

'ఋభువంతా : ఋభుయుక్త హై ।'

'తక్ష లోహార్ సునార్ రథకార్ ఇసే వ్యవసాయీ పురుషోం కా నామ్ ఋభు హై ,'

* చూడు : దయానంద : యజుర్వేద భాషాభాష్యము - పు. 161

'భృగుభిః పరిపూర్ణ విజ్ఞానవాలే'; వసుభిః ప్రథమకక్ష విద్యానోంనే: ఆశీర్దా ఇచ్ఛాసిద్ధికో దేనేవాలా, యజ్ఞః యజ్ఞః ఇష్ట కియాహై ।'

భృగువులు ఋభువుల వలె శిల్పకర్మములు చేయువారు. రథకారులు.[1] అగ్నివిద్యాసాధన మొనర్చిన ఆద్యశిల్పులు. ముఖ్యముగా నగ్నితో పనిచేయు లోహకార రథకారాదులు.[2]

కావున భృగువులు వసువులు కలిసి చేయు యజ్ఞము శిల్పయజ్ఞమే.

అంగిరసులును అగ్నివిద్యావేత్తలయిన శిల్పులే. వసువులలో నెనిమిదవ వాడయిన ప్రభాసుడు అంగిరోముని పుత్రికయైన యోగసిద్ధను వివాహమాడినాడు.

వసువుల కీవిధముగా శిల్పులగు భృగ్వంగిరసులతో సంబంధ బాంధవ్యము లున్నవి కావున వసువులును శిల్పులనియే చెప్పవచ్చును.

ప్రాచీన కాలమున భారతదేశము నందీ వసువులలో పెక్కురు శిల్పకర్మములు చేయుచు సమాజము నందత్యంత గౌరవ పదవు లలంకరించుచుండిరి.

వేదకాలము నుండియు భారతదేశమున నిత్యోప యోగ వస్తువులను చేయు తక్షకులు, రథకారులు, లోహకారులు, కులాలులు,

1. చూడు : ఋగ్వేద - 10-39-14 సాయణ భాష్యము
'కర్మయోగా దృభవో భృగవ ఉచ్యంతే. అథవా రథకారా భృగవః॥'

2. Cf : P. A. Mankad : Introduction to
APARAJITA PRICCHA. P. XC.
"E. SIEG in the Encyclopaedia of Religion and Ethics explains the word Bhrgu as a term for Craftsman.

According to Dr. Herman Weller, Bhrugus represented originally the craftsmen working with fire, among whom were included primarily the blacksmiths and chariot builders. The Silver War chariot of the heroic Bhisma is ascribed to them."

తంతువాయులు మున్నగు శిల్పకారులే కాక చిత్రకారులు, స్వర్ణకారులు, దంతశిల్పులు, దారుశిల్పులు మున్నగు శిల్ప కళా కారులును భారతీయ నాగరికతాభివృద్ధికి తోడ్పడినారు.

ఆదినుండియు శిల్పకళల యందభినివేశము గలిగి భారతదేశమునందు శిల్పకళలను బహుముఖముగా నభివృద్ధి చేసిన శిల్పకళాకారులు వసువులు తద్వంశీయులే. కావుననే వంశపారంపర్యముగా శిల్పవిద్య నభ్యసించి తమ శిల్పకళా నైపుణ్యముతో శిల్పవిద్యకు మెఱుగులు పెట్టి నానావిధ శిల్పములు చేయు నానువంశిక శిల్పులు భారతదేశమున 'వసు' నామధేయులై వరలుచున్నారు.*

---

* Cf : Popatbhai Ambasankar Mankad : Introduction to APARAJITA PRICCHA OF BHUVANA DEVA. P.XCII.

"Most of the Vasus. as might be inferred from above, were the artificers in ancient times. They cccupied a very respectable position in the society in Ancient India."

"From the Vedic times, Indian civilisaation had at its disposals the services not only of the carpenter, the wheelwright and the blacksmith, of the potter, the weaver and other fabricators of objects of prime necessity but of those whom we call art workers, Goldsmiths, Carvers in ivory or wood etc."

(BEGINNINGS OF BHDDHISTIC ART
BY. M. FOUCHER)

"It was the family of these VASUS or their progeny who applid themselves to these various Crafts branches of art, and so naturally these art workers – articificers in a wide range of arts, were brought under these category of the terms 'VASU'.

## రుద్రులు : శిల్పులు

నమస్తేస్తు రుద్రేభ్యో యే ఽన్తరిక్షే యేషాం వాత ఇషవః॥
—శుక్ల యజు వా.సం. 16-65

విమానాది యానములతో నంతరిక్షము నందు సంచరించు వాయు సదృశ బాణయుక్తులయిన శుద్ధశిల్పుల సేవ చేసిన వారికి వారు ప్రసన్నులై శిల్పవిద్య యందు శిక్షణమొసగి సుఖజీవులను చేయుదురు.

(యే మనుష్యా ఆకాశస్థాన్ శుద్ధాన్ శిల్పినః సేవన్తే తానేతే సర్వతోబలయిత్వా శిల్పవిద్యాః శిక్షేరన్॥ - దయానంద)

ఇట దయానంద సరస్వతి రుద్రులనగా శిల్పివర్యులని యర్థీకరించినాడు.

యజుర్వేద రుద్రాధ్యాయ మంత్రములను పరిశీలించినచో రుద్రులకు శిల్పులకు గల సంబంధము తెలియగలదు.

'నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః......' ఇత్యాది మంత్రములకు 'ఓ రుద్రులారా ! తక్షకుల రూపమునను రథకారుల రూపమునను నున్న మీకు నమస్కార' మని యర్థీకరింపబడినది.

ఈ విధముగా శిల్పశాస్త్రికులు అరణ్యవాసులయిన నిషాదాదిగణములు* రుద్ర-శివ-భక్తులు. వీరి యిష్టదైవతము లయిన

* నిషాదులును రథకారులే. నిషీదతివిజ్ఞానమస్మిన్ ఇతి నిషాదః
—హలాయుధ-3-3-121

ఎవనియందు శిల్పవిజ్ఞానము విశేషముగా నుండునో వాడు నిషాదుడు.

సౌధన్వనా రథకారా నిషాద శబ్ద వాచ్యా ఇత్యన్వే ।
—నిరుక్త. అ. 3.8. స్కందభాష్యము

రుద్రాదులు కాలక్రమమున నార్యేతరుద్రునితో నేకమయినట్లున్నదని డా. భండార్కరు అభిప్రాయము.*

శిల్పులు శివస్వరూపులు. శిల్పులకు శివునకు భేదము లేదని స్కందపురాణ ప్రతిష్ఠాఖండమునందు చెప్పబడినది.

శిల్పినాం దేవకర్తృత్వం వంశ్యానాం విశ్వకర్మణః ।
అహం విశ్వస్య కర్తా చ కర్తారో మమ శిల్పినః ॥
శిల్పి గర్భాణి లింగాని లింగ గర్భాశ్చ శిల్పినః ।
శిల్పిరూపం తు మద్రూపం నభేదః శ్రుణు పార్వతి ॥**

విశ్వకర్మ వంశజులయిన శిల్పిబ్రాహ్మణులే దేవమూర్తి నిర్మాణమున కధికారము గలవారు. నేను విశ్వమును సృష్టించుచున్నాను. నన్ను శిల్పులు సృష్టించుచున్నారు. నా వలన శిల్పులుద్భవించుచున్నారు. శిల్పుల వలన శివలింగము లావిర్భవించుచున్నవి. శిల్పి నా రూపము గలవాడు. శిల్పికిని నాకును భేదము లేదు.

— అని శివుడు పార్వతితో చెప్పినాడు.

శివసదృశుడైన శిల్పి పూజనీయుడు. శిల్పి విశ్వకర్మకు కూటస్థుడు.

'నమో రోహితాయ స్థపతయే...॥'

— శుక్ల యజు. వా.సం. 16-19***

* Cf : Dr. Dwijendralal Sukla: BHARATIYA VASTU SASTRA
—Pratima Vignana

"Thus the followers of handicraft and also the forest tribes of Nishadas are brought into close connection with Rudra. Probably they were his worshippers or their own peculiar Gods were identified with Aryan Rudra."

** చూడు : నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము.

*** "Homage to Red–Architect...." Ralph. T. H. Griffith. "The Texts of white Yajurveda". P. 142

విశ్వకర్మ స్వరూపుడై గృహాదులు నిర్మించు శిల్పికి నమస్కారము.[1] రక్తవర్ణుడును (వాచకరూపమగు శబ్దము నందు వాచ్యరూపమున నున్నవాడును) శిల్పియు, (అంతటనుండి యన్నింటిని రక్షించువాడు) నగు రుద్రునకు నమస్కారము.[2]

## ద్వాదశ భృగువులు

భృగుమహర్షికి పులోముని పుత్రికయగు దివ్యయను దానికి గలిగిన భువనాది ద్వాదశ పుత్రులు ద్వాదశ భృగువులుగా పేరొంది దేవతలుగా నెగడిరి.

భృగుః పులోమశ్చ సుతాం దివ్యాం భార్యా మవిందత ।
భువనో భౌవనశ్చైవ సుజన్య స్సుజన స్తథా ॥
శుచిః క్రతుశ్చ మూర్ధా చ యాజ్యశ్చ వసుధశ్చ హా ।
ప్రభవ శ్చావ్యయశ్చైవ దక్షో ఽథ ద్వాదశ స్తథా ॥
ఇత్యేతే భృగవో నామ దేవా ద్వాదశకీర్తితాః ।

మత్స్యపురాణ-అ. 194-శ్లో. 12-14.

1. 'స్థపతయే స్థపతిర్గృహాదీనాం చేతా చయనం కరోతి విశ్వకర్మ రూపేణ ।'

— ఉవ్వట భాష్యము.

స్థపతిర్గృహాదికర్తా విశ్వకర్మ రూపేణ తస్మై నమః ।

— మహీధర భాష్యము.

2. చూడు :- చదలువాడ సుందరరామశాస్త్రిలు ;

ఆంధ్రరుద్ర భాష్యము. పుట. 59.

"స్థపతయే" ; గృహములు మొదలగునవి చేయువాని కొఱకు, లేక 'సర్వత్రస్థాతా చ సర్వత్రపాతా చ స్థపతిః' అంతటనుండు వాడును, అన్నింటిని రక్షించువాడును అగు రుద్రుని కొఱకు నమః నమస్కారము.

ఈ ద్వాదశ భృగువుల నామములు కించిద్భేదములతో బ్రహ్మాండపురాణము నందును గలవు. అందు ముఖ్యముగా 'భౌవన' నామమునకు బదులు 'భావన' యని యున్నది.* ఇది యపపాఠమో ముద్రారాక్షసమో కావచ్చును.

ఈ ద్వాదశ నామములు కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత (4-7-11) యందు శుక్లయజుర్వేద వాజసనేయ సంహిత (22-32) యందును గనిపించుచున్నది. అవి ద్వాదశమాస నా మ ము ల ని వ్యాఖ్యాతలు వివరించినారు. కాని యవి భృగుదేవతా నామములే యనుకొనుటలో విప్రతిపత్తి లేదు.

వాజశ్చ ప్రసవశ్చాపిజశ్చ క్రతుశ్చ సువశ్చ మూర్ధా చ
వ్యశ్నియశ్చాన్త్యాయన శ్చాన్త్యశ్చ భౌవనశ్చ భువన
శ్చాధిపతిశ్చ ॥

— కృష్ణ-యజుర్వేద.తై.సం 4-7-11.

వాజాయ స్వాహా ప్రసవాయ స్వాహా పిజాయ స్వాహా
క్రతవే స్వాహా
స్వః స్వాహా మూర్ధ్నే స్వాహా వ్యశ్నువినే స్వాహా ఽన్త్యాయ
స్వాహా న్త్యాయ భౌవనాయ స్వాహా భువనస్య పతయే స్వాహా
ధిపతయే
స్వాహా ప్రజాపతయే స్వాహా ॥ —శుక్ల యజు.వా. సం. 22-32.

* పోల్చిచూడు :- బ్రహ్మాండపురాణ. 2-3-1. శ్లో. 88-90.

'భృగోస్తు భృగవో దేవా జజ్ఞిరే ద్వాదశాత్మజాః ।
దివ్యా ఒనుసుషువే కన్యా కావ్యస్యైవానుజాః ప్రభో ॥
భువనో భావనశ్చైవ అంత్యశ్చాంత్యాయన స్తథా ।
క్రతుః శుచిః స్వమూర్ధా చ వ్యాజశ్చ వసుదశ్చ యః ॥
ప్రభవశ్చావ్యయశ్చైవ ద్వాదశో ఽధిపతిః స్మృతః ।
ఇత్యేతే భృగవో దేవాః స్మృతా ద్వాదశ యాజ్ఞియాః ॥'

11] ద్వాదశభృగువుల నామము లందలి భేదసాదృశ్యము లీ క్రింది పట్టికలో చూపబడినవి.

| క్రమ సంఖ్య | కృష్ణయజుర్వేద 4-7-11 | | శుక్ల యజుర్వేద 22-32 | | మత్స్యపురాణ అ.194. 12-14 | | బ్రహ్మాండపురాణ 2-3-1 శ్లో.88-90 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వాజ | 1 | వాజ | 1 | భుజ్య | 8 | ఐజ్య | 8 |
| 2. | ప్రసవ | 2 | ప్రసవ | 2 | ప్రభవ | 10 | ప్రభవ | 10 |
| 3. | అపిజ | 3 | అపిజ | 3 | శుచి | 5 | శుచి | 6 |
| 4. | క్రతు | 4 | క్రతు | 4 | క్రతు | 6 | క్రతు | 5 |
| 5. | సువ | 5 | స్వః | 5 | వసుద | 9 | వసుధ | 9 |
| 6. | మూర్ధ | 6 | మూర్ధ | 6 | మూర్ధ | 7 | స్వమూర్ధ | 7 |
| 7. | వ్యశ్నియ | 7 | వ్యశ్నువిన | 7 | అవ్యయ | 11 | అవ్యయ | 11 |
| 8. | అంత్యాయన | 8 | ప్రజాపతి | 12 | సుజన | 4 | అంత్యాయన | 4 |
| 9. | అంత్య | 9 | అంత్య | 8 | వసుజన్య | 3 | అంత్య | 3 |
| 10. | భౌవన | 10 | భౌవద | 9 | భౌవన | 2 | భౌవన | 2 |
| 11. | భువన | 11 | భువనపతి | 10 | భువన | 1 | భువన | 1 |
| 12. | అధిపతి | 12 | అధిపతి | 11 | దక్ష | 12 | అధిపతి | 12 |

దేవతలయిన ద్వాదశ భృగువులలో ప్రథముడు భువనుడు. ఈ భువనదేవుని పుత్రుడే భౌవన విశ్వకర్మ.

భువనో నామ యో దేవో విశ్వకర్మా చ తత్సుతః
ప్రసిద్ధా యః సఖా స్త్రిషు భౌవనః సురవర్ధః ॥
— విష్ణురహస్యము-అ.35.*

భృగువులు శిల్పులు గావున ద్వాదశభృగువులలో నొకడగు భువన దేవుని పుత్రుడు-భౌవన విశ్వకర్మ-శిల్పాచార్యుడే.

బ్రహ్మచేత పితృదేవతలతో శ్రాద్ధంబున భాగము గల్పింపబడిన విశ్వేదేవులలో నొక భువనుడున్నాడు.

'శ్రాద్ధంబున నర్యమ వరుణ సోమాగ్నులకు భాగంబులు బ్రహ్మ కల్పించె విశ్వాలగు దేవతలు పితృదేవతలతో గూడం దత్క్రియోపయోగ్యతం దోతురు. వారలకును భాగకల్పనం బొనరించె... బలుండు ధృతి... ఈశుండు, కర్త, కృతి, దక్షుండు, భువనుండు, దివ్యకర్మకృతు...వీరలు భాగార్హులు.' —తిక్కన.అనుశాసనిక, 3- 92**.

విశ్వేదేవులు 62 మంది యున్నారు.[1] కర్త, కృతి, దక్షుడు, భువనుడు దివ్యకర్మకృత్తు... ఇత్యాది నామములను బట్టి వీరిలో

* చూడు : వడ్డెపాటి నిరంజన శాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము. పు. 26

**వ్యా.భా: అనుశాసనిక — అ. 91. శ్లో. 27-37

దేవాస్తు పితరో నామ నిర్మితా యే స్వయంభువా ।....
విశ్వేచాగ్నిముఖాదేవా స్సంఖ్యాతాః పూర్వమేవతే ।
తేషాం నామాని వక్ష్యామి భాగార్హాణాం మహాత్మనామ్ ॥
బలం ధృతి ర్విపాప్మా చ
ఈశః కర్తా కృతిర్దక్షో భువనో దివ్యకర్మకృత్ ॥

1. ధర్మర్షి పుత్రులగు విశ్వేదేవులు పదిమంది మాత్రమే.
—చూడు. బ్రహ్మాండ. 2-3-3-30.

కొందరు శిల్పులని తెలియుచున్నది. శిల్పులు కానివారును కొందరుండవచ్చును.

## విశ్వేదేవులు శిల్పులే

బ్రహ్మ పుత్రుడయిన ధర్మర్షికిని విశ్వ యను ధర్మపత్నికిని క్రతువు, దక్షుడు, శ్రవుడు, సత్యుడు, కాలుడు, కాముడు, ముని, పురూరవుడు, మార్ద్రివసువు, రోచమానుడు నను పదుగురు విశ్వేదేవులు జన్మించిరి.

క్రతు ర్దక్షః శ్రవః సత్యః కాలః కామో ముని స్తథా ॥
పురూరవో మార్ద్రివసో రోచమానశ్చ తే దశ ।
ధర్మపుత్రాః సురా ఏతే విశ్వాయాం జజ్ఞిరే శుభాః ॥

— బ్రహ్మాండ-2-3-3. శ్లో. 30, 31.

విశ్వేదేవులు శిల్పకర్మలయందు నిష్ణాతులు. త్వష్ట్ర శిష్యులైన ఋభువులను శిల్పవిద్య యందు పరీక్షించినవారు.

పరినిష్ఠితకర్మాణో విశ్వేదేవా ఉపాహ్వాయన్ ॥

— శౌనకీయ బృహద్దేవతా 3.84.*

విశ్వేదేవులు ఉలి బాడిసలతో పనిచేయువారని తెలియుచున్నది.

వాశీభి స్తక్షతాశ్మన్మయీభిః । — ఋగ్వేద. 10-101-10

విశ్వేదేవులు శస్త్రాస్త్రములు, కవచములు, పురములు, రథములు, నౌకలు మున్నగు వానిని చేయువారని తెలియుచున్నది.

* "The all gods, who were throughly versed in the arts (Parinistita Karma) challenged them."

ఇమం కృణుధ్వమాయుధారం కృణుధ్వమ్ ॥
—ఋగ్వేద. 10-101-2.

వర్మ సీవ్యధ్వం బహులా పృథూని
పురం కృణుధ్వ మాయసీ రధృష్టా ॥ —ఋగ్వేద. 10-101-8.
.. .. రథమిత్ కృణుధ్వమ్ । —ఋగ్వేద. 10-101-7.
నావమరిత్రపరణీం కృణుధ్వమ్... । —ఋగ్వేద. 10-101-2.

దేవతలలో విశ్వేదేవులు విద్వాంసులు సౌఖ్యదాయకములగు నానా శిల్పములు చేయువారు. 'ధీరా దేవేషు సుమ్నయా' ।
—ఋగ్వేద. 10-101-4.

## భార్గవులు : ఆత్రేయులు

భృగువులు రథకారులు.[1] అనగా రథాదియానములు నిర్మించు దారు శిల్పులు. రథకారులయిన భృగువులు నౌకానిర్మాత లనియు తెలియుచున్నది.

'భృగువులు భారతదేశమునకు పాశ్చాత్యదేశములకు మాధ్య సాముద్రిక వాణిజ్యము నెఱపుచుండిన గొప్ప నావికులు. నౌకా నిర్మాతలు. ఆత్రేయులును భృగువులవలె నౌకానిర్మాణము నందు ప్రవీణులు.'

సముద్ర వ్యాపారము వలన బహుధన సంపన్ను లగుచున్న భృగువులతోడి స్పర్థతో హైహయుండయిన కార్తవీర్యార్జునుం

1. చూడు :- ఋగ్వేద. 10-39-14. 'తక్షామ భృగవో న రథమ్'
కర్మయోగా దృభవో భృగవ ఉచ్యంతే. అథవా రథకారా భృగవః ॥
—సాయణ.

ఆత్రేయుల సాహాయ్య మర్థించినాడు. భృగువులవలె నౌకా నిర్మాణ శిల్పకుశలురైన యాత్రేయులు కార్తవీర్యునకు నౌకా సహస్రము నిర్మించి యిచ్చిరి. సహస్ర నౌకాదళాధిపతి యయిన కార్తవీర్యునకు 'సహస్రబాహు' వని బిరుదము వచ్చినది.[1]

కార్తవీర్యార్జునుని బలమునకు 'రాజమదమునకు' కారణము దత్తాత్రేయ వరప్రసాద లబ్ధమయిన విమానము.

'దత్తాత్రేయ విమానేన విమానం కాంచనం తథా ।'

— వ్యా.భా. వన. 115-12

ఇట 'విమానము' భూజలాంతరిక్ష యానముల కుపలక్షణము. ఆ బలముతో 'సహస్రబాహుడు' భార్గవులతో కయ్యమునకు కాలు దువ్వినాడు.

'సహస్రబాహుడి కథయందలి యీ విశేషములను బహుపురాణ గ్రంథ పరిశీలకుడైన కరండికర్ అను మహారాష్ట్ర పండితుడు 'నవాకాల్' అను మహారాష్ట్ర దినపత్రికలో ప్రకటించినాడు.[2]



1. "Arjuna sought the help of the Atris, who were equally expert ship-builders and who build for him a fleet of thousand ships or a ship with a thousand oars (making Arjuna Sahasra — bahu ie,, thousand - armed)"

—Karandikar

2. Quoted by A.D. Pusalkar in Vedic Age - PP 282-283

# అశ్వినీ దేవతలు

'సవిత్రునకు బడబా రూపిణియైన త్వాష్ట్రికి నాశ్వినులు పుట్టిరి.'

నన్నయ- ఆది. 3-69.*

త్వాష్ట్రి యనగా త్వష్ట కుమార్తె. త్వష్ట దేవతల విశ్వకర్మ. ఈమె పేరు సంజ్ఞాదేవి. సురేణు వని నామాంతరము.[1] ఋగ్వేదము నందు త్వష్టృపుత్రిక పేరు 'శరణ్యు' అని యున్నది.

— ఋగ్వేద. 10-37.1.

సంజ్ఞాదేవి సూర్యతేజము సహింపజాలక బడబారూపము ధరించి యుత్తర కురుభూములందు సంచరించు చుండగా వివస్వంతుం డశ్వరూపము ధరించి యామెతో క్రీడించెను. బడబారూపిణియైన సంజ్ఞాదేవి కాశ్వినులు పుట్టిరి.

అశ్వినులకు నాసత్యులనియు దస్రులనియు నామాంతరములు.

నాసత్యశ్చ దస్రశ్చ స్మృతౌ ద్వావశ్వినావపి ।
మార్తండస్యాత్మజా వేతే వష్టమస్య మహాత్మనః ॥

— వ్యా.భా. శాంతి. 208-17.**

---

* త్వాష్ట్రీం తు సవితు ర్భార్యా బడబారూపధారిణీ ।
అసూయత మహాభాగ సాంతరిక్షే ఽశ్వినా వుభౌ ॥

—వ్యా.భా. ఆది. 66-35.

1. బ్రహ్మాండ పురాణము. 2-3-59. శ్లో. 33, 34.
'వివస్వాన్ కశ్యపా జ్జజ్ఞే దాక్షాయిణ్యాం మహాయశాః ।
తస్య సంజ్ఞా ఽభవద్ భార్యా త్వాష్ట్రీ దేవీ వివస్వతః ॥
సురేణు రితి విఖ్యాతా పునః సంజ్ఞేతి విశ్రుతా ।'

** 'మార్తండస్యాత్మజావేతే సంజ్ఞానాసా వినిర్గతౌ.'

— ఆనుశాసనిక. 150: 17,18.

ద్వాదశాదిత్యులలో నెనిమిదవవాడు వివస్వంతుడు[1]
— వ్యా.భా. శాంతి. శ్లో. 15,16.

కశ్యపాత్మజుడైన వివస్వంతునకు, దేవశిల్పి త్వష్ట్ర పుత్రిక యగు సంజ్ఞాదేవికి జన్మించిన యశ్వినులు విశ్వకర్మకు దౌహిత్రులు.

## సకలలోక కల్యాణకారులు

తా వా మద్య సుమతిభిః శుభస్పతీ అశ్వినా ప్రసుఫీ మహి।
— ఋగ్వేద. 8-22-6.*

(ఓ అశ్వినులారా ! శుభాధిపతులగు మిమ్ము మా స్తోత్రములతో ప్రస్తుతింతుము.)

అశ్వినులు కల్యాణప్రదులనియు (శుభస్పతీ)[2] సకలాభీష్ట వర ప్రదాతలనియు (విశ్వవారా)[3] వేదర్షుల భావన.

1. చూడు : నన్నయ. ఆది. 3-61—వ్యా.భా. 65-15, 16.
'కశ్యపునకు నదితికి 'ధాతృ మిత్రార్యమ శక్రవరుణాంశు భగ వివస్వత్పూష సవితృ త్వష్టృ విష్ణు లనంగా ద్వాదశాదిత్యులు పుట్టిరి.'

* "As such will we exalt you, Lords of splendour now, O Asvins, with our prayer or praise," — Griffith.

2. 'శుభస్పతీ'— ఋగ్వేద. 8-22-6; 8-22-4; 1-120-6.

3. 'విశ్వవారా'— ఋగ్వేద. 7-70-1. 'ఆ విశ్వవారాశ్వినా ఉగతం నః ।'
"Rich in all blessings, Asvins, come ye hither...."
—Griffith : The Hymns of Rigveda. Vo.II
"They bestow all sorts of blessings (Viswavara) on their devotees."
(R.V. 7.70-1)=Jeanine Miller : The Vedas P.113

'సకలలోకకల్యాణకారు లాశ్వినులు గావున వారి నారాధించి మాద్రి కపత్యంబు వడయు' మని పాండురాజు కుంతి నర్థించినాడు.

—నన్నయ.ఆది. 5-3-132

కుంతీదేవి మాద్రికి మంత్రోపదేశము చేసినది. మాద్రి రూప సంపన్నులయిన యాశ్వినులను దేవభిషగ్వరులను మనసునం దావాహనము చేసినది. వారు వచ్చి యామెకు కవలపిల్లలను ప్రసాదించి పోయిరి.[1]

తతో మాద్రీ విచార్యైవం జగామ మనసాశ్వినౌ ।
తా వాగమ్య సుతౌ తస్యాం జనయామాస తు ర్యయో ॥

— వ్యా.భా. ఆది. 124-16.

అశ్వినీల యంశములఁ బుట్టిన యా కవలవారే నకుల సహదేవులు.

## త్వాష్ట్రి విజ్ఞానమధుమరీచి : దధీచి

ఆథర్వణాయాశ్వినా దధీచే ఒశ్వ్యగ్ం శిరః ప్రత్యైరయతం ।
స వాం మధుప్రవోచ దృతాయన్ త్వాష్ట్రం యద్దస్రావపి
కక్ష్యం వామ్ ॥

—ఋగ్వేద. 1-117-22.

---

1. అశ్వినులు వధ్రిమతికి - షండుని భార్యకు - హిరణ్యహస్తుడను కుమారుని ప్రసాదించినట్లు ఋగ్వేదమునం దొక కథ గలదు.

—ఋగ్వేద. 1-117-14.

'హిరణ్యహ స్త మశ్వినా రరాణా పుత్రం నరా వధ్రిమత్యా అదత్తమ్ ।'

(ఓ అశ్వినులారా ! మీరు అధర్వణదధీచికి గు ఱ్ఱ పు త ల నుంచితిరి. అతడు ఆదిత్య మధువును, మధువిద్యను జెప్పెను. ఇది మిక్కిలి రహస్యమై యుండవలయును.)*

త్వష్ట ద్వాదశాదిత్యులలో నొకడు. కావున ఆడిత్యమధువని చెప్పబడినది.

మధువనగా ఆత్మజ్ఞానమనియు, అది పరమాత్మ సంబంధి యనియు శంకరభగవత్పాదులు వివరించినారు.** మధువిద్య యన బ్రహ్మవిద్య.

మధువనగా నమృతము; సోమరసము. త్వష్ట సోమరక్షకుడు. కావున త్వష్టచే రక్షింపబడుచున్న మధువును బడయుట యనగా బ్రహ్మజ్ఞానమును బడసి అమరత్వము నొందుటయే.

త్వష్ట యన సూర్యుడు. మధువనగా చైత్రమాసము. వసంత ర్తువు మధువిద్య యనగా సూర్యుడు భచక్రమందెచట సంచరించు చున్నపుడు మధుమాసారంభమగునో తెలిసికొను విద్యయని కొందరు భావించిరి.

---

* చూడు ; బృహదారణ్యకోపనిషత్తు - 2-5-17. (ఋగ్వేద. 1-117-22)
ద్వాదశోపనిషత్తులు వావిళ్ళ రామస్వామిశాస్త్రి అనువాదము పు-210

** బృహదారణ్యకోపనిషత్తు–2-5-17 శంకరభాష్యము.
"యన్మధు కక్ష్యమ్ ఆత్మజ్ఞాన లక్షణమ్."
"అపి చ కక్ష్యమ్ గోప్యం రహస్యం పరమాత్మ సంబంధి యద్ విజ్ఞానం మధు ।"
"The honey of Tvastra is knowledge referring to rite; the honey to be concealed, the knowledge of Brahman."

ఆథర్వణుడయిన దధీచి యాశ్వినులకు నేర్పిన మధు విద్య త్వష్ట - దేవతాశిల్పి - సంబంధమయినది. (త్వాష్ట్రమ్) అది గోప్య మైనది. (కక్ష్యమ్)*

త్వష్ట దేవతల శిల్పి, కావున త్వాష్ట్రమనగా శిల్పము.**

మధు వనగా మధురగుణయుక్తమయిన విజ్ఞానము.[1] త్వాష్ట్ర విజ్ఞానము (మధువు) శిల్ప విజ్ఞానమే.

అశ్వినులు దేవశిల్పి యగు త్వష్టకు (విశ్వకర్మకు) దౌహిత్రులు.[2] వీరు సకలలోక కల్యాణకారులు.[3] కర్మకరులు.[4] శిల్ప

---

* Cf : Dr. C. Kunhan Raja : The Quintessence of the Rig Veda.

"He (Dadhyach) knowing the law, propounded to you, the Madhu (Honey Wisdom) which related to Tvastar (Architect) and which was concealed."

—Rig.V. 1-117-22.

** 1. బృహద్దేవతా—3-84.

"శిక్షయామాస తాం త్వష్టా త్వాష్ట్రం యత్కర్మకించన।"

2. పోల్చు : భాగవత పురాణము—10-50-51.

'దృశ్యతే యత్ర హి త్వాష్ట్రం విజ్ఞానమ్ శిల్పనైపుణమ్ ।'

1. చూడు : దయానంద ఋగ్వేద భాష్యభాష్యము. పు.157.

2. 'సవితునకు బడబారూపిణియైన త్వాష్ట్రికి నాశ్వినులు పుట్టిరి.'

నన్నయ.ఆది. 3-69.

3. నన్నయ. ఆది. 5-132.

4. 'చికిత్సకౌ కర్మకరౌ కామరూప సమన్వితౌ।' —వ్యా.భా.వన. 121-12.

విజ్ఞానవేత్తలు.[1] ఋగ్వేదము నందలి 'అశ్విన, నాసత్య, దస్ర' శబ్దములకు పలుతావుల శిల్పవిజ్ఞానవేత్తలని యర్థము చెప్పబడినది.

అశ్వినులకు గురువైన దధీచి యాథర్వణుడు. ఆథర్వణులు శిల్పులు. ఆథర్వణ దధీచి శిల్పవిజ్ఞానకాంతులు వెదజల్లిన మహా తపశ్శాలి.

## శిల్పశాస్త్రోపదేశికులు

వాస్తువిద్యకు మూలపురుషుడు శివుడని కాశ్యపశిల్ప, మానసార, గార్గేయాగమ విశ్వకర్మప్రకాశికాది పెక్కు వాస్తుశాస్త్రగ్రంథములు చెప్పుచున్నవి

'విశ్వకర్మప్రకాశికా' గ్రంథారంభమునందు వాస్తుశాస్త్రమును శివుడు పరాశరునకు బోధించినట్లును,[2] గ్రంథాంతమున గర్గుడు

1. చూడు : దయానంద : ఋగ్వేదభాషాభాష్యము. అశ్వినీసూక్తములు.
అశ్వినౌ : శిల్పవిద్యా వ్యాపి సజ్జనౌ । — ఋగ్వేద. 1-183-6.
నా సత్యా : సత్యప్రియ శిల్పవిద్యా ఉధ్యాపకోపదేశకౌ విద్వానౌ।
— ఋగ్వేద 1-183-5.
దస్రౌ : దుఃఖనాశక శిల్పవిద్యా ఉధ్యాపకౌ ఉపదేశకౌ ।
— ఋగ్వేద 1-183-4.

2. "యదుక్తం శంభునా పూర్వం వాస్తుశాస్త్రం పురాతనమ్ । పరాశరః ప్రాహ బృహద్రథాయ బృహద్రథః ప్రాహ చ విశ్వకర్మణే ॥"
వి. ప్ర. అ. 1-3,4.

పరాశరునకు బోధించినట్లును[1] చెప్పబడినది.

గర్గమహర్షికి శివుడే చతుష్షష్టి కళాజ్ఞానము నొసగినాడనుటకు భారతమే సాక్ష్యము.

గర్గఉవాచ॥ చతుష్షష్ట్యంగ మదద త్కలాజ్ఞానం మమాద్భుతమ్ ।
సరస్వత్యా స్తతే మనో యజ్ఞేన పాండవ ॥

— అనుశాసనిక. - 19-38.

చతుష్షష్టి కళలలో వాస్తువిద్య యొకటి.

| | |
|---|---|
| శివ<br>గర్గ<br>పరాశర<br>బృహద్రథ<br>విశ్వకర్మ<br>వాసుదేవ | కావున వాస్తుశాస్త్రము శివుడు గర్గునకు జెప్పినాడనియు, గర్గమహర్షి వలన పరాశరుడు, పరాశరుని వలన బృహద్రథుడు, బృహద్రథుని వలన విశ్వకర్మ, విశ్వకర్మ వలన వాసుదేవాదులు నేర్చుకొని భూలోకమునందు వ్యాపింప జేసినారనియు సమన్వయము చేసికొనుట సమంజసముగ నుండును. |

అత్యంత ప్రాచీనమయినదని చెప్పబడుచున్న వాస్తుశాస్త్ర గ్రంథము 'మానసారము' నందు ద్వాత్రింశ చ్ఛిల్పాచార్యులు పేర్కొనబడినారు.

---

1. 'ఇతి ప్రోక్తం వాస్తుశాస్త్రం పూర్వం గర్గాయ ధీమతే । గర్గా త్పరాశరః ప్రాప్త స్తస్మాత్ ప్రాప్తో బృహద్రథః॥ బృహద్రథాత్ విశ్వకర్మా ప్రాప్తవాన్ వాస్తుశాస్త్రకమ్। స విశ్వకర్మా జగతో హితాయ కథయత్ పునః ।
వాసుదేవాదిషు పునర్భూలోకం భక్తితో ఽబ్రవీత్ ॥'

—వి.ప్ర.అ. 13-109,110.

Cf : Stella Kramrisch : The Hindu Temple. Vol. I.P. 424.
"In majority of the Vastu Sastras, Siva who has also taught the 64 arts to Garga, is the source whence Vastu-vidya, the science of architecture, is revealed."

విశ్వకర్మా చ విశ్వేశః విశ్వసారః ప్రబోధకః ।
వృత్తశ్చైవ మయశ్చైవ త్వష్టా చైవ మనుర్నలః ॥
మానవి న్మానకల్పశ్చ మానసారో బహుశ్రుతః ।
ప్రష్టా చ మానబోధశ్చ విశ్వబోధో నయస్తథా ॥
ఆదిసారో విశాలాశ్చ విశ్వ కాశ్యప ఏవ చ ।
వాస్తు బోధో మహాతంత్రో వాస్తువిద్యాపతి స్తథా ॥
పారాశరీయకశ్చైవ కాలయూపో మహాఋషిః ।
చైత్యాఖ్యః చిత్రకావర్యః సాధకస్సార సహితః ॥
భానుశ్చేంద్రశ్చ లోకజ్ఞః సౌరాఖ్యః శిల్పవిత్తమః ।
తే ఏవ ఋషయః ప్రోక్తా ద్వాత్రింశతి సంఖ్యయా ॥

— మానసార. 68-59.*

గార్గేయాగమము నందు అగస్త్యాది సప్తదశ శిల్పాచార్యులు ద్వాత్రింశచ్ఛిల్ప శాస్త్రములు రచించినట్లు చెప్పబడినది.

(చూడు : అ1-శ్లో. 24-26)

అగస్త్యః కాశ్యపశ్చైవ భృగు గౌతమ భార్గవాః ।
గాళారి ఋషివర్యాశ్చ బోధశో యవనో మణి ॥
పారాశర్యాదయః సర్వే శిల్పశాస్త్ర విశారదాః ।
దైవజ్ఞో మానసారశ్చ దీప్తశ్చాత్రి మరీచయోః ॥
వైఘానసోథ కౌండిన్యో శిల్పశాస్త్రేషు ధీయుతాః ॥**

* చూడు : డా॥ బలరామ్ శ్రీవాత్సవ : రూపమండన - భూమికా పు. 2

** చూడు : గార్గేయాగమమ్. ప్రకాశకుడు : జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులు
ఈ శ్లోకములు కొలది మార్పులతో డా॥ కొండూరు వీరరాఘవాచార్యులవారి 'శిల్పదర్శనము' నందుదాహరింపబడినవి. (పు.117)

మత్స్యపురాణమునందు అష్టాదశశిల్ప శాస్త్రోపదేశికులు పేర్కొనబడిరి.

భృగు రత్రి ర్వసిష్టశ్చ విశ్వకర్మా మయ స్తథా ।
నారదో నగ్నజిచ్చైవ విశాలాక్షః పురందరః ॥
బ్రహ్మా కుమారో నందీశః శౌనకో గర్గ ఏవ చ ।
వాసుదేవో ఽనిరుద్ధశ్చ తథా శుక్రబృహస్పతీ ॥
అష్టాదశై తే విఖ్యాతా శ్శిల్పశాస్త్రోపదేశికాః ॥

—మత్స్య - అ. 250 శ్లో. 2-4.*

అగ్నిపురాణమునందు హయశీర్షాది పంచవింశతి తంత్రములు-శిల్పశాస్త్రములు పేర్కొనబడినవి. (చూడు: అగ్ని. అ 39. శ్లో. 3-5.)

వ్యస్తాని మునిభి ర్లోకే పంచవింశతి సంఖ్యయా ।
హయశీర్షం తంత్రమాద్యం తంత్రం త్రైలోక్యమోహనమ్ ॥
వైభవం పౌష్కరం తంత్రం ప్రహ్లాదం గార్గ్య గాలవమ్ ।
నారదీయం చ సంప్రశ్నం శాండిల్యం వైశ్వకం తథా ॥
సత్యోక్తం శౌనకం తంత్రం వసిష్ఠం జ్ఞానసాగరమ్ ।
స్వాయంభువం కాపిలం చ తార్క్ష్యం నారాయణీయకమ్ ॥
ఆత్రేయం నారసింహాఖ్య మానందాఖ్యం తథారుణమ్ ।
భౌధాయనం తథార్షం తు విశ్వోక్తం తస్యసారతః ॥**

వరాహమిహిరాచార్యుడు 'బృహత్సంహిత' యందు గర్గ మయ విశ్వకర్మ వసిష్ఠ నగ్నజిత్ మను భాస్కరాది శిల్పాచార్యులను పేర్కొనినాడు.[1]

* చూడు : శ్రీమత్స్యపురాణమ్ : నివృత్తి వీరాస్వామి శాస్త్రిణా సంశోధితమ్. 1877

** చూడు : అగ్నిపురాణమ్ : శ్రీమన్మహర్షి కృష్ణద్వైపాయనవ్యాస ప్రణీతమ్
సంపాదక : ఆచార్య శ్రీ బలదేవోపాధ్యాయః

1. బృహత్సంహిత. అ. 57.
చూడు : డా. బలరామ్ శ్రీవాత్సవ : రూపమండన ; భూమికా.

## విష్ణువు :: విశ్వకర్మ

విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥
—వ్యా.భా. అనుశాసనిక. 149-20.

విష్ణుసహస్రనామములలో విశ్వకర్మ, త్వష్ట యను నామములున్నవి.

"విశ్వం కర్మ యస్య : విశ్వములు కర్మలుగాఁ గలవాఁడు; విశ్వమును సర్మించినవాఁడు; విశ్వకర్మయనగా నిర్మాణ శిల్పము నెఱిగిన వాఁడు; పరమాత్ముఁడు విచిత్రమగు నిర్మాణశక్తి కలవాఁడు కావున విశ్వకర్మా యనబడును.

త్వష్ట యనువాఁడు దేవతల విశ్వకర్మ. పరమాత్మునకు అతనితో సాదృశ్యము చెప్పినచో 'విశ్వకర్మ' యనబడును." - అని వ్యాఖ్యాత వివరించినాఁడు

గరుడపురాణోక్త విష్ణుసహస్రనామము లందును, 'శిల్పకృత్' 'శిల్పి' అను నామములున్నవి.

'ప్రాణిస్థః శిల్పకృచ్ఛిల్పో హస్తయోశ్చ నియామకః ।'*
(అ. 15–137)

సమస్త విద్యలు, శిల్పకళలు, వేదములు, శాస్త్రములు, సాంఖ్యము, యోగము, జ్ఞానవిజ్ఞానములు విష్ణువు వలననే యుద్భవించినవి.

* వ్యాస : గరుడ పురాణ – అ. 15. శ్లో. 137

Cf : The Garuda Purana - 1. Eng. Tr. P. 61
The Ancient Indian Tradition and Mythology.
"Silpa Krit : Creation of Arts; Silpa; The fine arts.
"Hastayohniyamakra : Controller of hands."

యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యా శ్శిల్పాది కర్మ చ ।
వేదా శ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ ॥
(వ్యా.భా. అను. 149-40)

'...సాంఖ్యమును, యోగతంత్రమును శిల్పవేదశాస్త్రములు గర్మములు జనార్దను వలన సముద్భవించె.' —తిక్కన- అను. 5-328.

మత్స్యావతారమునందు విష్ణువు వాస్తువిద్యను మనువునకు బోధించినట్లు మత్స్యపురాణము (అ. 250) నందు చెప్పబడినది.

## ఇంద్రుడు శిల్పియా ?

రత్నకాంచనరచితమైన యింద్రసభ 'తపఃప్రభావంబున నమ రేంద్రుచేత నిర్మితంబయి కరం బొప్పుచుండు.'

—నన్నయ. సభ 1-63

శక్రస్య తు సభా[1] దివ్యా భాస్వరా కర్మభిర్జితా ।
స్వయం శక్రేణ కౌరవ్య నిర్మితార్కసమప్రభా ॥
— వ్యా.భా. సభా. 7-1.

శక్రుడు తన సభాభవనమును స్వయముగా నిర్మించికొనినాడని చెప్పుట వలన నింద్రుడు శిల్పశాస్త్రకోవిదుఁడని తెలియుచున్నది.

సహస్రాక్షుడు శిల్పకర్మాధిపతి యని ఋగ్వేదము చెప్పు చున్నది.

సహస్రాక్షో ధియస్పతీ ॥ — ఋగ్వేద. 1-23-3.

1. ఈ సభపేరు 'పుష్కరమాలిని.' —వ్యా.భా.సభా. 7-30.

ఇట 'ధియస్పతి' యనగా శిల్పకర్మములను పాలించువాడనియు, సహస్రాక్షుడనగా నయనేంద్రియ సదృశము లయిన - ప్రధానము లయిన - అసంఖ్యాత శిల్ప కార్యములు సాధించినవాడనియు నర్థము.[1]

మఱియొక మంత్రము నందును 'ఇంద్ర' శబ్దమునకు శిల్ప విద్యావేత్త యని యర్థము చెప్పబడినది.[2] —ఋగ్వేద. 1-51-3.

ఇంద్రుడు శిల్పిజన పోషకుడు.[3]

'అభవః పూర్వ్యః కారుధాయా ।' — ఋగ్వేద. 3-32-10.

అష్టాదశ శిల్పశాస్త్ర ప్రవర్తకులలో పురందరుడొకడు.[4]

## ఇంద్రుడు : విశ్వకర్మ

త్వం విశ్వా అభిభూరసి త్వం సూర్య మరోచయః ।
విశకర్మా[5] విశ్వదేవో మహాఁ అసి ॥ — ఋగ్వేద. 3-98-2.

(ఓ ఇంద్రా! నీవు నీ సామర్థ్యముతో నెల్లరను పరాభూతులను చేయుదువు; సూర్యుని ప్రకాశింప జేయుదువు. విశ్వశిల్పివి. లోకము

1. (ధియః) శిల్పకర్మకే (పతీ) పాల్‌నేవాలా.
—దయానంద ఋగ్వేద భాషాభాష్యము. పు. 30.
2. 'ఇంద్ర—శిల్ప విద్యా కో జాన్‌నే వాలే విద్వన్.'
—దయానంద. ఋ.భా భా. పు. 74.
3. 'పూర్వ లోగోం మే శ్రేష్ఠశిల్పిజనోం కా ధారణ్ కర్తా.'
—దయానంద. ఋ భా.భా. పు. 332.
4. చూడు ; మత్స్యపురాణ—అ. 250-2.
"భృగు రత్రి ర్వసిష్ఠశ్చ....విశాలాక్షః పురందరః ॥"
5. విశ్వకర్మ : సంసార్ భర్ కే శిల్పీ—దయానంద.

నందలి పదార్థములకు దివ్యత్వ మొసగువాడవు. అందుచేత నీవు మహాత్ముడవు.)

ఇంద్రుడే ప్రథమ రూపకర్త. అతడే విశ్వకర్మ.

స ప్రథమః సంకృతి ర్విశ్వకర్మా । స ప్రథమో మిత్రో
వరుణో ఽగ్నిః ।
స ప్రథమో బృహస్పతిశ్చికిత్వాన్ । తస్మా ఇంద్రాయ
సుతమా జుహోమి ॥

—యజూరాబ్రిహ్మణము. 1-1-5*

'ఉత్తమ నిర్మాణకర్మ చేయువాడు సంకృతి. అట్టివాడే విశ్వకర్మ యను దేవుడు. అతడింద్రుడే. ఇంద్రునివంటి యైశ్వర్యవంతుడే యని యర్థము.

ఇంద్రుడు శిల్పవిద్యారూపమగు నైశ్వర్యము గలవాడు.[1]

—ఋగ్వేద. 3-35-4

ఇంద్రుడు శిల్పాచార్యుడయిన త్వష్ట వంటివాడని ఐతరేయ బ్రాహ్మణమును చెప్పుచున్నది. 'ఇంద్రో వై త్వష్టా.'

ఐ. బ్రా. 6-10.[2]

* చూడు : కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత-1-4-9-సాయణభాష్యము.

'స ఇంద్ర ప్రథమో దేవానాం ముఖ్యః సర్వాధిపతిత్వాత్ ।
సమీచీనా కృతిర్నిర్మాణం యస్యా నౌ సంకృతిః ।
తాదృశో విశ్వకర్మ నామకో దేవో ఽపి స ఇంద్ర ఏవ ।
మిత్రో వరుణో ఽగ్నిః స ఏవ చికిత్వా నభిజ్ఞో బృహస్పతి రపి స
ఏవ ॥' —సాయణ.

1. "హే ఇంద్ర! శిల్పవిద్యారూప ఐశ్వర్య సే యుక్త పురుష"

— దయానంద. పు. 3-36.

2. చూడు : ధర్మదేవ్ వాచస్పతి : వేదోంకా యథార్థస్వరూప్. —పు. 322.

## ప్రథమ నౌకానిర్మాత : వైవస్వతమనువు

ఆదిమత్స్యము తనకుపకారమ్ము చేసిన మనువునకు ప్రత్యుపకారము చేయనెంచి, 'నీవు దృఢరజ్జుప్రబంధనంబును సకలధనధాన్య సహితంబును గానొక్క పేరోడగావించి సప్తముని సహితుండవై దానినెక్కి సముద్రంబు దఱిసి నన్నుం దలంచునది యేనును ఘనశృంగ శోభితంబయిన రూపంబున బొడసూపి మీకు మేలొనరించెద నని యమ్మత్స్యంబు సనియె వైవస్వతుండును తదుక్తప్రకారంబున నోడ నిర్మించి సకలబీజంబుం సంగ్రహించి సప్తముని సహితంబుగా గృతారోహణుండై పయోధి దఱియం దొడంగె నంత[1]

మఱి వైవస్వతుచే దలింపఁబడి యమ్మత్స్యంబు తోతెంచె నా
యత శృంగోన్నతమూర్తి నాతఁడుఁ దదాజ్ఞాయత్తుఁడై తచ్ఛిరో
గత శృంగాగ్రమునం దగిల్చె నతిదీర్ఘంబైన పాశంబు న
ద్భుతవేగంబున నోడ నీడ్చె నది యంభోరాశి మధ్యంబునన్'[2]

ప్రళయకాలమున, 'లోకంబెల్ల నేకార్ణవంబైన నమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేకసహస్రవర్షంబు లయ్యోడం దిగుచుచు బదం పడి యప్పెనువెల్లి యల్లనల్ల దిగిచిపోవం దొడంగునెడం దుహినగిరి శృంగ సమీపంబున నయ్యోడ నిలిపి'

'ఈ నగంబు శృంగంబున నిపుడు మీరు కట్టుడియ్యోడ' ననగా వారట్లు చేసిరి. అందుచే నా మహాద్రి శృంగమునకు నౌబంధన మని పేరు వచ్చినది.[3]

---

1. ఎఱ్ఱాప్రగడ. అరణ్య. 4-225. —వ్యా.భా.వన. 187-31
'నౌశ్చ కారయిత్వా తే దృఢా యుక్తవరాటకా.'

2. 3. ఎఱ్ఱాప్రగడ. అరణ్య. 4-226; 4-229, 30
— వ్యా.భా.వన. 187-41,42: 49,50

జలయానమున దారుమయమైన పడవకు త్రాళ్ళు కట్టి లాగుటయు ప్రయాణమాపవలసినపుడు నారజ్జువుల నెద్దేని స్తంభము వంటి దానికి కట్టుటయు, నౌకానిర్మాణమున ద్వితీయదశ. ఓడకు 'లంగరు' వేయుట మున్నగు పద్ధతులు తరువాత వచ్చినవి. పాండవులు గంగానదిలో పయనించిన పడవకు 'లంగ'రున్నది.

## జలసారధి : దీర్ఘతమముని

జలయానమునకు మూలపురుషుడు దీర్ఘతముడు. అతడే నౌకా శిల్పమునకు మార్గదర్శకుడు.

"ప్రద్వేషిణి యిమ్మునికని నెటకేనియుం గొనిపొండని తన కొడుకులం బంచిన వారును నయ్యాచక్షు నతివృద్ధు జాత్యంధు నింధనంబులతో బంధించి మోహాంధులయి గంగలో విడచిన నమ్మా నియుఁ బ్రవాహవేగంబునఁ బెక్కు దినంబులు గడచి చనియె."

—నన్నయ.ఆది. 4-231.

మూలమునందు, 'బద్ధ్వోడుపే పరిక్షిప్య గంగాయాం సమ వాసృజమ్' అనియున్నది. (ఆది 104-39) ఉడుప మనగా తెప్ప కొయ్య.

ఋగ్వేదము నందు మామతేయుడయిన దీర్ఘతముఁడు జల సారధిగా ప్రశంసింప బడినాడు.

దీర్ఘతమా మామతేయో జుజుర్వాన్ దశమేయుగే ।
అపామర్థం యతీనాం బ్రహ్మా భవతి సారథిః ॥

— ఋగ్వేద. 1-150-6.

"ద్రుహ్యువంశజులవా రుడుపప్లవసంతారయోగ్యంబైన దేశంబునకు రాజులుగా" యయాతి శాపంబిచ్చెను.[1]

ఉడుపప్లవసంతారో యత్ర నిత్యం భవిష్యతి ।
అరాజో భోజ శబ్దం త్వం తత్ర ప్రాప్స్యసి సాన్వయః ॥

ప్రాచీనకాలంబున ఉడుప ప్లవమే జలయాన సాధనముగా నున్నదనియు నది మానవుని జలయానమునకు ప్రాథమిక దశయనియు దీర్ఘతముని వృత్తాంతమును బట్టి తెలియుచున్నది.*

# నల విశ్వకర్మ

అస్తి తత్ర నళో నామ వానరః శిల్పిసంమతః ।
త్వష్టు ర్దేవస్య తనయో బలవాన్ విశ్వకర్మణః ॥

— వ్యా.భా. వన. 283-41.

'కపివీరుఁ డాయతమతి విశ్వకర్మసూనుఁడు శిల్పికర్మవిదుఁడు నలుఁడు'**

—ఎఱ్ఱన-భార-అరణ్య-7-49.

1. నన్నయ.భార.ఆది. 3-195 (వ్యా.భా.ఆది. 82-22)

* "A tag verse in the Rigveda makes Dirghatamas brahmin son of Uchathya and Mamata, a river pilot in his old age."

D.D. Kosambi : The Culture and Civilisation of Ancient India. P. 90.

** ఎఱ్ఱన. భార. అరణ్య. 7-49: (వ్యాస.వన. 283-41)

(చూడు : వా.రా.యుద్ధ. 30-33)

'విశ్వకర్మా త్వజనయ న్నలంనామ మహాకపిమ్' — వా.రా.బాల. 17-12.

నలుఁడు విశ్వకర్మ కుమారుడు. తండ్రివలె శిల్పకళా చాతుర్యము గలవాడు. వానికట్టి వరమును విశ్వకర్మయే ప్రసాదించినాఁడని సముద్రుడు రామచంద్రునితో చెప్పినాడు.**

అయం సౌమ్య నలో నామ తనయో విశ్వకర్మణః ।
పిత్రా దత్తవరః శ్రీమాన్ ప్రీతిమాన్ విశ్వకర్మణః ॥
వా.రా. యుద్ధ. 22-45

'నేను విశ్వకర్మ కౌరసపుత్రుడనియు, నా శిల్పకౌశలము తత్సదృశమైనదనియు, నన్ను బోలిన పుత్రుడు నీకు కలుగునని మాతల్లికి విశ్వకర్మ వరమిచ్చినాడనియు', నలవిశ్వకర్మయే రామునకు తెలిపినాడు.

మమ మాతుర్వరో దత్తో మందరే విశ్వకర్మణా ।
మయా తు సదృశః పుత్ర స్తవ దేవి భవిష్యసి ॥
ఔరస స్తస్య పుత్రోఽహం సదృశో విశ్వకర్మణా ॥
—వా.రా. యుద్ధ. 22 51,52

ఇతడు నూఱుయోజనముల పొడవు, పదియోజనముల వెడల్పుగల సేతువును సముద్రమున నిర్మించిన మహాప్రతిభావంతుడు *

ఈ సేతువును తన తండ్రియగు విశ్వకర్మ యెట్లు నిర్మించునో అట్లే నిర్మించినాడట.

స వానరవరః శ్రీమాన్ విశ్వకర్మాత్మజో బలీ ।
బబంధ సాగరే సేతుం యథా చాస్య పితా తథా ॥
—యుద్ధ. 22-73

* చూడు : వాల్మీకి రామాయణ-యుద్ధకాండ - సర్గ. 22.
(ఎఱ్ఱన.భార. 7-50 ; వ్యా.భా-283-44,45)

# చాక్షుషీ విద్య

'నా తపంబు వలనం బడయంబడిన చాక్షుషి యను విద్య నీ కిచ్చెద...నెవ్వండేని మూడులోకంబులం జూడ నిచ్చగించు నాతండు తన యిచ్చకుం దగనివ్విద్యపెంపున సర్వంబునుం జూచు...నీ దివ్య విద్య గొనుమిచ్చెద దీని గొనునపుడు షణ్మాసవ్రతంబు సేయవలయు' నని చిత్రరథుండైన యంగారపర్ణుడు పార్థునితో చెప్పినాడు.

—నన్నయ. ఆది. 7-51

ఈ విద్యను షణ్మాసము లేకపాదస్థితుడై నిలిచి సాధింపవలయు నని మూలమునందున్నది. — వ్యా.భా.ఆది. 170-45,46.

యచ్చక్షుషా ద్రష్టుమిచ్ఛేత్ త్రిషు లోకేషు కించన ।
తత్ పశ్యేత్ యాదృశం చేచ్ఛేత్ తాదృశం ద్రష్టుమర్హతి॥*
ఏక పాదేన షణ్మాసాన్ స్థితో విద్యాం లభే దిమామ్ ।

ఈ విద్యకు మూలపురుషుడు చాక్షుష మనువు మనువువలన సోముడు, సోమునివలన గంధర్వపతియైన విశ్వావసుడు, నాతనివలన నంగారపర్ణుడు, నంగార పర్ణుని వలన నర్జునుడు నీవిద్యను పడసిరి. ఈ విద్య నందఱికంటె నర్జునుడే సులువుగా బడసినాడు.

మనువు
|
సోముడు
|
విశ్వావసువు
|
అంగారపర్ణుడు
|
అర్జునుడు

చాక్షుషీ విద్య యనగా దూరదర్శన విద్యయే

"ఈనాటికింకను పరిపక్వస్థితికి రాని దూరదర్శన విద్య ప్రాచీన భారతీయులకు కొందఱికి తెలిసియుండె ననిన నవీన వైజ్ఞానికులు

---

* య దీతి తత్ ధర్మిస్వరూపమ్ పశ్యేత్ యాదృశం యద్ధర్మ విశిష్టం సామాన్యతో విశేషతశ్చ సర్వం సర్వావస్థం వస్తు సర్వదా స్వసంకల్పాను సారేణ పశ్యే దిత్యర్థః ॥ —నీలకంఠ.

పెదవివిఱిచి శంకాన్వితస్వాంతులై సాక్షిప్రాయముగా మందహాసము చేయుదురు.*

## చాక్షుష మనువంశము

'వస్తువునకు[1] నాంగిరస యందు విశ్వకర్మ యను శిల్పాచార్యుం డుదయంబందె నా విశ్వకర్మకు నాకృతి యను సతి యందుఁ జాక్షుషుం డనుమనువు జనియించె నా మనువు వలన విశ్వులు సాధ్యులు వసువారలు పుట్టిరి.' —ఆంధ్రమహాభాగవతము. 6-254.

చతుర్దశ మనువులలో చాక్షుష మను వాఱవవాడు. విశ్వకర్మ కుమారుడై విశ్వకర్మాంశమున జన్మించిన చాక్షుష మనువునకు పురు, పురుష, సుద్యుమ్న, విశ్వ, సాధ్యులను నేగురు పుత్రులు. చాక్షుస మనువంశీయు లయిన వీరెల్లరు శిల్ప వాస్తు శాస్త్ర ప్రవర్తకులు.

పురుః పురుషః సుద్యుమ్నో విశ్వే సాధ్య స్తథైవ చ ।
ఏతే చాక్షుష పుత్రా వై మాయామానుష విగ్రహాః ॥
ఇతి చాక్షుష వంశో వై సర్వశిల్పి విశారదః ।
జగత్ ప్రవర్తతే యస్మిన్ సర్వకార్యార్థ సిద్ధయే ॥
—శ్రీ విశ్వకర్మమహాపురాణ. అ-5**

* చూడు : గొబ్బూరు వేంకటానందరాఘవరావు :
— నన్నయ-విజ్ఞాననిరతి-పుట. 160.

1. మూలమునందు వసువని యున్నది (చూడు: వ్యా.భాగ. 6.6 15,)
'వసో రంగిరసీ పుత్రో విశ్వకర్మా ఒకృతీపతిః ।'

**చూడు: పం. జయకృష్ణశర్మా గురుదేవ్—సంగ్రహకర్త. 1952
శ్రీ విశ్వకర్మా మహాపురాణ—పుట. 86. శిల్పశాస్త్రప్రకాశన్ ఖాంసార్. దేహల్. 6.

'అపరాజతపృచ్ఛ'యను శిల్పశాస్త్ర గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయుచు పోపట్ భాయి అంబాశంకర్ మనకద్ యీ విషయమునే యిట్లుద్ఘాటించినాడు :-

"Chakshusha Muni the sixth Manu who descended from Viswakarma became the head of Chakshusha Vamsa. This Chakshusha Muni had five sons **Puru**, Purusha, Sudyumna, Viswa, Sandhya and his descendent's promulgated the Silpa and Vastu Sastra"

(P.A. Mankad : Introduction to APARAJITA PRICCHA – P. LXXXIX.)

# సుధన్వాచార్యుడు

తొల్లి ప్రహ్లాదుని కొడుకు విరోచనుండును నంగిరసుం డను విప్రుని కొడుకు సుధన్వుండును నొక్క కన్యాప్రతిగ్రహ నిమిత్తంబున నెల్ల సుగుణంబుల నేన పెద్ద నేన పెద్ద నని తమలో బ్రాణంబు లొడ్డుగా నొడ్డి వివాదంబు సేసి ప్రహ్లాదు పాలికిం జనిరి.*

* 1. నన్నయ. సభా. 2-239. (వ్యా.భా. సభా. 68-65, 66.)
2. పోల్చిచూడు : తిక్కన. ఉద్యోగ. 2-67.
"తొల్లి ప్రహ్లాదుండు.......తన కొడుకు విరోచనుండును నంగిరసుండను విప్రునికొడుకు సుధన్వుండును... ..."

'ప్రహ్లాదుండు ధర్మమతియై విచారించి తన కొడుకు కంటె గుణశ్రేష్ఠుడుగా సుధన్వుం' జెప్పినాడు.

— నన్నయ.భార.సభా.2. 239-243.

సుధన్వుడెట్లు గుణశ్రేష్ఠుడో నన్నయ చెప్పలేదు. మూలమునం దిట్లున్నది.

శ్రేయాన్ సుధన్వా త్వత్తో వై మత్తః శ్రేయాంస్తథాంగిరాః।
మాతా సుధన్వనశ్చాపి మాతృతః శ్రేయసీ తవ ॥

(నీకంటె సుధన్వుడు శ్రేష్ఠుడు, నాకంటె నతని తండ్రి యగు నంగిరసుండు శ్రేష్ఠుండు, నీతల్లి కంటె సుధన్వుని తల్లి శ్రేష్ఠురాలు.)

—వ్యా భా. సభా. 68-86.*

దీనిని బట్టి దైత్యుల కంటె అంగిరసులు గుణగరిష్ఠు లని తెలియుచున్నది.

అంగిరోమహర్షికి ఎనమండుగురు పుత్రులు. వారిలో నెనిమిదవవాడు సుధన్వుడు. అంగిరసుల కాగ్నేయులని పేరు. వారందరు జ్ఞాననిష్ఠులు. — వ్యా.భా. అను. 85-133,134**

---

* పోల్చిచూడు : వ్యా.భా. ఉద్యోగ. 34-36,37.

** అష్టావాంగిరసః పుత్రాః ఆగ్నేయాస్తే ప్యుదాహృతాః ।
బృహస్పతి రుతథ్యశ్చ పయస్యః శాంతిరేవ చ ॥
ఘోరో విరూప స్సంవర్తా స్సుధన్వా చాష్టమః స్మృతః ।
ఏతే ఒష్టౌ వహ్నిజాః సర్వే జ్ఞాననిష్ఠా నిరామయాః ॥

— వ్యా.భా. అను. 85. 133,34.

ఇష్వస్త్ర వరసంపన్న మర్థశాస్త్ర విశారదమ్ ।
సుధన్వాన ముపాధ్యాయం కచ్చి త్త్వం తాత మన్యసే ॥
వా.రా. అయోధ్య. 100-14.*

ధనుర్విద్యయందును, అస్త్రవిద్యయందును, అథర్వణ వేదోప వేదమగు నర్థశాస్త్రము నందును - శిల్పశాస్త్రమునందును - ప్రవీణుడు ఉపాధ్యాయుడు నగు సుధన్వాచార్యుని మన్నించుచున్నావా ? యని శ్రీరాముఁడు భరతు నడిగినాడు.

ధనుర్వేదాచార్యుఁడగు సుధన్వుడు సుప్రసిద్ధ శిల్పాచార్యుడు. విశ్వకర్మ బిరుదాంచితుడు. 'సుధన్వా విశ్వకర్మణి.'
(విశ్వమేదినీకోశము.)

కుమారస్వామికి శకటమును విశాలమగు నొగగల రథమును నిర్మించి యిచ్చిన రథకారుఁడు సుధన్వాచార్యుఁడే.

'సుధన్వా శకటం చైవ రథం చామితకూబరమ్ ॥'
— వ్యా.భా. అను. 86-24.

దేవతలకు రథాదులు నిర్మించి అమరశిల్పులుగా వేదములందు

---

* 1. ఇషు రమంత్రో బాణప్రయోగః అస్త్రం సమంత్రః సః సుధన్వానం తన్నామాన ముపాధ్యాయం ధనుర్వేదా చార్యమ్ ॥
— వా.రా. తిలకటీక-పు 944.

2. శస్త్రాస్త్రవిద్యలను తెలుపు ధనుర్వేదము యజుర్వేదమున కుపవేదము. అంగిరాది మహర్షులు రచించిన గ్రంథములు గలది.

అర్థశాస్త్ర మనగా శిల్పశాస్త్రము. అథర్వణవేదమున కుపవేదము. విశ్వకర్మ త్వష్ట మయుడు మున్నగువారు రచించిన సంహితాగ్రంథములు గలది.
చూడు :- దయానందసరస్వతి : సంస్కారవిధిః ॥

3. సుధన్వన్ — సుష్ఠు ధనుష్యం తదుపలక్షణం రథబాణాది కర్మరూపం శాస్త్రం యస్య స ఇతి ॥
(చూడు :- జ్ఞానానంద. విశ్వకర్మాన్వయ ప్రదీపికా)

కీర్తింపబడిన వైదిక రథకారులు-ఋభువులు-అంగిరసుండైన సుధన్వా చార్యుని పుత్రులే.

దీనినిబట్టి యంగిరసులు శస్త్రాస్త్రనిర్మాణము - రథాదియాన ముల నిర్మాణము తదితర శిల్పకార్యములు చేయు శిల్పులని తెలియు చున్నది.

## అగస్త్య మహర్షి

అగస్త్యః కాశ్యపశ్చైవ భృగుగౌతమ భార్గవాః ।
...శిల్పశాస్త్ర విశారదాః ॥ గార్గేయాగమము-1-25.

గార్గేయాగమము నందు పేర్కొనబడిన సప్తదశ శిల్పాచార్యు లలో అగస్త్యుడు ప్రథముడు. అగస్త్య మహర్షి అగస్త్యసంహిత, శిల్పకలాదీపకము, సకలాధికారము అను శిల్పశాస్త్ర గ్రంథములు రచించినాడు.

భరద్వాజకృత మయిన యంత్రసర్వస్వము నందు అగస్త్యకృత 'శక్తితంత్ర' ముల్లేఖింపబడినది,

శక్తి తంత్రమునందు సంకల్పశక్తి చేత వస్తువుల నాకర్షించు విధానము చెప్పబడినది. సంకల్పశక్తియు నొకవిధ మగు విద్యు చ్ఛక్తియే.

'రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శా కర్షిణి, ప్రాణాకర్షిణి, ధైర్యాకర్షిణి...' ఇత్యాది శక్తులిట్టివే.*

* పోల్చిచూడు : బ్రహ్మాండపురాణము-3-4-415
— శ్రీ దేవీఖడ్గమాలా స్తోత్రమ్.
Cf. also : E. Vedavyas : Hinduism in Space Age. P. 147

'అగస్త్య మహర్షి కే "మాన" ఋషి యనియు నామాంతరము గలదు. అతి ప్రాచీన వాస్తు విద్యా ప్రవర్తకులలో నగస్త్యుడొక డనియు, నతడు భారతీయ స్థాపత్యము నందలి రెండు ముఖ్య సంప్రదాయములకు మార్గదర్శకు డనియు పండితు లూహించుచున్నారు.[1]

## శోషణీ విద్య

వరుణజలంబుల మిత్రావరుణ తనూజుండు వీర్యవంతుండై చె
చ్చెరఁ ద్రావనోపు నిందఱు నరుగుఁడు ప్రార్థింపుఁ
డమ్మహాత్ము నగస్త్యున్.

- అని విష్ణుదేవుఁడు దేవతలతో చెప్పినాడు

(నన్నయ. అరణ్య. 3-17)

అగస్త్యేన వినా కో హి శక్తో ఽన్యో ఽర్ణవ శోషణే ।
అన్యథా హి న శక్యాస్తే వినా సాగర శోషణమ్ ॥

— వ్యా.భా. వన. 103-11.

సముద్ర జలములు త్రావుట యననేమి? వీనికి శక్తి యెట్లు వచ్చినది?

సముద్రజలములు త్రావుట యనగా సముద్ర జలములకు శోషింపజేయుట. ఈ విద్యకు 'శోషణీ విద్య' అని పేరు. ఈ విద్య ననగస్త్య మహర్షి యొక్కడే యెఱుగును. అన్యులెఱుగరు.

1. Cf. . Dr. Kantilal F. Sompura : The Structural Temples in Gujarat. P. 240.

"Agastya otherwise called Mana, is considered to be one of the earliest authorities on Vastu Vidya. ie., architecture. He gave rise to two important traditions of Indian Architecture."

అగస్త్యుడీ శోషణీ విద్యను అధర్వణ వేదోక్త మంత్రముల ద్వారమున సాధించినట్లు స్కాందపురాణము వలన దెలియుచున్నది.

(నాగరఖండ. అ-60-2,3. పుట. 68)

శోషణీనామ యా పురాగస్త్యేన సాధితా ।
అథర్వణేన మంత్రేణ స్వయం చ పరమేశ్వరీ ॥
తతః సంశోధిత స్తేన స సముద్రా మహాత్మనా ।
మిత్రావరుణపుత్రేణ సా ప్రోక్తా పురతః స్థితా ॥

## పథవిద్య

"చనియెద దక్షిణదిశ కే నొనరగఁ దెరువిమ్ము నాకు నుర్వీధర నీ
వనవుడు నట్టుల చేయుదు నని పెరుగుట యుడిగి వింధ్య
మతి వినయముతో,
భట్టారా విజయం చేయుడని భూమి సమానమై" యుండెను.

— నన్నయ. అరణ్య. 3-28,29,30.

వింధ్య పర్వతమిట్లు తెరువీయగా నగస్త్యుఁడు, 'దక్షిణ దిశకుం జని లోకంబులకు హితంబగు నందయుండెను.'

అగస్త్యుడు వింధ్యపర్వతమును 'భూమిసమానమై' యుండు నట్లొనర్చె ననగా కొండను బ్రద్దలు గొట్టి భూమితో సమానముగా చదునుచేసి మార్గమేర్పఱచె నన్నమాట. దీనినే 'పథవిద్య'యందురు. పథవిద్య 'సమభూమిక్రియా' 'శిలార్చా' అని రెండు విధములు.*

---

* శిల్పశాస్త్రాంతర్గతమగు రథకారశాస్త్రమున 1. పథవిద్య, 2.ఘంటాపథవిద్య, 3. సేతువిద్య యని మూడు విద్యలు (కళలు) గలవు.

(భారతీయవిద్య. పు. 95.)

అగస్త్యుని ఈ కథవలన ఆర్యులు కొండలను పిండి చేసి మార్గము లేర్పఱచుకొని దక్షిణాపథమునకు పోయినారనియు అగస్త్యుడు వారికి నాయకత్వము వహించినాడనియు తెలియుచున్నది.

అయోధ్యానగరమున మార్గ నిర్మాణ ప్రవీణులగు శిల్పులున్నట్లు వాల్మీకి రామాయణమునందు వర్ణింపబడినది.

'తే స్వవారం సమాస్థాయ వర్త్మకర్మణి కోవిదాః ॥'

అయోధ్య. 80-5.

## విమానవిద్య

అగస్త్యుడు విమానవిద్య యందును ప్రవీణుడే. ఉజ్జయినీ నగరము నందుపలబ్ధమయిన 'అగస్త్యసంహిత' యను గ్రంథము కుంభోద్భవుడగు అగస్త్యుని చేత రచింపబడినదని విజ్ఞుల యభిప్రాయము, చూడు :- భారతీయ విద్యా. పు. 101

అగస్త్యుని సంహిత 'అబ్ధియాన' మనియు 'అగ్నియాన' మనియు రెండు భాగములుగా నున్నది. 'అగ్నియానము' నందు విమానాకృతి విమాన నిర్మాణాది విషయములు చెప్పబడినవి.

ఆకాశమునందు సంచరించు విమానము నీటియందు చలించు నౌకను బోలి యుండును.

వ్యోమయానం విమానం స్యా దగ్నియానం తథైవహి ।
జలనౌకేవ యానం యద్ విమానం వ్యోమ్ని కీర్తితమ్ ॥

# ధనుర్విద్య

'దివ్యశస్త్రాస్త్రవిద్యారహస్యంబునకు మూల'[1] మయిన యగస్త్యమహర్షి వలన నగ్నివేశుడు, నగ్నివేశుని వలన ద్రోణాచార్యుడు, వాని వలన నర్జునాశ్వత్థామలు బ్రహ్మశిరోనామకాస్త్రమును బడసిరి.[2]

అది 'యల్పతేజులందు ప్రయోగింపబడి...జగంబులంగాల్చు'[3] 'అమ్మహాస్త్రంబు మనుష్య విషయంబుగా ప్రయోగించువానికి నశుభంబగు, నొకనిచేత ప్రయోగింపబడి యన్యునస్త్రం బుపశమించెనేని యద్దేశంబునకుఁ బండ్రెండేఁడ్లనావృష్టి దురితంబగు.'[4]

బ్రహ్మశిరోనామకాస్త్రము నేటి అణ్వస్త్రముల వంటిది. ఇట్టిది దారుణ మారణాస్త్రముల నూహింపగఁ ఋషులు నిర్మింపగల శిల్పులు (కర్మారులు) భారతేతిహాసకాలము నందుండుట విశేషము.

వనవాసకాలమున శ్రీరాముడు దక్షిణభారతము నందలి యగస్త్యాశ్రమమును దర్శింపగా నగస్త్యుఁడు విశ్వకర్మ నిర్మితమును, హేమవజ్రభూషితమును, దివ్యమును నైన విష్ణు ధనుస్సును, బ్రహ్మాస్త్రము, నక్షయతూణీరములు రామచంద్రున కొసగినట్లు వాల్మీకి రామాయణము నందు వర్ణింపబడినది.

ఇదం దివ్యం మహచ్చాపం హేమవజ్రవిభూషితమ్ ।
వైష్ణవం పురుషవ్యాఘ్ర నిర్మితం విశ్వకర్మణా ॥

---

1. తిక్కన–సౌప్తిక. 2-46
2. నన్నయ–ఆది. 6-98.99 ; పోల్చు ; తిక్కన–సౌప్తిక, 2-40.
3. నన్నయ–ఆది, 6-100 ; పోల్చు : తిక్కన–సౌప్తిక, 2-44.
4. తిక్కన–సౌప్తిక, 2-76 ; 2-64,65 (వ్యా.ఖా-సౌప్తిక, 15-23)

అమోఘః సూర్యసంకాశో బ్రహ్మదత్తః శరోత్తమః ।
దత్తే మమ మహేంద్రేణ తూణీచాక్షయ్యసాయకౌ ॥

వా.రా – అరణ్య. 17-32-33.

దీనిని బట్టి యగస్త్యమహర్షి త్రేతాయుగమునం దున్నట్లు తెలియుచున్నది.

## శిల్పవిజ్ఞాన విశిష్టుండు : వసిష్ఠుండు

'కశ్యపబ్రహ్మర్షి పుత్రుడయిన మిత్రావరుణునికి అగస్త్యుడు, వసిష్ఠుడు నను నిద్దరు పుత్రులు. వసిష్ఠుని పుత్రుడు శక్తి; వాని పుత్రుడు పరాశరుడు.

ఋగ్వేదము నందలి సప్తమమండలము వసిష్ఠ సంపాదితము.

శుక్లయజుర్వేదమున తృతీయాధ్యాయము నందలి, 60, 61 మంత్రములు, పంచమాధ్యాయము నందలి 16, 17 మంత్రములు, సప్తమాధ్యాయము నందలి 7వమంత్రము, అష్టమాధ్యాయము నందు 54 నుండి 62 మంత్రముల వరకు, నవమాధ్యాయము నందలి 16వ మంత్రము, 18 నుండి 25 వరకుగల మంత్రములు ద్వాదశాధ్యాయము నందలి 34, 35 మంత్రములు;

సామవేదము నందలి 536 మంత్రము;

అధర్వవేదము నందలి తృతీయకాండ 19 సూక్తములో 1 నుండి 8 వఱకు గల మంత్రములు - వీనికన్నింటికి వశిష్ఠమహర్షియే మంత్రద్రష్ట.

ఈ మంత్రములను పరిశీలించినచో వసిష్ఠుడు - లోహశిల్పము

(Mechanical Engineering), జలశక్తియోగశాస్త్రము (Hydraulic Engineering) నందు విశేషజ్ఞానము కలవాడని తెలియవచ్చును.

వసిష్ఠమహర్షి కృతము లయిన వసిష్ఠశిల్పము, జ్ఞానసాగరము అను శిల్పశాస్త్రగ్రంథముల యందు జలగతిశాస్త్ర విశేషములు (Hydrodynamics) తెలుపబడినవి.

అష్టాదశ శిల్పశాస్త్ర ప్రవర్తకులలో వశిష్ఠుడొకడు (మత్స్య పురాణము).

వశిష్ఠుడు సంవరణుని పురోహితుడు. 'మహీతలంబున కనావృష్టియయిన నెఱింగి వసిష్ఠుండు శాంతిక పౌష్టికవిధు లొనరించి సంవరణుం దోడ్కొని హాస్తిపురంబున కరిగిన నఖిల ప్రజకు ననురాగంబయ్యె ననావృష్టి దోషంబును బాసె.'[1] శాంతిక పౌష్టికము లథర్వవేదవిహితములు గావున నీ వసిష్ఠుడాథర్వణబ్రాహ్మణుడే.

## విశ్వామిత్రుని వినూత్నసృష్టి

విశ్వామిత్రుడు తపోబల సంపన్నుడు.

అమ్మౌని యల్గిచూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ
ధ్రమ్ములు ప్రయ్యు నయ్యుసుము దక్కఁగ నంబుధులింకు
మూడులో
కమ్ములు దిర్దిరం దిరుగు గాడ్పు చలింపగ నోడు...

— నన్నయ-ఆది. 4-32.

విశ్వామిత్రుని తపోబలమట్టిది.

1. నన్నయ. ఆది. 7-90

రాజర్షియైన విశ్వామిత్రుడు వసిష్ఠుని హోమధేనువును బ్రహ్మతేజోజనితంబయిన ప్రభావంబును జూచి విలక్షముఖుడై రాజ్యసంపదలను త్యజించి విరక్తుడై,

'వెలయు దపంబు సేసి గుణవిశ్రుతుడై పడసెన్ మహాతపో
బలమున సర్వసంపదలు బ్రహ్మఋషిత్వము దివ్యశక్తియున్.'
—నన్నయ-ఆది. 7-110

ఆ దివ్యశక్తితో శిల్పవిజ్ఞానవేత్తయై అపరప్రజాపతియై వినూత్న లోకములు సృష్టింప గలిగినాడు.

చకారాన్యం చ లోకం వై క్రుద్ధో నక్షత్రసంపదా ।
ప్రతిశ్రవణపూర్వాణి నక్షత్రాణి చకార యః ॥
గురుశాపహతస్యాపి త్రిశంకోః శరణం దదౌ ॥
— వ్యా.భా-ఆది. 71-34.35.*

బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడు శ్రవణాది సప్తనక్షత్రయుక్తమైన యొక నూతనలోకమును సృష్టించి, వసిష్ఠశాపోపహతుడైన త్రిశంకునకు శరణొసగినాడు.

* పోల్చు : వాల్మీకి రామాయణము—బాలకాండ, సర్గ 60-20,21 (గోరఖ్‌పూర్)

ఋషి మధ్యే స తేజస్వీ ప్రజాపతి రివాపరః ।
సృజన్ దక్షిణ మార్గస్థాన్ సప్తర్షీ నపరాన్ పునః ।
నక్షత్రవంశ మపర మసృజత్ క్రోధమూర్ఛితః ॥

"....like another Brahma (creator of beings) he evolved another group of seven constellations (corresponding to the Great Bear) coursing in the Southern quarter and further created a galaxy of (twenty seven) Lunar mansions" —Eng. tr. Gorakpur Ed.

# కర్మయోగులు : కాశ్యపులు

యత్తే శిల్పం కశ్యప రోచనావత్ ఇంద్రియావత్ పుష్కల
చిత్రభానుః ।

—తైత్తరీయ బ్రాహ్మణము. 7-3-15*

ఓ కశ్యపప్రజాపతీ నీ శిల్పకౌశలము కాంతిమంత మయినది. వీర్యోపేతమును, సంపూర్ణమును, చిత్రవిచిత్రమునై ప్రకాశించు చున్నది.

కశ్యపప్రజాపతి బ్రహ్మ మానసపుత్రుడయిన మరీచి కుమారుడు.

కశ్యపుడు సుప్రసిద్ధ శిల్పాచార్యులలో నొకడు (మత్స్య పురాణము.)

కాశ్యపశిల్పము, అంశుమద్భేదకల్పము, కాశ్యపసంహిత (యంత్రశిల్పము) శిల్పసంహిత - ఇత్యాది శిల్పశాస్త్రగ్రంథములు కశ్యపమహర్షి కృతములు.

శ్రుతి ప్రసిద్ధుడైన కశ్యపుడే ప్రాచీనతమశిల్పాచార్యు డనియు, నతడే కాశ్యపశిల్పగ్రంథకర్తయై యుండుననియు కాశ్యప శిల్పోపోద్ఘాతకర్త పణ్డితకృష్ణశర్మా కలానిధి అభిప్రాయపడినాడు. 1

---

* హే కశ్యపప్రజాపతే ! తే తవ శిల్పం కర్మకౌశలమ్ రోచనావత్ దీప్తిమత్
— సాయణ

1. 'కశ్యపస్య శ్రుతిష్వపి శిల్పజ్ఞ ఇతి ఖ్యాతిః తస్మాత్ కశ్యపః ప్రాచీనతమః శిల్పజ్ఞ ఇతి తర్కయామి.' —కృష్ణశర్మాకలానిధి.

బ్రహ్మవిద్యాగురుపరంపర యందు శిల్పకశ్యపుఁడొకడు గనిపించుచున్నాడు. అతడు కశ్యప ప్రజాపతి తనయుఁడయిన నిధ్రువుని శిష్యుడు. శిల్పకశ్యపుని శిష్యుఁడు హారితకశ్యపుఁడు.[1]

కశ్యపప్రజాపతి
|
నిధ్రువ
|
శిల్పకశ్యప
|
హారితకశ్యప

పయి శిల్పశాస్త్రగ్రంథములలో కొన్నియైనను శిల్పకశ్యప కృతములై యుండవచ్చును.

## గర్గమహర్షి : గార్గేయుడు

గర్గమహర్షి మహాదేవుని యనుగ్రహమున చతుష్షష్టికళాజ్ఞానము సంపాదించినట్లు మహాభారతము వలన తెలియుచున్నది.[2]

'విశ్వకర్మ తత్త్వమును సమగ్రముగా నెఱిగినవాడు గర్గమహర్షి. ఆగర్గుని నుండియే తరువాత నారదాదులు విశ్వకర్మతత్త్వమును మహీమోదంతములను తెలిసికొని కృతకృత్యులైనట్లు మనకు ప్రమాణగ్రంథములు చెప్పుచున్నవి.'[3]

గర్గమహర్షి ఆంగిరస భరద్వాజ వంశమునందు ప్రసిద్ధికెక్కిన

1. హారితః కాశ్యపః శిల్పాత్ కాశ్యపాత్ శిల్పః కశ్యపః కశ్యపాన్ నైధ్రువేః కశ్యపో నైధ్రువిః । — బృహదారణ్యకోపనిషత్-14-6.
2. — వ్యా.భా. అనుశాసనిక - 18-38.
3. డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : గార్గేయాగమమ్ — పరిచయము.

వాడు.[1] ఋగ్వేదమంత్రద్రష్ట.[2] అష్టాదశశిల్పాచార్యులలో నొకడు.[3] వాస్తుశాస్త్రవేత్త. వృద్ధగర్గుడను జ్యోతిషశాస్త్రవేత్త గర్గవంశీయుడే.

... ... ...

'గార్గేయాగమ' మను శిల్పశాస్త్ర గ్రంథమును రచించిన గార్గేయుడు గర్గమహర్షి పుత్రుడే.

గర్గపుత్రం మహాసౌమ్యం శిల్పశాస్త్రానుమోదినమ్ ।
తత్ప్రయోగవిదం పుణ్యం గార్గేయ మృషిసత్తమమ్ ॥
—గార్గేయాగమము-1-4.

'ఈ గార్గేయాగమము అతిప్రాచీనములగు పరశివ విశ్వకర్మాగమాదులలో నొకటి... గర్గమహర్షి పుత్రుడు గార్గేయుడు మునీశ్వరుల కుపదేశించినదే యీ గార్గేయాగమము.'[4]

గర్గ వంశీయులు శిల్ప-వాస్తు-జ్యోతిషశాస్త్రజ్ఞులుగా ప్రసిద్ధి గాంచినారు.

---

1. చూడు : ఆనందస్వరూప్ భరద్వాజ్ ; జాంగిడ్ బ్రాహ్మణ నిదేశికా. పు. 91
2. ఋగ్వేద : 6-47
3. మత్స్యపురాణం. అ. 252.
4. డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : గార్గేయాగమము : పరిచయము.

# భరద్వాజ మహాముని

సద్వినుత చరిత్రుఁడు భరద్వాజుండను మునీశ్వరప్రవరుఁడు గం
గాద్వారమునఁ దపంబు జగద్వంద్యుఁడు సేయుచుండె
గతకల్మషుఁడై.

—నన్నయ. ఆది. 5-194

భరద్వాజుఁడు భారతాచార్యుఁడయిన ద్రోణాచార్యుని జనకుఁడు.[1] వేదర్షియయిన భరద్వాజుఁడు బృహస్పతి తనయుఁడు. (భరద్వాజో బార్హస్పత్య ఋషిః)

ఋగ్వేద షష్ఠమండలము నందలి యగ్ని దేవతాకములగు అనేక సూక్తములకు మంత్రద్రష్ట. 1 నుండి 30 వఱకు, 37 నుండి 46 వఱకు, 53 నుండి 74 వఱకు గల సూక్తములు, 48వ సూక్తము భరద్వాజ కృతములు.

ఈ సూక్తములందు శిల్పవిద్యారహస్యములు నిక్షిప్తమయి యున్నవి[2]

శుక్లయజుర్వేద తృతీయాధ్యాయము నందలి 3, 13 మంత్రములకు, సప్తమాధ్యాయము నందలి 24,25 39 మంత్రములకు, అష్టమాధ్యాయమునందలి 6 నుండి 14 వఱకు గల మంత్రములకు, ఏకాదశాధ్యాయమునందలి 33,34 మంత్రములకును మంత్రద్రష్ట భరద్వాజుడే.

భరద్వాజ మహర్షి వేదసముద్రమును మథించి,'యంత్రసర్వస్వ' గ్రంథరూప మగు వెన్నను తీసి - సర్వజనులకు నభీష్టప్రదమయిన దానిని లోకమున కందించినాడు.

---

1. చూడు : నన్నయ-అరణ్య. 3-254. భరద్వాజునకు యవక్రీతుడను మఱియొక సుతుడున్నాడు.

2. చూడు : దయానంద సరస్వతి : ఋగ్వేదభాషాభాష్యము.

నిర్మథ్య తద్వేదాంబుధిం భరద్వాజో మహామునిః ।
నవనీతం సముద్ధృత్య యంత్ర సర్వస్య రూపకమ్ ॥
ప్రాయచ్ఛత్ సర్వలోకానా మీప్సితార్థ ఫలప్రదమ్ ॥
—యంత్రసర్వస్వే—వైజ్ఞానికప్రకరణమ్*

అంగిరసుం డయిన భరద్వాజుఁ డనేకవిధములుగా నగ్ని సాధనతో శిల్పవిద్యారహస్యప్రయోగములు చేసి ఫలితములు గ్రంథస్థము చేసినాడు.

'భరద్వాజశిల్ప'మను శిల్పశాస్త్రగ్రంథము భరద్వాజమహర్షి కృతమే.

భరద్వాజుడు 'అంశుబోధినీ' 'ఆకాశతంత్రము' అను గ్రంథములను కూడ రచించినాడు.

'అంశుబోధిని' యందు గ్రహమేధ, కాంతి, ఉష్ణము, ధ్వని, తంత్రీవార్త, విమాననిర్మాణము, విద్యుచ్ఛక్తి ప్రయోగము మొదలగు నంశములు గలవు.

'ఆకాశతంత్రము' నందు సప్తవిధాకాశముల వర్ణన మున్నది.

శ్రీరాముడు వనవాసమున కేగినపుడు మొట్టమొదట భరద్వాజమహర్షిని దర్శింపగా భరద్వాజుడు తన యాశ్రమమున గాని, చిత్రకూటమునగాని యుండుడని సూచించినాడు.[1]

భరతుడు సపరివారముగా భరద్వాజాశ్రమమున కేగినపుడు, భరద్వాజమహర్షి సురశిల్పియగు విశ్వకర్మ నాహ్వానించి భరతునకు, తత్సైన్యమునకు నాతిథ్య మొసగినాడు.

---

* భరద్వాజ : బృహద్విమానశాస్త్ర—అ. 1-10,11. పుటలు. 2,3.

1. వాల్మీకిరామాయణము—అయోధ్య—సర్గ 54.

అగ్నిశాలాం ప్రవిశ్యాథ పీత్వాపః పరిమృశ్య చ ।
ఆతిథ్యస్య క్రియాహేతో ర్విశ్వకర్మాణ మాహ్వాయత్ ॥
ఆహ్వాయే విశ్వకర్మాణ మహం త్వష్టారమేవ చ ।

—వా.రా. అయోధ్య. 91-11,12.*

దీనిని బట్టి భరద్వాజ మహర్షి త్రేతాయుగమునందున్నట్లు తెలియుచున్నది.

## శుక్రాచార్యుడు

'బ్రహ్మహృదయంబున భృగుండు పుట్టె;
వానికిఁగవి పుట్టె;
వానికి శుక్రుండు పుట్టి యసురుల కాచార్యుండయ్యె;
వానికి చండామర్క త్వష్టృ ధరాత్రులనంగా
నలువురు కొడుకులు పుట్టిరి,
వారసురులకు యాజ్ఞికులైరి.'[1]

బ్రహ్మ
|
భృగు
|
కవి
|
శుక్ర
|
చండ | మర్క | త్వష్ట | అత్రి

* The Sage next invoked Viswakarma (the architect of Gods) for providing hospitality to the army of Bharata. "I invoke Viswakarma who is also the divine carpenter (Tvasta)"

Eng. Tr. Kalpataru—Ed. Ghorakpur.

1. నన్నయ. ఆది. 3-69 (వ్యా.భా. ఆది. 66-41,42.)
బ్రహ్మణో హృదయం భిత్వా నిఃసృతో భగవాన్ భృగుః ।
భృగోః పుత్రః కవి ర్విద్వా న్ఛుక్రః కవిసుతో గ్రహః ।
స్వయంభువా నియుక్తః సన్ భువనం పరిధావతి ॥ —ఆది. 66-41.42.



→

మహాబుద్ధిమంతుఁడు, యోగశాస్త్రోపాధ్యాయుఁడు నైన శుక్రుడు దైత్యులకు గురు వయినాడు.

'యోగాచార్యో మహాబుద్ధి ర్దైత్యానా మభవద్గురుః ॥'

— వ్యా.భా. ఆది. 66-43.

శుక్రునకు ఉశనుడనియు, కావ్యుడనియు (కవిపుత్రుడు), మహాకవియనియు, భార్గవుఁడనియు నామాంతరములు.

శుక్రుడు తన తపశ్శక్తివలన ప్రజాపతితో సమానమయిన వాడు.[1]

## మృతసంజీవనీవిద్య : కావ్యకళ

'మనుజాధిప వృషపర్వుం డను దానవపతికి శుక్రుఁ
డాచార్యుండై
యనిమిషవిరోధులకుఁ బ్రియమొనరించుచు వివిధ
విధనయోపాయములన్.
దేవాసురరణమున గతజీవితులగు నసురవరులఁ
జెచ్చెర మృతసం
జీవిని యను విద్యఁ బునర్జీవులుగాఁ బ్రతిదినంబుఁ
జేయుచు నుండెన్.'

అను — ముపాధ్యాయః శుక్ర స్త్వృషి సుతో ఽభవత్
ఖ్యాతా శ్చోశనసః పుత్రా శ్చత్వారో ఽసురయాజకాః ॥
త్వష్టాధర స్తథాత్రిశ్చ ద్వావన్యౌ రౌద్రకర్మిణౌ ।
తేజసా సూర్యసంకాశా బ్రహ్మలోకపరాయణాః ॥

— వ్యా.భా. ఆది. 65-36,37.

1. నన్నయ. ఆది. 3-166.

మృతసంజీవనీ విద్యను శుక్రాచార్యుఁడే కాని యన్యులెఱుఁగరు. దీనికే 'కావ్యకళ' యనియు పేరు.

'న హి వేద స తాం విద్యాం యాం కావ్యో వేత్తి వీర్యవాన్.'

—వ్యా.భా. ఆది. 76-10.

కావుననే, దేవతలు శుక్రాచార్యుని వద్ద నీ విద్య నభ్యసించు టకు అంగిరసుండయిన బృహస్పతి పుత్రుని కచుని పంపినారు. శుక్ర బృహస్పతులు పరస్పరము స్పర్ధగలవారైనను[1] శుక్రాచార్యుఁడు బృహస్పతి కుమారుడైన కచుని శిష్యుఁడుగా నంగీకరించినాఁడు.

కచుఁడును, 'వేదాధ్యయన శీలుండయి సకలదైత్యదానవ గణోపాధ్యాయుండయి యున్న శుక్రుని' శుశ్రూష జేసి మృతసంజీవనీ విద్యారహస్యము గ్రహించినాడు.

శుక్రుని విజ్ఞానము విద్యాబలము నమోఘములు.

'అమోఘం తవ విజ్ఞాన మపి విద్యాబలం చ తే.'*

—వా.భా. ఆది. 80 26.

ఇట విజ్ఞానమనగా బ్రహ్మానుభవ మనియు, విద్యయనగా మృత సంజీవనీ విద్య యనియు నీలకంఠుఁడు వివరించినాఁడు.

విజ్ఞాన మన శిల్పవిజ్ఞాన మనియు చెప్పికొన వచ్చును.

ఉశనుఁడు యుద్ధశాస్త్రమునందు నిపుణుఁడు. రామునితో యుద్ధము చేయునపుడు రావణుఁ'డభేద్యంబగు నౌశనస వ్యూహంబు' సంఘటించినాడు.[1]

---

1. జిగీషయా తతో దేవా వవ్రిరే ఽఽంగిరసం మునిమ్ ।
పౌరోహిత్యేన యాజ్యార్థే కావ్యం తూశనసం పరమ్ ॥
బ్రాహ్మణౌ తావుభౌ నిత్య మన్యోన్య స్పర్ధినౌ భృశమ్ ॥
— వ్యా.భా. ఆది. 76-6,7

* 'విజ్ఞానం బ్రహ్మానుభవః విద్యా మృతసంజీవనీ ॥' —నీలకంఠ.

1. ఎఱ్ఱన—అరణ్య. 7-74 (వ్యా.భా. వన. 285.6)

శుక్రుడు కృత్యాభిసారాద్యథర్వణ మంత్రప్రయోగదక్షుడు.[1] అథర్వవేద విధిజ్ఞుడు, వేదవేదాంగపారగుఁడు, సర్వశాస్త్రార్థవిదుఁడు నైన యుశనుడు రాజ్యఫలప్రదమగు 'నౌశనసశాస్త్రము' రచించి నాఁడు.[2]

అమితప్రజ్ఞుడు యోగాచార్యుఁడు నైన శుక్రాచార్యుఁడు నూఱువేలధ్యాయములు గల నీతిశాస్త్రమును సహస్రాధ్యాయ పరిమితము గావించినాడు.[3] 'శుక్రనీతి' అను రాజనీతి శాస్త్రగ్రంథము సుప్రసిద్ధమయినది.

ఈ గ్రంథములందు శిల్పశాస్త్ర విషయములున్నవి.[4]

అసురగురువగు శుక్రాచార్యుఁ డష్టాదశశిల్పోపదేశకులలో నొకడు. —మత్స్య. అ. 252.

1. చూడు : ఎఱ్ఱన. అరణ్య. 6-41 (వ్యా.భా. వన. 251-23,24)
'శుక్రాదులైన భూసుర సమూహముల చేత వేల్మి పెట్టించిన వేగంబ యొకకృత్య వెలువడినది.'
2. చూడు : బ్రహ్మాండపురాణ. 2-3-30. శ్లో. 52-54.
'అథర్వణాం విధిః సాక్షాద్వేద వేదాంగ పారగః సర్వశాస్త్రార్థవిత్
ప్రాజ్ఞః సకలాసురవందితః ॥....శాస్త్రమౌశనసం యేన రాజ్ఞాం
రాజ్యఫలప్రదమ్ । ప్రణీత మనుజీవంతి సర్వే ఉద్యాపీహ పార్థివాః ॥
3. తిక్కన. శాంతి—2.205 (వ్యా.భా. శాంతి. 59.85)
అధ్యాయానాం సహస్రేణ కావ్యం సంక్షేప మబ్రవీత్ ।
తచ్ఛాస్త్ర మమితప్రజ్ఞో యోగాచార్యో మహాయశః ॥
4 Cf : Govinda Krishna Pillai : The ways of the Silpis
— P.P. 247-248.
"Sukra Acharya or Usanas Sukra as a great authority on Hindu Sculpnre is quoted even today by the Hindu Silpis. His work, on these subjects is known as Sukra Neethi."
"....and the earliet authority on the Hindu sculpture Sukracharya flourished at the latest about 2050 B.C.

## సూర్యసిద్ధాంతకర్త : మయమహాసురుఁడు

అల్పావశిష్టే తు కృతే మయ నామా మహాసురః ।
ఆరాధయన్ వివస్వంతం తపశ్చేపే సుదుశ్చరః ॥

కృతయుగము స్వల్పముగా నుండగా మయుఁడను మహాసురుఁడు జ్యోతిషశాస్త్రార్థము సూర్యుని గూర్చి తపమొనరించినట్లు సూర్యసిద్ధాంతము వలన తెలియుచున్నది.*

'సూర్యసిద్ధాంతమను పురాతన జ్యోతిష సిద్ధాంత గ్రంథము, కృతయుగము పండ్రెండు వందల సంవత్సరములు మిగిలియుండగా సూర్యునివలన లంకాధిపతియైన మయుని కుపదేశింపబడి తిరిగి ప్రచారములోనికి వచ్చినది.'**

| | | |
|---|---|---|
| ఈ లెక్క ప్రకారము | కృతయుగ శేషము | 1,200 సం |
| | త్రేతాయుగము | 12,96,000 సం |
| | ద్వాపరయుగము | 8,64,000 సం |
| | కలియుగము(క్రీ.శ.1982 నాటికి) | 5,083 సం |
| | | 21,66,283 సం |

కావున మయకృత సూర్యసిద్ధాంత గ్రంథరచనాకాలము క్రీ శ 1982 సం నాటికి 21,66,283 సం. అని తెలియుచున్నది.

---

* సూర్యసిద్ధాంతే - ప్రథమే - మధ్యాధికారే - శ్లో. 2,3
చూడు : రాణి (రాజ్ఞీ) శ్రీనివాసశాస్త్రి : ప్రాచీనభారతీయ విజ్ఞానము. పు.64

** చూడు : పండిత కోట వేంకటాచలము : ఆంధ్రులపుట్టుపూర్వోత్తరాలు
— జంబూద్వీపము. పుట. 16.

ఈ గ్రంథము వైవస్వతమనువు నాటి ప్రళయకాలము కంటె ప్రాచీనమైనదని వేదవ్యాస్ అభిప్రాయపడినాడు.[1]

## ఔశనసధనాఢ్యుఁడయిన మయుఁడు

హనుమంతుఁడు వానరులతో సీతాదేవి నరయుచుఁబోయి యొక్కెడ నతి విశాలంబయిన భూవివరమును[2] ప్రవేశించి...చనునెడ, 'ముందట నర్కప్రకాశంబైన పురంబు కానంబడియె, నందొక్క తాపసాంగన తన పేరు ప్రభావతియనియును, నప్పురంబు మయపురం బనియును జెప్పె.'

— ఎఱ్ఱన.అరణ్య. 7-15. (వ్యా.భా-282-40.41)

వాల్మీకి రామాయణమునందీ తాపసాంగన పేరు 'స్వయం ప్రభ' యని యున్నది స్వయంప్రభ (ప్రభావతి) హనుమంతునితో నిట్లు చెప్పినది ;-

---

1. This book is "far more ancient than Manu's flood which detroyed Atlanteans and probobly as old as the oldest sumerian astronomical calculations going upto 50,000B.C. or more."

—E. Vedavyas. Hinduism in the Space Age P. 592.

2. ఈ భూవివరము మయనిర్మితమే.

(చూడు :- వా.రా. కిష్కింధ — 57—17.)

'మయస్య మాయావిహితం తద్ బిలం చ విచిన్వతామ్.'

'That cavern constructed by the demon Maya by dint of his wonderful architectural skill.'

—V.R. with Eng. Tr. Geeta prees Ed.

మయోనామ మహాతేజా మాయావీ వానరర్షభ ॥
తేనేదం నిర్మితం సర్వం మాయయా కాంచనమ్ వనమ్ ।
పురా దానవ ముఖ్యానాం విశ్వకర్మా బభూవ హా ॥
ఏ నేదం కాంచనం దివ్యం నిర్మితం భవనోత్తమమ్ ।
— వా.రా. కిష్కింధ – 51-10, 11, 12.

మహాతేజస్వియు శిల్పకళాచతురుడు (మాయావి) నైన మయుడు, తన శిల్పవిద్యా కౌశలము చేత (మాయయా)[1] వనమంతయు కాంచనమయము చేసినాడు. పూర్వకాలమున దానవ విశ్వకర్మగా నున్న మయుడే యీ దివ్యభవనమును కాంచనమయముగా నిర్మించినాడు.

మయుఁడీ భవనమును నృత్తగీతవిశారదయగు తన భార్య హేమకొఱకు శిల్పకళామయముగా నిర్మించినాడు.

హేమ అప్సరసాంగన. మయుఁడు దితికి కశ్యపప్రజాపతికి జన్మించినాడు. ఈ హేమామయవిశ్వకర్మల పుత్రిక మండోదరి లంకేశ్వరుఁడగు రావణుని పట్టమహిషి.

ఈ మయుడు బ్రహ్మదేవుని గూర్చి వేయేండ్లు తపమొనర్చి శిల్పవిద్యాధనమును వరముగాఁ బడసి యీవనమందు సకల సౌఖ్యములనుభవించినాడు.

స తు వర్షసహస్రాణి తప స్తప్త్వా మహద్వనే ।
పితామహా ద్వరం లేభే సర్వమౌశనసం ధనమ్ ॥

1. ఇట మాయ యనగా వాస్తువిద్యాకౌశల్యము. మాయావి యనగా వాస్తువిద్యావేత్త. విశ్వకర్మ యనగా శిల్పి.
"By him alone was this entire golden grove brought into existence by his wonderful architectural skill. Formerly they say that he was the architect of the demon chiefs." By him was this formost athereal golden palace constructed. — V.R. with Eng. Tr. Geetha Press Ed.

విధాయ సర్వే బలవాన్ సర్వకామేశ్వర స్తదా ।
— వా.రా. కిష్కింధ—51. 12,13.*

ఉశనుడనగా శుక్రాచార్యుడు. శుక్రుడు శిల్పాచార్యుడు. 'ఔశనసధన' మనగా శుక్రసంబంధమైన శిల్పవిద్యాధనము. బ్రహ్మ దేవుని వరము వలన మయుఁడా శిల్పవిద్యారహస్యములను గ్రహించి నాఁడు.

ఔశనసశాస్త్రము, శుక్రనీతి యనునవి శుక్రాచార్యకృత గ్రంథములు.

దీననిఁబట్టి యీ మయుఁడు శుక్రాచార్యుని శిష్యుఁడని తెలియుచున్నది.

* Cf. : Valmiki Ramayana—Kishkindha
Eng. Tr. Geetha Press—P. 1055.

"Having practised austerities in this extensive grove for thousands of years, he for his part secured from Brahma (the father of Progenitors of the Universe) as a boon the entire wealth of Sage Sukra, (in the form of his marvellous creative powers as well as all materials required for creation and the science of architecture, which is attributed to the said sage.) Having accomplished everything, the mighty Maya, who had (obsolute) control over all the objects of enjoyment (evolved by him) then lived happily for sometime in the large grove."

# మహాయోగి మయుడు : త్రిపుర నిర్మాత

పురత్రయ విసృష్ట్యర్థం మయం వవ్రుర్మహాసురమ్ ।
విశ్వకర్మాణ మజరం దైత్యదానవ పూజితమ్ ॥
— వ్యా.భా. కర్ణ. 34-16*

తారకాసురుని తనయులయిన తారకాక్షుడు, కమలాక్షుడు విద్యున్మాలి యనువారు బ్రహ్మవలన వరము వడసి త్రిపుర నిర్మాణము కొఱకు దైత్యదానవపూజితుడయిన మయుని ప్రార్థించిరి.

మయుడు తన తపశ్శక్తి చేత దివియందు కాంచనపురమును, అంతరిక్షమునందు రజతపురమును, భూమిపై కార్ష్ణాయసపురమును నిర్మించి యిచ్చినాడు. వానికి వరుసగా తారకాక్షుడు, కమలాక్షుడు, విద్యున్మాలియు రాజులైరి.

'అమ్మువ్వురు తన్నాశ్రయించుటం జేసి వారల యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్ల దన మాయా బలంబున మయుఁడొదలించుచుండు '**

త్రిపుర నిర్మాత యయిన మయుఁడు మహాశిల్పి (మహా మాయి); సకలవిధ శిల్పములకు మూలపురుషుడు (మాయానాం జనకః).

---

* పోల్చు : భాగవతపురాణము – 7-11-53.
'మాయీనాం పరమాచార్యం మయం శరణ మాయయుః.'

** తిక్కన. కర్ణ. 1-263 (వ్యా.భా. కర్ణ. 34-25-27.)
సర్వేషాం పునశ్చైషాం సర్వయోగవహో మయః ।
తమాశ్రిత్య హి తే సర్వే వర్తయుతే ఒకుతో భయాః ॥
యో హి యన్ మనసా కామం దధ్యౌ త్రిపుర సంశ్రయః ।
తస్మై కామం మయస్తం తం విదధే మాయయా తదా ॥

మయోనామ మహామాయీ మాయీనాం జనకో ఽసురః ॥
— మత్స్యపురాణ. 127-4.

శిల్పులకు శిల్పవిద్యాగురువు (మాయీనాం పరమాచార్యం- భాగవతము)

## మహాకవి మయుడు

అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః ॥
—వ్యా.భా. సభా. 1-6*

'ఏను దానవవిశ్వకర్మ ననేకవిధ శిల్పకలాకుశలుండ, మీ కిష్టం బయినదాని నిర్మింపంబనుపుఁ' డని మయ విశ్వకర్మ తన ప్రాణములు గాపాడిన యర్జును నర్థించినాడు.[1]

ఖాండవవన దహన సమయమున మయుఁడు 'ఖాండవంబు వెలువడ నేరక తక్షక గృహాంబునఁ బరిభ్రమించుచున్నంత తన్నగ్ని చుట్టుముట్టిన'[2] నచ్యుతుం డాతఁడు శిల్పికులశ్రేష్ఠుడగు మయుడని తెలిసియు చంపనుంకించినాడు.

విజ్ఞాయ దానవేంద్రాణాం మయం వై శిల్పినాం వరమ్ ।
జిఘాంసు ర్వాసుదేవ స్తం చక్రముద్యమ్య ధిష్ఠితః ।
—వ్యాభా. ఆది. 227-11.

మయుఁడు సాల్వరాజునకు సౌభపురి నిర్మించి యిచ్చుటచే కృష్ణునకు కోపకారణము గావచ్చును.

* విశ్వం సర్వం కర్మ శిల్పం యస్య (విశ్వకర్మా) మహాకవిః శిల్పపండితః ।
— దేవబోధకృతజ్ఞానదీపికా టీక.

1. నన్నయ. సభా. 1-4.
2. నన్నయ. ఆది. 8-290.
3. భాగవతము. 10-ద్వి. 837

శరణాగతరక్షణతత్పరుడైన ధనంజయుడు వానిని రక్షించుట చేత[1] మయుఁడు కృతజ్ఞతాబద్ధుఁడై కృష్ణార్జునుల కోరికపయి యింద్ర ప్రస్థపురమునందపూర్వ సభాభవనంబు నిర్మించి ధర్మరాజున కిచ్చి గదయును శంఖంబును భీమార్జునుల కిచ్చి ధర్మరాజు చేత సత్కృతుం డైనాడు.[2]

కాని ఖాండవవనమందలి మయశిల్పశాలయు, శిల్పోపకరణ ములు, మయకృత శిల్పశాస్త్రగ్రంథములు నగ్నికాహుతియైపోయినవి.

## మధ్యపాతాళములో మయసంస్కృతి

మధ్యపాతాళము నందలి మయసంస్కృతికి మూలము ఆసియా ఖండమని జె. లెస్లీ మిట్చెల్ అను పరిశోధకుడు 'కాన్క్వెస్ట్ ఆఫ్ మయ' (మయవిజయము) అను తనగ్రంథములో నిరూపించినాడు.

ఆసియాఖండమునుండియే సాంస్కృతిక తరంగ పరంపర పాతాళమునకు-(అమెరికాకు) వ్యాపించిన వనుటకు ప్రబల సాక్ష్యాధారములుండగా నీ విషయమేల వివాదాస్పదమగుచున్నదని 'నిష్పాక్షికబుద్ధి గల పాఠకు డాశ్చర్యపడకమాన' డని యేతద్గ్రంథ సమీక్షకుడు హెచ్.జె. మాసింగ్హామ్ ఉద్ఘాటించినాడు.

అమెరికాలో మయసంస్కృతి యభివృద్ధి చెందుటకు భారత దేశమే యెక్కువగా తోడ్పడినట్లున్నది. మయశిల్పములతో హనుమ ద్గణేశేంద్రాది విగ్రహములు, బౌద్ధమతాచార చిత్రములు గనిపించు చున్నవి. 'దీనివలన క్రీ. పూ. ఏడవశతాబ్దమునుండియు ప్రాచీన

1. నన్నయ. ఆది. 8-291.
2. నన్నయ. సభా. 1-14.

భారతీయ నావికు లనేక పర్యాయములు అమెరికాతీరము చేరినట్లు తోచుచున్న'దని మాసింగ్‌హామ్ వ్రాసినాడు.

భారతీయులు సముద్ర యానాభిలాషులు కానిచో భారతీయ సంస్కృతి మధ్యపాతాళము వఱకు వ్యాపించజాలదు.*

## పాతాళలోక ప్రభువు

అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళము లను సప్తపాతాళములలో నొకటి యగు తలాతలమునకు ప్రభువు మయుడను దానవేంద్రుడు. పాతాళలోకములందు పుటభేదనములు నిర్మించినవాడీ మయుడే.

* Cf. ; P K. Acharya : An Encyclopaedia of Hindu Architecture. P. 365.

"That the Maya culture of Central America was derived from Asia is demonstrated by Mr. J. Lealic Mitchell in his book 'The Conquest of Maya.' In reviewing the publication Mr. H.J. Massingham writes that the evidence for a succession of cultural waves from Asia is so overwhelming that the impartial reader must wonder why the issue was ever a controversial issue "

It appears that it was India which contributed most to the development of Maya culture. Among Maya sculptures are to be found representations of Hanuman, of Ganesh and of Indra and the pictorial and ritualistic reminiscences of Buddhism.

" All this suggests, " says Mr. Massingham, " that the anicient mariners reached America Coast from A.D. 700 onwards not once but many times." The Hindu Culture could not have been transported to Central America unless the Hindus had been a great seafaring people.

త్రిపురదహనానంతరము శరణుజొచ్చిన శిల్పాచార్యుడగు మయుని పరమేశ్వరుడు పాతాళలోకమునకు తలాతలమునకు - ప్రభువును చేసినాడు.

ఆ సుతలమునకు గ్రిందై భాసిల్లు దలాతలంబు ప్రభువందు మయుం
డా సురపురనిర్మాతగ వాసిగ బొగడొంది యేలు వసుధాధీశా.
పురహరుచే రమేశ్వరుడు భూతహితార్థముగా బుర త్రయం
బరుదుగ నీఱుసేసె శరణాగతు నామయుగాచి యెంతయుం
గరుణ దలాతలంబునకు గర్తగ నిల్పిన నున్నవాడు శ్రీ
ధరుని సుదర్శనంబునకు దప్పి విముక్త భయుండుగా దగన్.
— శ్రీమదాంధ్రమహాభాగవతము. 5-116,117.*

ఈ యుదంతమును బట్టి యుద్ధమునందు నిహతులుకాగా మిగిలిన మయవంశీయులు, వానియనుయాయులు. శిష్యప్రశిష్యులు మయునితో పాతాళలోకమునకు బోయి తలాతలమునందు (మధ్య పాతాళమునందు స్థిరనివాసము లేర్పరచుకొని యుందురనియు నావిధముగా వలసపోయిన మయవంశీయులచేత మయ సంస్కృతి పాతాళలోకమున ప్రతిష్ఠింపఁ బడిన దనియు నూహింపవచ్చును.

ఆ మయ సంస్కృతి భారతీయ సంస్కృతియే యని నేటి పరిశోధకులు నిరూపించినారు.

---

* చూడు : శ్రీమద్భాగవత మహాపురాణము. 5.24-28.
'తతో ఽధస్తా త్తలాతలే మయోనామ దానవేంద్ర స్త్రిపురాధిపతి
ర్భగవతా పురారిణా త్రిలోకేశం చికీర్షుణా నిర్దగ్ధస్వపురత్రయ
స్తత్ ప్రసాదాల్లబ్ధపదో మాయావినామాచార్యో మహాదేవేన
పరిరక్షితో విగతసుదర్శన భయో మహీయతే.'

## సౌరవిజ్ఞానవేత్తలు - సంపాతి జటాయువులు

సంపాతి జటాయువు ననూరుని కాత్మజన్ములు. వీరిలో నగ్రజుడైన సంపాతి తన కథ నిట్లు చెప్పికొనినాడు -

నేనును దమ్ముండు నినమండలము జనువేడ్క నొకనాడు చదవి
కెగసి చన చన దీవ్రాంశు సంతాపమున జేసి కమరె నా ఱెక్కలు
కమరవయ్యె ననుజు పక్షమ్ము లే నిమ్మహాచలమున నాటగోలె
నెచ్చటకి జనంగ నేరకున్నవా డ నా తమ్మ డెట్లున్న వా డో
యెఱుగ......[1]

సంపాతియు జటాయువును కేవలము గృధ్రములని చెప్పుటకు వీలులేదు. వారు ఆంధ్రదేశము నందలి గృధ్రజాతి మానవులు.[2] విమానవిద్య నెఱిగినవారు. ఱెక్కలు కమరుట యనగా విమాన పక్షములు దగ్ధమగుటయని యూహింపవచ్చును.

ఋగ్వేదము నందు శ్యేనపక్ష్యాకృతి గల విమానప్రశంస గలదు.

ఆ హిం రథో అశ్వినా శ్యేనపత్వాసుమృలీకః స్వవాం
యాత్వర్వాఙ్ ।
— ఋగ్వేద.-1-118-1.

సోదరు లయిన సంపాతి జటాయువు లిరువురు సౌరవిజ్ఞాన జిజ్ఞాసువులై యంతరిక్షయానములు నిర్మించికొని పరస్పర స్పర్ధతో సూర్యమండలము వఱకు పోవుచుండిరి. పాపమొకనాడు సంపాతి విమానము దగ్ధమై యతడు పడిపోయినాడు. తమ్ముని విమాన మెటు పోయినదో యతడెట్లున్నవాడో తానెఱుగడు.

1. ఎఱ్ఱన—అరణ్య, 7-21 (వ్యా.భా.—వన, 282-49,50)
2. చూడు - శ్రీసురవరం ప్రతాపరెడ్డి-రామాయణ విశేషములు, పు॥లు 306-7

సంపాతి జటాయువుల ప్రయోగశాల పంపాపుర సమీప పర్వతము పయి నున్నది. వీరు త్రేతాయుగోత్తరభాగమున నున్న సౌరవిజ్ఞానవేత్తలు.[1]

## దూరవీక్షణ యంత్రము

సీతాన్వేషణపరులై యరిగిన కపిప్రవరులు 'సంపాతి యను పక్షి చేత మహీతనయ సువార్త' లెల్ల నెఱిఁగిరి —నన్నయ-ఆరణ్య. 3-326.

విశ్వకర్మ నిర్మితమయిన లంకాపురమున రావణాంతఃపురము నందు సీతాదేవి పట్టుచీర గట్టికొని దీనార్తయై రాక్షసస్త్రీలచేత రక్షింపబడుచున్నదనియు, నేనిచట నుండియే జానకిని రావణు చూచుచున్నా ననియు, సుపర్ణునకు గల దివ్యచక్షుర్బలము మాకు (గృధ్రములకు) గూడ గలదనియు, మేము నూఱుయోజనముల కంటె నెక్కుడు దూరము చూడగల మనియు సంపాతి కపివరులతో చెప్పి నట్లు వాల్మీకిరామాయణము నందు గలదు.

ఇమే ద్వీపే సముద్రస్య సంపూర్ణ శతయోజనే।
తస్మిం లంకాపురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా ॥
తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ।
రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభిః సురక్షితా ॥
ఇహస్థో ఽహం ప్రపస్యామి రావణం జానకీం తథా।
అస్మాక మపి సౌపర్ణం దివ్యం చక్షుర్బలం తథా ॥
ఆయోజనశతాత్ సాగ్రాద్ వయం పశ్యామ నిత్యశః ॥

— కిష్కింధ—సర్గ శ్లో॥ 20-32.

1. చూడు - ఆనందస్వరూప్ భరద్వాజ్-జాంగిడ బ్రాహ్మణనిదేశికా 1, పు. 81

సంపాతి సూక్ష్మేక్షిక గల పరిశోధకు డనియు వానివద్ద నత్యంత శక్తిమంత మయిన దూరవీక్షణ యంత్ర మున్నదనియు పండితు లూహించుచున్నారు.[1]

శిల్పాచార్యుడయిన సంపాతి ఆంధ్రదేశము నందలి 'గృధ్ర జాతి' మానవు డనుట యొక విశేషము.[2]



## అస్త్రకళాచార్యుడు : ద్రోణాచార్యుడు

సర్వలోకేషు విక్రాంతో భారద్వాజః ప్రతాపవాన్ ।
బుద్ధ్యా తుల్యో హ్యుశనసా బృహస్పతిసమో నయే ॥
— వ్యా.భా. విరాట. 58-6.

భారద్వాజుడు బుద్ధి చాతుర్యమునందు శుక్రునివంటివాడు, నీతిశాస్త్రమున బృహస్పతి సదృశుడు.

వేదే ధనుషి చాచార్య మభిజానామి తే௨ర్జున ।
విశ్రుతం త్రిషు లోకేషు భారద్వాజ యశస్వినమ్ ॥
— వ్యా.భా. ఆది. 169-64.

1. చూడు : ఆనందస్వరూప భరద్వాజ్-జాంగిడ్ బ్రాహ్మణ నిదేశికా. పు. 81.
2. చూడు : శ్రీసురవరం ప్రతాపరెడ్డి-రామాయణ విశేషములు. పుటలు 306-7.

ద్రోణాచార్యుడాంగిరసుండైన భరద్వాజమహర్షి పుత్రుడు.

'ద్రోణుడనగఁ బుట్టె శుక్రునంశంబునఁ బుణ్యమూర్తి
ధర్మతత్త్వజ్ఞుడై భరద్వాజమునికి'

—నన్నయ. ఆది. 5-195.

అంగిర
|
బృహస్పతి
|
ద్రోణ
|
అశ్వత్థామ

'ఏను భరద్వాజుండ ద్రోణుండను వాడ'[1] ననియు, 'ఆంగిరసకులోద్భవుడ'[2] ననియు, పరశురామునితో చెప్పికొనినాడు.

అంగిరసు లాదినుండియు నగ్నితత్త్వము నెఱిగిన శిల్పులు. 'ఆగ్నేయ' సంజ్ఞ కలవారు. ధనుర్విద్యా వేత్తలు...

శిల్పాచార్యుండయిన శుక్రునంశంబున వాంగిరసకులమందు జన్మించిన ద్రోణుడు వేదవేదాంగములు, నర్థవిద్యయు[3] నభ్యసించి ధనుర్వేద విదుడై యస్త్రకళాచార్యుడై[4] అంగిరసకులశ్రేష్ఠుడయినాడు. (అంగిరసాం వరః)[5]

కౌరవపాండవుల శస్త్రవిద్యా గురువగుటచే భారతాచార్యుడైనాడు.[6]

---

1. నన్నయ. ఆది. 6-199 (వ్యా.భా. ఆది. 130 54,55)
2. 'అచఖ్యా వాత్మనో నామ జన్మ చాంగిరసఃకులే ।'
   —వ్యా భా. ఆది. 130-55.
3. 'వేదం షడంగం వేదాహ మర్థవిద్యాం చ మానవీమ్.'
   — వ్యా.భా. ద్రోణ. 7-1.
4. తిక్కన—ద్రోణ 1. 286.
5. వ్యా.భా. ఆది. 132-71; 133-11. 'అంగిరసాంవరః'
6. నన్నయ. ఆది. 7-15.

ఆంగిరసకులోత్పన్ను డయిన భారద్వాజుడు మొట్టమొదట 'నగ్నివేశుండను మహాముని వలన ధనుర్విద్యాపారంగుడై తత్ప్రసాదంబున నాగ్నేయాస్త్రంబాదిగా ననేక దివ్య బాణంబులు' వడసినాడు.[1]

తరువాత భార్గవుండయిన 'పరశురాముని చేత దివ్యాస్త్రంబులు ప్రయోగరహస్యంబుతోడ' బడసినాడు.[2]

తాను నేర్చిన విద్యలన్నియు ప్రియశిష్యుడైన యర్జునునకు నేర్పినాడు.

'........ద్వంద్వ సంకీర్ణ యుద్ధముల తెఱగు రథ మహీవాజి వారణముల పైనుండి, దృఢచిత్రసౌష్ఠవ స్థితులనేయ' బహువిధ వ్యూహభేదనోపాయములను, సంప్రయోగరహస్యాతిశయము గాఁగఁ గఱపె నర్జునుఁ దొంటి భార్గవుఁడు, వింటి నిట్టిఁడే యని పొగడంగ నెల్ల జనులు.

వివిధ రణకోవిదుడైన[3] భారద్వాజుడు కురుక్షేత్ర సంగ్రామమున భీష్ముని తరువాత సర్వసైన్యాధిపత్యము వహించి తన 'సమర క్రీడాకళాకౌతుకము'[4] జూపినాడు,

చాపకళావేది[5] యగు నాచార్యుడు ధర్మతనయుని దాకి 'వాయవ్యయామ్యవారుణాగ్నేయత్వాష్ట్రసావిత్రంబులగు సాయకంబులు' వరుస నేసినాడు. 'సకలభూతభయంకరంబగు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించినాడు'.[6]

ఆంగిరస వంశమునం దనూచానముగ నున్న కవచమును,

1. నన్నయ. ఆది. 5-196
2. నన్నయ. ఆది. 5-202
3. తిక్కన. ద్రోణ. 1-286
4. తిక్కన. ద్రోణ. 1-380
5. తిక్కన. ద్రోణ. 3-180
6. తిక్కన. ద్రోణ. 5-92

త్రిలోకంబుల కభేద్యంబయిన దానిని[1] దుర్యోధనునకు సమంత్రకంబుగా దొడిగి నానావిధవాక్యముల దీవన లిచ్చి పంపినాడు.[2]

ఆంగిరసకులశ్రేష్ఠు డయిన అస్త్రశిక్షాచార్యుఁ డభినందనీయుడు.

## వస్వంశసంభూతుడు : గాంగేయుడు

మొదమునఁ బ్రభాసుఁడను నెనిమిదియవ వసు వంశమునను
మేదిని భీష్ముంతుదయించె సర్వవిద్యా విదుఁ డపజిత పరశు
రామ వీర్యుడు బలియన్.

— నన్నయ. ఆది. 3-77

అష్టమవసువైన ప్రభాసుఁడు శిల్పిప్రజాపతియైన విశ్వకర్మ జనకుడు. వసువులు ప్రతిభావంతులగు దేవతలు; శిల్పులు. వస్వంశమున జన్మించిన గాంగేయుడు[3] తల్లివద్దనేయుండి సకలవిద్యాపారంగతు డయినాడు.

గంగయే శంతనునితో నిట్లు చెప్పుచున్నది :-

'సాంగంబులగుచుండ సకలవేదంబులు సదివె వసిష్ఠుతో సకల
ధర్మశాస్త్రాదిది బహువిధశాస్త్రముల్ శుక్ర బృహస్పతుల్
నేర్చినయట్ల నేర్చి పరమాస్త్ర విద్య నప్పరశురాముండెంత

1. తిక్కన. ద్రోణ. 3-220 2. తిక్కన. ద్రోణ. 3-116

3. వసిష్ఠశాపవశమున ప్రభాసవసువు మానవుడుగా జన్మించి మర్త్యలోకమునం దనపత్యుడై యున్నాడు అతడే భీష్ముడు.

(చూడు : నన్నయ. ఆది. 4-162)

దక్షుఁ డంతియ కడుదక్షుఁడయ్యె నాత్మవిజ్ఞానంబు నందు
సనత్కుమారాదుల కుట్టిడ యనఘమూర్తి.'*

భృగ్వంగిరసకులోత్పన్నులయిన శుక్రబృహస్పతులు నేర్చిన శాస్త్రములన్నియు నేర్చినాడనుటలో నొక విశేషమున్నది శుక్ర బృహస్పతులు అంగిరసుని శిష్యులు. శిల్పశాస్త్ర ప్రవర్తకులు.

కావున గాంగేయుడు నేర్చిన విద్యలలో శిల్పశాస్త్రాంతర్గత మగు ధనుర్వేదము శస్త్రాస్త్ర విద్యలేగాక తదితర శిల్పవిద్యలు నున్నవనుట లెస్సగా నుండును.

## ధౌమ్య పురోహితుడు

పాండవులు 'తేజోవచోరూపబుద్ధివిభవంబుల బృహస్పతి సదృశుండై వేదవేదాంగవిదుండైన ధౌమ్యుంబురోహితుంగా బడసిరి.'

—నన్నయ-ఆది. 7-159.

ధౌమ్యుడు 'దేవలభ్రాత' యని చెప్పబడినది. మఱి దేవలు డెవడు ?

వసువులలో సప్తమ వసువగు ప్రత్యూషుని తనయులలో నొక దేవలుడున్నాడు. అసిమంతు డయిన దేవలుం డొకడు కాశ్యప గోత్రుడు కలడు. వీరిలో నెవడయినను శిల్పివంశీయుడే.

* నన్నయ – ఆది. 4-169 (వ్యా.భా. ఆది. 100-36,37)
ఉశనా వేదయచ్ఛాస్త్రమయ తద్వేద సర్వశః ॥
తథైవాంగిరసః పుత్రః సురాసుర నమస్కృతః ।
యద్వేదశాస్త్రం తచ్చాపి కృత్స్న మస్మిన్ ప్రతిష్ఠితమ్ ॥
(ఉశనాః శుక్రః ॥36॥ అంగిరసః పుత్రో బృహస్పతిః ॥37॥ —నీలకంఠ.

దేవలధౌమ్యులు - కాశ్యపకుటుంబమునకు చెందిన ఋషులని కొడాలి లక్ష్మీనారాయణ తెలుపుచున్నారు.

— మహాభారతవిమర్శనము. పు. 176.

ద్రుపదునిచేత పుత్రకామేష్టి చేయించిన యాజోపయాజులు కాశ్యపగోత్రులు. వీరు సూర్యోపాసకులు.

సంహితాధ్యయనే యుక్తౌ గోత్రతశ్చాపి కాశ్యపౌ ।
ఆరణేయౌ యుక్తరూపౌ బ్రాహ్మణౌ ఋషి సత్తమౌ ॥

— వ్యా.భా. ఆది. 167-8.*

పాండవుల పురోహితుడయిన ధౌమ్యుడును సూర్యోపాసకుడే. ధౌమ్యుడు విశుద్ధాత్ముండైన ధర్మరాజునకు సూర్యు డర్యముండు భగుండను నివి మొదలుగాగల నామంబుల యష్టోత్తరశతంబు నభీష్ట సిద్ధిప్రదంబయిన దాని విస్పష్టార్థ వర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించినాడు.[1]

దీనినిబట్టి ధౌమ్యుడు కాశ్యపగోత్రుడై యుండవచ్చునని చెప్ప వచ్చును. కాశ్యపులు శిల్పులే. రాజపురోహితు డాధర్వణ వేద విధిజ్ఞుడై యుండవలయును గావున ధౌమ్యు డాధర్వణవేద (శిల్పి) బ్రాహ్మణుడై యుండుననియు చెప్పవచ్చును. ఏవిధముగా జూచినను ధౌమ్యుడు శిల్పిబ్రాహ్మణుడే.

---

* సూర్యభక్తౌ వా బ్రాహ్మణౌ బ్రహ్మవిదౌ ... । — నీలకంఠ

1. నన్నయ - అరణ్య. 1-41.

# పురోచన శిల్పాచార్యుడు

పురోచనుడు దుర్యోధనుని కోరికపై వారణావతనగరములో పాండవులుండుటకు లాక్షాగృహమును నిర్మించిన శిల్పాచార్యుడు దుర్యోధనునకు పరమ విశ్వాసపాత్రుడు.

'నాకుం బరమ విశ్వాస విషయుండవ నీవొక్కరుండవ యిది యనన్య విషయంబయిన కార్యంబు (అప్రమత్తుండవు). కావున, నీవ దీనిం జేయవలయు.....' నని దుర్యోధనుడు పురోచనుని వేడికొని నాడు.
—నన్నయ.భార. ఆది. 6-140.

పురోచనుడు శిల్పి మాత్రుడు కాడు. అతడొక సచివుడు. అష్టాదశ తీర్థులలో - మంత్రులలో - కార్యనిర్మాణ కృత్తు ఒకడు. అనగా సమస్త శిల్పకార్యములు నిర్వహించువాడు. పురోచనుడట్టి సచివుడు. కావుననే దుర్యోధను డాతని కుడిచేయి పట్టుకొని యేకాంత స్థలమునకు గొనిపోయి వాని సహాయ్యము నర్థించినాడు.

స పురోచన మేకాంతమానీయ భరతర్షభ ।
గృహీత్వా దక్షిణే పాణౌ సచివం వాక్యమబ్రవీత్ ॥
—వ్యా.భా. ఆది. 144-2*

దుర్యోధను డిట్లనినాడు.

“ఈ కార్యసిద్ధియగుడును నీకతమున నఖిల ధారుణీరాజ్యము
నా కేకాధిష్ఠితమగు నిది నీకును నిత్యోపభోగ నిలయము కాదే?
—ఆది. 6-141.

అది అభ్యర్థనమే గాదు. ఆజ్ఞయు. రాజాజ్ఞను కాదనగల ధైర్యము రాజోద్యోగి కెట్లుండును? రాజాజ్ఞను పాలించుట వలన

* ఇట సచివుడనగా మంత్రి. మఱియొకచోట 'అమాత్య' డని యున్నది.
'జాతుషం తద్గృహం దగ్ధ మమాత్యం చ పురోచనమ్ ॥
— ఆది. 150-2.

రాజునకు రాజ్యలబ్ధి-సచివునకు సౌఖ్యప్రాప్తి.

ఈ ప్రలోభమునకు లోనై పురోచన సచివుడు-కార్యనిర్మాణకృత్తు - లాక్షాగృహ నిర్మాణమున కుద్యమించినాడు.

ప్రభుసేవాపరాయణుడై విధి నిర్వహణములో ప్రభువుల కొఱకు ప్రాణము లర్పించిన పురోచన శిల్పాచార్యుడు పురస్కార యోగ్యుడే.

## లోహితాక్ష స్థపతి

జనమేజయుడు సర్పయాగదీక్షితుడయి, "యజ్ఞాయతనంబున నున్న రాజునకు నొక్క వాస్తువిద్యానిపుణుండైన పౌరాణికుడు" యజ్ఞము పూర్తి కాదని జోస్యము చెప్పెను.

అనఘా యీయజ్ఞము విధిసనాథ ఋత్విక్ప్రయోగ సంపూర్ణంబ
య్యును గడచన నేరదు నడుమన యుడుగును భూసురోత్తమ
నిమిత్తమునన్.

— నన్నయ. భా. ఆది. 1-209.210.

మూలము నందిట్లున్నది.

నిమిత్తం మహదుత్పన్నం యజ్ఞవిఘ్నకరం తదా ।
యజ్ఞస్యాయతనే తస్మిన్ క్రియమాణే వచో ఽబ్రవీత్ ॥
స్థపతి ర్బుద్ధిసంపన్నో వాస్తువిద్యా విశారదః ।
ఇత్యబ్రవీత్ సూత్రధారః సూతః పౌరాణిక స్తదా ॥
యస్మిన్ దేశే చ కాలే చ మాపనేయం ప్రవర్తితా ।
బ్రాహ్మణం కారణం కృత్వా నాయం సంస్థాస్యతే క్రతుః ॥

— వ్యా.భా. ఆది. 51-14-16.

వాస్తువిద్యా విశారదుడైన యీ స్థపతిపేరు లోహితాక్షుడు.

లోహితాక్షుడు వాస్తువిద్యావిశారదు డగుటయే కాక, యనుభవజ్ఞుడైన స్థపతి సత్తముడు. బుద్ధిచాతుర్యము గలవాడు.

సూతుడనగా సామాన్య తక్షకుడు. సూత్రధారు డనగా సూత్రము పట్టి మాపనము చేయువాడు. స్థపతి యనగా తక్కిన శిల్పులపై పర్యవేక్షణము చేయు శిల్పిముఖ్యుడు. పౌరాణికుడనగా శిల్పాగమవేత్తయని నీలకంఠుడు తెలిపినాడు.[1] అనగా వివిధ పురాణాంతర్గత శిల్పశాస్త్ర రహస్యములు నెఱిగినవా డన్నమాట.[2] స్థపతియైన వాడు జ్యోతిషమును తదితరశాస్త్రములను గూడ తెలిసికొని యుండును.

ఇన్ని విషయములు తెలిసినవాడును, అనుభవము కలవాడును కావుననే యజ్ఞాయతనార్థము మాపనము చేయబడిన భూమినిబట్టియు ముహూర్తమును బట్టియు నీయజ్ఞము పూర్తి కాదని చెప్పగలిగెను.

స్థలనిర్ణయము శిల్పశాస్త్ర విషయము. ముహూర్తము జ్యోతిష శాస్త్ర విషయము. ఈశాస్త్రములు రెండును అనుభవైక వేద్యములు. కేవల శాస్త్రజ్ఞానము ఫలదాయకము కాదు. అన్నిటిని మించినది శకున శాస్త్రము. శకునము దైవ నిర్ణయమును సూచించును.

జనమేజయుడీ స్థపతివర్యుని మాట వినిపించుకొనలేదు. సర్ప యజ్ఞ మారంభమైనది. 'పల్వురు నాగేంద్రులు బ్రహ్మదండహతి

1. "Thus the architect, Sutradhara, Sthapati, is Vastuvidya Visarada"—E.W. Hopkins: The Great Epic of India P.11
సూతో జాత్యాపౌరాణికః శిల్పాగమవేత్తా ॥ 15 ॥ నీలకంఠ
చిత్రశాలాప్రతి పు. 102.
2. 'ఇతిహాస పురాణజ్ఞః సూతో దేవాంశ్చ పూజయేత్'
—వైజయంతి. పు. 78.

వార్తధ్యాయులై యజ్ఞకుండాగ్నులందు పడిరి. తక్షకు డింద్రునాశ్ర యించినాడు.

ఋత్విజుడు మహాత్ముడైన లోహితాక్షస్థపతి చెప్పిన విషయము నొకమారు జనమేజయునికి జ్ఞాపకము చేసినాడు.

— వ్యా.భా. ఆది. 56-6

యదా సూతో లోహితాక్షో మహాత్మా
పౌరాణికో వేదితవాన్ పురస్తాత్ ॥

లోహితాక్షుని జోస్యము నిజమైనది. ఆస్తీక మహాముని కారణముగా సర్పయాగ మాగిపోయినది. జనమేజయుడు సంతోషించి స్థపతియైన లోహితాక్షునికి బహుధనములొసగి సత్కరించినాడు.

లోహితాక్షాయ సూతాయ తథా స్థపతయే విభుః ।
యేనోక్తం తస్య తత్రాగ్రే సర్పసత్ర నివర్తనే ॥

నిమిత్తం బ్రాహ్మణ ఇతి తస్మై విత్తం దదౌ బహు ।
దత్వా ద్రవ్యం యథాన్యాయం భోజనాచ్ఛాదనాన్వితమ్ ॥

ప్రీతి స్తస్మై నరపతి రప్రమేయపరాక్రమః ।
తతశ్చకారావభృథం విధి దృష్టేన కర్మణా ॥

—వ్యా.భా. ఆది. 58-12,13.

కలియుగమున 80వ సంవత్సరము (క్రీ.పూ. 3021)లో సర్ప యాగము జరిగినది. కావున లోహితాక్షస్థపతి కలియుగారంభమున నున్నవాడు.

మహాభారతము నందు మహర్షుల చరిత్రము లనేకము వర్ణింప బడినవి. వారందరును మనకు ప్రాతఃస్మరణీయులు.

'బ్రహ్మవిష్ణుమహేశ్వరులను' వినాయక విశాఖ వహ్నివాయు చంద్రాదిత్యులను, శక్రవరుణకుబేరులను.... మరుదశ్వివసురుద్రాది దేవతలను పితృదేవతలను...... వేదవ్యాస వాల్మీకి నారదాగస్త్య గౌతమ కశ్య పాత్రికణ్వాది మహామునులను..... పరమభక్తిం దలచి కీర్తించి' జపించిన

పాపంబులును భయంబులు నాపదలుం బాయు
నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు ప్రాప్తించును ధర్మతత్పరత
సిద్ధించున్.

— తిక్కన.—ఆనుశాసనిక. 5-313*

ఈ మహర్షులలో ఏకత ద్వితత్రితులును, అగస్త్యాత్రి కణ్వ కశ్యప గౌతమ భరద్వాజ విశ్వామిత్రాదులును శిల్పర్షులు.

మహాభారతకాలీన సమాజము మానవజీవము నానందమయము చేయు శిల్పాచార్యులను ప్రాతఃస్మరణీయులుగా భావించుట లెస్సగా నున్నది.

---

* వ్యాఖ.—అనుశాసనిక, 150-28-60

విష్ణుర్దేవో ఒథ జిష్ణుశ్చ స్కంధశ్చాంబికయా సహ ॥
అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి మానవా నృషి సత్తమాన్ ।

... ... ...

అవరే మునయ స్సప్త దిక్షు సర్వాస్వధిష్ఠితాః
కీర్తి స్వస్తికరా నృణాం కీర్తితా లోకభావనాః ।.......
ఏతాన్ వై కల్యముత్థాయ కీర్తయన్ శుభమశ్నుతే ॥

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## ఏకాదశోన్మేషము

## పంచాననాలోకనము - పంచమవేదార్థదర్శనము

విశ్వకర్మా విమనా ఆద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్ — ఋగ్వేద 10-82-2.

పరమ సంద్రష్టయు విశ్వశిల్పియు నగు విశ్వకర్మ పరమేశ్వరుని కరుణాకటాక్షవీక్షణము వలన పంచమవేద మయిన మహాభారతము నందు వర్ణింపబడిన నానావిధ శిల్పకళావస్తువిశేషములను పరిశీలించుటకు వీలుకలిగినది.

వీని నొకమారు సింహావలోకనము చేసెదను.

శిల్పసాహిత్యములు పరస్పరాశ్రయములు.

శిల్పిజనకృత వస్తుజాలమును కవులు వర్ణింతురు. మహాకవుల వర్ణనముల ననుసరించి శిల్పులు శిల్పాకృతులు చేయుదురు. ఇది లోక సహజము.

లోకము నందలి మహాకవికృత వస్తుజాలమే మహాభారతము నందలి వివిధవస్తు వర్ణనములకు మూలమైయుండవచ్చును. మహా

భారతము నందలి వస్తు వర్ణనములే యనంతరకాలము నందు శిల్పాకృతులు దాల్చి యుండవచ్చును. ఏవి వేనికి మూలములో ఇదమిత్థమని తేల్చి చెప్పుట కష్టము. ప్రస్తుత మది నాపని కాదు.

మహాభారతము నందంతటను కోకొల్లలుగా నున్న శిల్పకళా విషయక వర్ణనములను పరిశీలించి మహాభారతకాలమునాటి శిల్పకళ లెంత పరిణతి చెందినవో తత్కర్తలయిన శిల్పు లెట్టి యున్నతస్థితి యందున్నారో తెలిసికొనుటయే నా ప్రధానాశయము. అదియే యీ సిద్ధాంతవ్యాస లక్ష్యము.

ప్రథమోన్మేషమున శిల్పసాహిత్యముల కవినాభావసంబంధము గలదని సోదాహరణముగా వివరించితిని.

సకల వేదముల యశేషసార మయిన మహాభారతము నందు అథర్వవేదోపవేదమయిన అర్థవేద (శిల్పశాస్త్ర) విశేషము లుండుటలో వింత యేమున్నది!

మహాభారతము నందలి నానావిధ శిల్పకళా ప్రసంగములను వాస్తుశిల్పము, యజ్ఞశిల్పము, పూర్తశిల్పము, రూపశిల్పము, రథశిల్పము, యంత్రశిల్పము, ప్రకీర్ణశిల్పములు - అను భాగములుగా విభజించి వివేచించి చూచితిని.

మహాభారత కాలమున స్థాపత్య మత్యున్నతస్థితి నొందియున్నది.

భారతదేశ మంతయు పల్లీపక్కణ ఘోషా గ్రామ మహాగ్రామ నగరములతో విలసిల్లుచున్నది. వివిధ గ్రామములు, నగరములు విశ్వకర్మ, మయవిశ్వకర్మల వంటి శిల్పపండితులచే నిర్దిష్టమయిన యొక పద్ధతి (నగరరచనాప్రణాళిక) ప్రకారము నిర్మింపబడుచుండెడివి.

ద్వితీయోన్మేషమయిన వాస్తుశిల్పమందీ విషయము లుద్ఘాటింప బడినవి.

లోకములందలి పురము లన్నియు విశ్వకర్మచేతను, మయవిశ్వకర్మచేతను నిర్మింపబడినవనుట హేతుబద్ధముగా నుండదు. ఆయా కాలములందున్న ప్రజ్ఞాన్వితులయిన ప్రధానశిల్పులను ప్రజలు విశ్వకర్మలనియు, మయులనియు పిలుచుచుండిరనుకొనుట సమంజసము.

స్థాపత్యము వందార్యసంప్రదాయమునకు విశ్వకర్మయు, ఆర్యేతర (ద్రావిడ) సంప్రదాయమునకు మయుడును మూలస్తంభములవంటివారు. 'మానసార' గ్రంథకర్తయైన మానఋషి (అగస్త్య మహర్షి) ఈ యుభయ సంప్రదాయములకు చెందినవాడు. ప్రాచీన కాలము నందిట్టి మహాత్ములు రచించిన 'విశ్వకర్మవాస్తుశాస్త్రము' 'మయమతము' 'మానసారము' మున్నగు గ్రంథముల ననుసరించియే సమరాంగణ సూత్రధారాదులు శిల్పశాస్త్ర గ్రంథములు రచించినారని చెప్పనొప్పును.

ఈ నగర రచనావిధానములే నేడుకూడ పాటింపబడుచున్నవి.

మహాభారతము నందలి రథ వర్ణనములను పరిశీలించినచో రథ నిర్మాణ శిల్పవిశేషములు తెలియగలవు. అట్టి రథము లసంఖ్యాకముగనున్నవి. కావున మహాభారతకాలమున దేశము నందు రథకారు లధికసంఖ్యలో నున్నారని చెప్పవచ్చును. భారతము నందు నౌకాయాన ప్రసంగము లున్నవి. కనుక నానాటి శిల్పులు నౌకలను గూడ నిర్మించుచుండిరని తెలియుచున్నది.

ఇక విమానముల (అంతరిక్షయానముల) విషయము కొంత సందేహాస్పదముగ నున్నది.

కొన్ని వేల సంవత్సరముల క్రితము భరద్వాజమహర్షిచే రచింపబడిన 'విమానశాస్త్రము' నందలి సూత్రముల ననుసరించి మన దేశమునం దిటీవలనొక విమానము నిర్మింపబడినదిగదా !

విమాననిర్మాణవిధానములను మన శాస్త్రగ్రంథములు చెప్పుచుండగా వేదములు రామాయణ మహాభారతములు యంత్రచోదితము లయిన యంతరిక్షయానములను వర్ణించుచుండగా పాశ్చాత్యపరిశోధకులు కొంద రంగీకరించుచుండగా మన ప్రాచీన శిల్పవిజ్ఞానమును శంకించి మహాభారతకాలమున విమానములు లేవనుకొననేల ? ఉన్నవనియే యనుకొందము. అది మనకు గర్వకారణము గదా !

రథశబ్దము భూజలాంతరిక్షయానముల కుపలక్షకము. షష్ఠోన్మేషమునందీ రథశిల్పము వివరింపబడినది.

యంత్రశిల్పమను సప్తమోన్మేషమున శస్త్రాస్త్రవిద్యలు, ధనుర్వేదము, యుద్ధతంత్రము మున్నగు విద్యలు చర్చింపబడినవి.

యుద్ధవిద్యలలో ప్రధానమయినది ధనుర్విద్య. ఈ ధనుర్విద్యకు మూల పురుషు డగస్త్యఋషి యని చెప్పబడినది. ఆదినుండియు ధనుర్బాణములు చేయువారు శిల్పులే. అంగిరసులీవిద్య యందగ్రగణ్యులు.

శుక్రబృహస్పతులీ యుద్ధశాస్త్రము నందు నిష్ణాతులు.

ఖడ్గకవచాది సమస్త యుద్ధోపకరణములు చేయువారు శిల్పులే. వీరి సాహాయ్యము రాజుల కవసరము గనుక రథకార కర్మారాది శిల్పుల కానాడు రాజ్యాంగము నందు స్థానము గల్పింప బడినది.

మహాభారతకాలమున నున్న శిల్పివరేణ్యులు నేటి అణ్వస్త్రములవంటి మహాస్త్రములను నిర్మింపగలిగి యుండుట పరమాద్భుతమైన విషయము.

మహాభారతకాలమున రాజులు రాజసూయాది యజ్ఞములు చేయుచుండిరి.

ఋత్విజులు సర్వవిద్యలందు ప్రసిద్ధులై 'వితతమఖప్రయోగవిధి విత్తములై' యుండిరి. వీరిలో యజ్ఞశాలా యజ్ఞవేదీ నిర్మాణచతురులైన శిల్పాచార్యులును గలరు. యజ్ఞనిర్వహణమునకు తక్షక స్వర్ణకారాది తదితర శిల్పుల సాహాయ్యమును ముఖ్యమే.

వాపీకూపతటాకారామ దేవతాయతనాది పూర్తశిల్పములు శిల్పిజనోపపన్నములే.

తృతీయచతుర్థోన్మేషములందు యజ్ఞ పూర్త శిల్పములలో శిల్పుల ప్రాధాన్యము గ్రహింపబడినది.

కవికృత వర్ణనముల వలన వివిధరూపములు భావుకుల మనోనేత్రములకు గోచరించును. మహాకవి (శిల్పపండిత) కృతము లయిన వివిధరూపములు మన చర్మచక్షువులకు గోచరించును. ఇది ప్రతిమా శిల్పము.

యక్షయక్షీ శిల్పము లిందుకు తార్కాణములు.

మహాభారత కాలమునాటికి కవులు - శిల్పులు దేవతలకు రూపకల్పన చేయుచుండిరి. అగ్నికి, సూర్యునకు రూపములు కల్పింప బడినవి. లోకములో శివపూజ యెక్కుడుగ నున్నది. అట్లే దేవీపూజయు. ఇంద్రమహ, బ్రహ్మమహము లున్నవి. గృహదేవతా పూజ యున్నది.

ప్రతిమాకారులు ప్రతిమానిర్మాణమునకు మృత్తికాయోదారు హిరణ్యాదు లుపయోగించుచుండిరి. చిత్రకారులు పటములపై, కుడ్యములపై చిత్రములు రచించుచుండిరి. రాజధానీ నగరములలో చిత్రశాల లున్నవి.

ఇది పంచమోన్మేషము.

షష్ఠోన్మేషమున రథనౌకావిమానశిల్పములు, జలయానాదిక ముల గూర్చి వివరింపబడినది.

గాండీవవజ్రాద్యాయుధములు, మత్స్యయంత్రము, తదితర దివ్యాస్త్రములు మున్నగు ధనుర్వేద సంబంధి విషయముల గూర్చి యంత్రశిల్పము పేర సప్తమోన్మేషమున చర్చింపబడినది.

ఇక ప్రకీర్ణ శిల్పములు. అష్టమోన్మేషమునందు తక్షణాది నానా విధ శిల్పములు చెప్పబడినవి.

శయ్యాసనములు, లోహపాత్రలు, దంతపాంచాలికలు, పూర్ణ కుంభములు, ఛత్రచామరములు, వివిధవాద్యయంత్రములు, వివాహ మండపాదినిర్మాణము - వీనినన్నింటిని చేయువారు శిల్పులే. కామ ధేనువు శిల్పికృత చమత్కార విశేషమే. కల్పవృక్షములు శిల్పకళా కల్పనములే.

మహాభారత కాలమునాటికి అయోదారుతామ్రస్వర్ణశిలా శిల్పములు, దంతశిల్పము నభివృద్ధి చెందినట్లు నిరూపింపబడినది.

నవమోన్మేషము నందు భారతకాలీన సమాజములో శిల్పుల స్థితిని గూర్చి చర్చింపబడినది.

శిల్పిజనపోషణము రాజధర్మము. మహాభారత కాలమున రాజులు శిల్పుల నాదరించుచుండిరి. యజ్ఞవాట, యజ్ఞోపకరణనిర్మా ణాది యజ్ఞశిల్పములు చేయు శిల్పాచార్యులు, రథకార హిరణ్య కారాది శిల్పులు పూజింపబడుచుండిరి. విశ్వకర్మానుగ్రహము వలన నీ శిల్పులకు యజ్ఞభాగార్హతయు గల్పింపబడెను. శిల్పులలో కొందఱు పురోహితామాత్య దుర్గాధ్యక్షాది పదవులలంకరించు చుండిరి. మఱి కొందఱు రాజశిల్పులుగా రాజిల్లుచుండిరి.

మహాభారత కాలమున స్థపతులు రథకారాది శిల్పులు మాన నీయులై సమాజమునందు సముచితస్థానము లలంకరించు చుండినట్లు నిరూపింపబడినది.

మహాభారతమున శిల్పవిద్యాప్రకాశకుల చరిత్రలెన్నియో యున్నవి. వానిలో త్వష్ట, విశ్వకర్మ, భౌవనవిశ్వకర్మ, సుధన్వుడు, శుక్రాచార్యుడు, మయుడు మున్నగువారు ప్రముఖులు.

విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, ఇంద్రుడు, దధీచి, వైవస్వత మనువు, దీర్ఘతముడు, నలవిశ్వకర్మ, చాక్షుసమనువు, అగస్త్య మహర్షి, వశిష్ఠవిశ్వామిత్రులు, గర్గుడు, భరద్వాజముని వీరెల్లరు శిల్పవిద్యాప్రకాశకులే.

వీరినిగూర్చి దశమోన్మేషమున చర్చింపబడినది.

మహాభారతము నందు ప్రశంసింపబడిన శిల్పర్షులలో పెక్కురు ఆథర్వణ బ్రాహ్మణులే. ఈ శిల్పాచార్యులు పంచార్షేయులా? సప్తార్షేయులా? యను ప్రశ్నలీనా డుత్పన్నమగుచున్నవి.

న విశేషోస్తి వర్ణానాం సర్వం బ్రహ్మమిదమ్ జగత్ ।
బ్రహ్మణా పూర్వ సృష్టం హి కర్మభి ర్వర్ణతాం గతామ్ ॥
—వ్యా భా. శాంతి. 188-10.

యజ్ఞయాగాదు లందు గృహనిర్మాణాది కార్యము లందు ఋత్విజులు స్థపతులు భేదభావము లేక కలిసిమెలసి పనిచేయుచుండిరి. పురోహితులు, శిల్పాచార్యులు ఆథర్వణ బ్రాహ్మణులే.

20]

'అథర్వవేద రచయితలే మహాభారతరచన చేసియుందురను పలువుర విద్వాంసుల అభిప్రాయముతో నేను ఏకీభవించుచున్నాను' అని చారిత్రక శిరోమణి శ్రీకొండాలి లక్ష్మీనారాయణ వ్రాసినారు.

(మహాభారతవిమర్శనము. పు. 101.)

అథర్వవేద మంత్రద్రష్ట లయిన భృగ్వాంగిరః ప్రభృతులు శిల్పాచార్యులని నిరూపింపబడినది.

ఈ విధముగా నీ సిద్ధాంత వ్యాసమునందు శ్రీమదాంధ్ర మహాభారతము శిల్పకళామండిత మనియు శిల్పాచార్యుల శేముషీ విభవముతో చెలువారుచున్నదనియు సప్రమాణముగా స్థాపింప బడినది.

'శిల్పం వినా న హి త్రిషులోకేషు విద్యతే'

—o—

# అనుబంధములు

1. చతుష్షష్టికళలు
2. విశ్వకర్మసూక్తము-1
3. విశ్వకర్మసూక్తము-2
4. దుర్గాస్తోత్రము

# చతుష్షష్ఠి కళలు

ఈ చతుష్షష్టికళలు వాత్స్యాయన కామసూత్రములలో నొక విధముగను, శుక్రాచార్యుని శుక్రనీతిలో మఱొకవిధముగను పేర్కొన బడినవి.

## వాత్స్యాయన కామసూత్రములలో నొసగబడిన చతుష్షష్టికళలు

1. గీతము, 2. వాద్యము, 3. నృత్యము, 4. ఆలేఖ్యము, 5 విశేష కచ్ఛేద్యము, 6. తండుల కుసుమబలి వికారములు, 7. పుష్పాస్తరణము 8. దశనవసనాంగరాగము, 9. మణిభూమికాకర్మ, 10. శయనరచనము, 11. ఉదకవాద్యము, 12. ఉదకాఘాతము, 13. చిత్రము-యోగము, 14. మాల్యగ్రథన వికల్పములు, 15. శేఖరకాపీడ యోజనము, 16. నేపథ్యప్రయోగములు, 17. కర్ణపత్రభంగములు, 18. గంధయుక్తి, 19. భూషణయోజనము, 20. ఇంద్రజాలములు, 21. కౌసుమార యోగములు, 22. హస్తలాఘవము, 23 విచిత్రశాకయూషభక్ష్య వికారక్రియ, 24. పానకరసరాగాసవయోజనము, 25. సూచీవానకర్మములు, 26. సూత్రక్రీడ, 27. వీణాడమరుకవాద్యములు, 28. ప్రహేళిక 29. ప్రతిమాలా, 30. దుర్వాచకయోగములు, 31. పుస్తకవాచకము, 32. నాటకాఖ్యాయికా దర్శనము, 33. కావ్యసమస్యాపూరణము, 34. పట్టికావేత్రవాన వికల్పములు, 35. తక్షకర్మములు, 36. తక్షణము 37. వాస్తువిద్య, 38. రూప్యరత్నపరీక్ష, 39. ధాతువాదము, 40. మణిరాగాకరజ్ఞానము, 41. వృక్షాయుర్వేదయోగము, 42. మేషకుక్కుట లావకయుద్ధవిధి, 43. శుకశారికా ప్రలాపనము, 44. ఉత్సాదనే సంవాహనే కేశమర్దనే చ కౌశలమ్, 45. అక్షర ముష్టికాకథనమ్, 46. మ్లేచ్ఛితవికల్పములు, 47. దేశభాషావిజ్ఞానము, 48. పుష్పశకటికా

49. నిమిత్తజ్ఞానము, 50. యంత్రమాతృక, 51. ధారణమాతృక, 52. సంపాఠ్యము, 53. మానసీకావ్యక్రియ, 54. అభిధానకోశము, 55. ఛందోజ్ఞానము, 56. క్రియాకల్పము, 57. ఛలితకయోగములు, 58. వస్త్రగోపనములు, 59. ద్యూతవిశేషము, 60. ఆకర్ష క్రీడ, 61. బాలక్రీడనకములు. 62. వైనయికి విద్య, 63. వైజాయికి విద్య, 64. వ్యాయామికివిద్య.

వాత్స్యాయన కామసూత్రములకు యశోధరవిరచిత జయమంగళ వ్యాఖ్యానుసారము పై 64 కళలు - బాహ్యకళలు.*

శిల్ప శాస్త్రవేత్తయయిన శుక్రాచార్యుడు 'శుక్రనీతి' లో చెప్పిన చతుష్షష్టికళలు నీ క్రింద బొందు పఱచుచున్నాను :-

1. హావభావాదిసంయుక్తం నర్తనం తు కలా స్మృతా.
2. అనేకవాద్య వికృతౌ జ్ఞానం తద్వాదనం కలా.
3. వస్త్రాలంకారసాధనమ్ స్త్రీపుంసోశ్చ కలా స్మృతా.
4. అనేక రూపావిర్భావకృతిజ్ఞానం కలా స్మృతా.
5 శయ్యాస్తరణసంయోగ - పుష్పాదిగ్రథనమ్‌కలా.
6. ద్యూతాద్యనేక క్రీడాభిరంజనమ్ తు కలా స్మృతా.
7. అనేకాసన సంధానౌ రతేజ్ఞానమ్ కలా స్మృతా.

ఈయేడును గంధర్వవేదోక్తములు.

8. మకరందాసవాదీనాం మద్యాదీనాం కృతిః కలా.
9. శల్య గూఢాహృతౌ జ్ఞానం శిరావ్రణవ్యధే కలా.

---

చూడు :- కామసూత్రమ్-యశోధరరచితయా జయమంగళాఖ్యయా టీకాసమేతమ్ 1. అధికరణే-3 అధ్యాయే-14

10. హీనాది రససంయోగాన్నాది సంపాచనం కలా
11. వృక్షాది ప్రసవారోప పాలనాది కృతిః కలా.
12. పాషాణధాత్వాది ద్రుతి స్తద్భస్మకరణం కలా
13. యావదిక్షువికారాణాం కృతిజ్ఞానం కలా స్మృతా
14. ధాత్వౌషధీనాం సంయోగక్రియా జ్ఞానం కలా స్మృతా.
15. ధాతు సంకర్య పార్థక్యకరణం తు కలా స్మృతా.
16. సంయోగ పూర్వ విజ్ఞానం ధాత్వాదీనాం కలా స్మృతా.
17. క్షారనిష్కాసనజ్ఞానం కలా సంజ్ఞం తు తత్ స్మృతమ్.

ఈ పదియు ఆయుర్వేదోక్తములు.

18. శస్త్రసంధానవిక్షేపః పదాదిన్యాసతః కలా.
19. సంధ్యాఘాతాకృష్టిభేదై ర్మల్లయుద్ధం కలా స్మృతా.
20. కలాభిలక్షితే దేశే యంత్రాద్యస్త్ర నిపాతనమ్.
21. వాద్యసంకేతతో వ్యూహరచనాది కలా స్మృతా.
22. గజాశ్వరథగత్యా తు యుద్ధసంయోజనం కలా.

ఇవియైదును ధనుర్వేదోక్తములు.

23. వివిధాసన ముద్రాభిర్ దేవతా తోషణం కలా.
24. సారథ్యం చ; 25. గజాశ్వాదేర్గతిశిక్షా కలా స్మృతా.
26, 27, 28, 29. మృత్తికా కాష్ఠ పాషాణ ధాతు భాండాది సత్క్రియా.

ఇవి వేఱువేఱుగా నాలుగు కళలు.

30. చిత్రాద్యాలేఖనం కలా.
31. తడాగవాపీ ప్రాసాద సమభూమిక్రియా కలా.
32. ఘట్యాద్యనేక యంత్రాణాం కృతిః

33. వాద్యానాం కృతిః
34. హీనమధ్యాది సంయోగ వర్ణాద్యైరంజనం కలా.
35. జలవాయ్వగ్ని సంయోగ నిరోధైశ్చ క్రియా కలా.
36 నౌకారథాది యానానాం కృతిజ్ఞానం కలా స్మృతా.
37. సూత్రాది రజ్జుకరణం విజ్ఞానం తు కలా స్మృతా.
38. అనేకతంతు సంయోగైః పటబంధః కలా స్మృతా.
39. వేధాది సదసజ్ఞానం రత్నానాం చ కలా స్మృతా.
40. సువర్ణాదీనాం తు యాథాత్మ్య విజ్ఞానం చ కలా స్మృతా.
41. కృత్రిమ స్వర్ణరత్నాది క్రియా జ్ఞానం కలా స్మృతా.
42. స్వర్ణాద్యలంకారకృతిః కలా లేపాది సత్కృతిః
43. మార్దవాది క్రియాజ్ఞానం చర్మణాంతు కలా స్మృతా.
44. పశు చర్మాంగ నిర్హార క్రియాజ్ఞానం కలా స్మృతా.
45. దుగ్ధదోహాదివిజ్ఞానం ఘృతాంతం తు కలా స్మృతా.
46. సీవనే కంచుకాదీనాం విజ్ఞానం తు కలాత్మకం.
47. బాహ్వాదిభిశ్చ తరణం కలా సంజ్ఞం జలే స్మృతమ్.
48. మార్జనే గృహ భాండాదే ర్విజ్ఞానం తు కలా స్మృతా.
49. వస్త్రసమ్మార్జనం చైవ 50. క్షురకర్మ కలే హ్యుభే.
51. తిలమాంసాది స్నేహానాం కలా నిష్కాసనే కృతిః
52. సీరాద్యాకర్షణే జ్ఞానం వృక్షాద్యారోపణే కలా.
53. మనోనుకూల సేవాయాః కృతి జ్ఞానం కలా స్మృతాః.
54. వేణుతృణాది పాత్రాణాం కృతిజ్ఞానం కలా స్మృతా.
55 కాచపాత్రాది కరణ విజ్ఞానం తు కలా స్మృతా.
56. సంసేచనం సంహరణం జలానాం తు కలా స్మృతా.
57. లోహాభిసార శస్త్రాస్త్ర కృతిజ్ఞానం కలా స్మృతా.

58. గజాశ్వవృషభోష్ట్రాణాం పల్యాణాది క్రియా కలా.

59. శిశోః సంరక్షణే జ్ఞానం ధారణే క్రీడనే కలా.

60. సంయుక్తతాడనజ్ఞాన మపరాధి జనే కలా.

61. నానాదేశీయ వర్ణానాం సుసమ్యగ్లోచనం కలా.

62. తాంబూలరక్షాది కృతి విజ్ఞానం తు కలా స్మృతా.

63. ఆదానమాశుకారిత్వం. 64. ప్రతిదానం చిరక్రియా*

---

* శ్రీమహర్షి శుక్రాచార్య విరచితాశుక్రనీతిః - చతుర్థాధ్యాయే- విద్యాకలానిరూపణనామ తృతీయప్రకరణమ్ - శ్లో 67-100.



# విశ్వకర్మ సూక్తము -1

విశ్వకర్మా భౌవనః ఋషిః ॥ విశ్వకర్మా దేవతా ॥

య ఇమా విశ్వాభువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః ।
స ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాఁ ఆ వివేశ ॥ 1

కిం స్విదాసీదధిష్ఠానమారంభణం కతమత్స్విత్కథాసీత్ ।
యతో భూమిం జనయన్విశ్వకర్మా విద్యామౌర్ణోన్మహినా
విశ్వచక్షాః ॥ 2

విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత
విశ్వతస్పాత్ ।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావా భూమీ జనయన్
దేవ ఏకః ॥ 3

కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని
ధారయన్ ॥ 4

యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా
విశ్వకర్మన్నుతేమా ।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః॥ 5
విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ
పృథివీముత ద్యామ్ ।
ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా
సూరిరస్తు ॥ 6

వాచస్పతిం విశ్వకర్మాణమూతయే మనోజువం వాజే అద్యా
హు వేమ ।
స నో విశ్వాని హవనాని జోషద్విశ్వశంభూ రవసే సాధుకర్మా ॥ 7

— ఋగ్వేద. 10-81*

---

* తత్రేతిహాసమాచక్షతే -
విశ్వకర్మా భౌవనః సర్వమేధే సర్వాణి భూతాని జుహ్వాంచకార
స ఆత్మానమప్యంతతో జుహ్వాంచకార ।
తదభివాదిన్యేషర్గ్భవతి ॥
(య ఇమా విశ్వా) భువనాని జుహ్వత్ ఇతి ॥16-26॥ నిరుక్త॥

విశ్వకర్మ సూక్తము కించిద్భేదముతో కృష్ణయజుర్వేదము నందును గలదు.

Cf. : Ralph—T.H. Griffith—Hymns from Rigveda.
"Viswakarman, the omnipic, is represented in the hymn as the Universal Father and Generator, the Creator of all things and Architect of Worlds."



# విశ్వకర్మసూక్తము - 2

విశ్వకర్మా భౌవనః ఋషిః ॥ విశ్వకర్మా దేవతా ।



చక్షుషః పితా[1] మనసా హి ధీరో ఘృతమేనే అజనన్నన్నమానే ।
యదేదంతా అదదృహన్త పూర్వం ఆదిత్ ద్యావాపృథివీ
అప్రథేతామ్ ॥
విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత
సందృక్ ।
తేషా మిష్టాని సమిషామదంతి యత్రా సప్తఋషీన్ పర
ఏకమాహుః ॥
యో నః పితా జనితాయో విధాతా ధామాని వేద భువనాని
విశ్వా ।
యో దేవానాం నామధా ఏక ఏవ తం సంప్రశ్నం భువనా
యంత్యన్యా ॥
త ఆయజంత ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో
న భూనా ।
అ సూర్తే సూర్తే రజసి నిషత్తే యే భూతాని సమకృణ్వ న్నిమాని॥
పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి ।
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్రదేవాః
సమపశ్యంత విశ్వే ॥

1. చక్షుషఃపితా - "The Father of the eye : Viswakarman, who made the light which enables the eye to see."

తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛంత విశ్వే।
అజస్య[1] నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః ॥

న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాక మంతరం బభూవ ।
నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరంతి ॥

— ఋగ్వేద. 10-82.*

---

1. అజస్య - "The unborn, Aja, seems here to be identified with Viswakarman." —Griffith.

* పోల్చిచూడు : 1. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత-4-6-2.
2. శుక్లయజుర్వేద వాజసనేయ సంహిత-17.16-32



# దుర్గాస్తోత్రము

నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని,
కుమారి కాళి కాపాలి కపిలే కృష్ణపింగళే. 1

భద్రకాళి నమస్తుభ్యం మహాకాళి నమోఽస్తు తే,
చండీ చండే నమస్తుభ్యం తారిణి వరవర్ణిని. 2

కాత్యాయని మహాభాగే కరాళి విజయే జయే,
శిఖిపింఛ ధ్వజధరే నానాభరణభూషితే. 3

టీక :- హే సిద్ధసేనాని సిద్ధానాం యోగినాం సేనా సముదాయః తస్య నేత్రి, పరమపద ప్రాపిక యోగసిద్ధికరీత్యర్థః; మందారే మందారవనే వసతీతి తథా కుమారి అవిప్లుత బ్రహ్మచర్యే, జరాదిహీనేతి వా. కాళి కాలశబ్దవాచ్యే కాపాలి కపాలస్యాయం పతిః కాపాలో రుద్రః తత్పత్ని; కపిలం కృష్ణపింగళశ్చ వర్ణవిశేషో తద్వతి. 1

భద్రం కల్యాణం కాలయతి భక్తాన్ ప్రతి ఆయనతీతి భద్రకాళి; మహతీ చాసౌ కాలీ చ కాలయిత్రీ సంహర్త్రి, కాలస్యాపి కాలరూపా మహాకాళీ తత్సంబుద్ధిః; చండి చండస్య కాలాంతకస్య భార్యే; చండే ప్రగల్భే; తారణి సంకటోత్తరణ కర్త్రి, వరవర్ణినీ సర్వసౌభాగ్య లక్షణోపేతా స్త్రీ తద్రూపే 2

కాత్యాయని కాత్యాయన గోత్రోద్భవే; మహాభాగే అతిపూజ్యే; కరాళి క్రూరే; విజయే విశిష్టో జయో యయా సా జయప్రదే ఇత్యర్థః; జయే జయస్వరూపే. 3

అట్టశూల ప్రహరణే ఖడ్గఖేటకధారిణే,
గోపేంద్రస్యానుజే జ్యేష్ఠే నందగోపకులోద్భవే. 4

మహిషాసృక్ప్రియే నిత్యం కౌశికి పీతవాసిని,
అట్టహాసే కోకముఖే నమస్తేఽస్తు రణప్రియే. 5

ఉమే శాకంబరి శ్వేతే కృష్ణే కైటభ నాశిని,
హిరణ్యాక్షి విరూపాక్షి ధూమ్రాక్షి చ నమోఽస్తుతే. 6

వేదశ్రుతి మహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి,
జంబూకటకచైత్యేషు నిత్యం సన్నిహితాలయే. 7

---

అట్టం అత్యుత్కటం శూలం తదేవ ప్రహరణ మాయుధం యస్యాః, ఖేటకం చర్మ. 4

కౌశికి కుశిక కులోత్పన్నే; అట్టహాసే ప్రశస్తస్మితే; కోకవక్త్రవత్ వృత్తం వా, రక్తబీజవధే ఒసురాదానశీలం వా ముఖం యస్యాస్సా కోకముఖా. 5

శ్వేతే మహేశ్వరరూపే; కృష్ణే వాసుదేవరూపే: హిరణ్యాక్షి ప్రీతనేత్రే; విరూపాక్షి వివిధరూపయుక్తనేత్రే. 6

బ్రహ్మణ్యే యజ్ఞకర్మవివాదిషు సాధ్వ బ్రహ్మణ్యా, జాతవేదసి అతీతజ్ఞ అతీతైర్జ్ఞాతే వా. జంబూకటకేషు జంబూద్వీప రాజధానీషు చైత్యేషు దేవతాలయేషు నిత్యం సన్నిహిత ఆలయః స్థానం యస్యాః సా తథా. 7

త్వం బ్రహ్మవిద్యా విద్యానాం మహానిద్రా చ దేహినామ్,
స్కందమాత ర్భగవతి దుర్గే కాంతారవాసిని. 8

స్వాహాకారః స్వధా చైవ కళా కాష్ఠా సరస్వతీ,
సావిత్రీ వేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే. 9

స్తుతాసి త్వం మహాదేవి విశుద్ధేనాంతరాత్మనా,
జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్రణాజిరే. 10

కాంతారభయదుర్గేషు భక్తానాం పాలనేషు చ,
నిత్యం వససి పాతాళే యుద్ధే జయసి దానవాన్. 11

త్వం జంభనీ మోహినీ చ మాయా హ్రీః శ్రీ స్తథైవ చ,
సంధ్యా ప్రభావతీ చైవ సావిత్రీ జననీ తథా. 12

తుష్టిః పుష్టి ర్ధృతి ర్దీప్తి శ్చంద్రాదిత్య వివర్ధనీ,
భూతి ర్భూతిమతాం సంఖ్యే వీక్ష్యసే సిద్ధచారణైః. 13

—వా.భా. భీష్మ. అ. 23. శ్లో. 4-16.

రణాజిరే యుద్ధాంగణే. 10
జంభనీ తంద్రా; మోహినీ నిద్రా;
శ్రీర్లక్ష్మీః విద్యా తపోధనాధ సమృద్ధిరూపా. 12

— వావిళ్ళప్రతి. ద్వి. సం. పు. 40-41.

## ముఖ్యమైన ముద్రారాక్షసములకు సవరణలు

## శుద్ధపత్రిక

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | 13 | అధర్వ | అథర్వ |
| 3 | 5 | సంస్తుతుంచి | సంస్తుతించి |
| 4 | 2 | దేవనా | దేవానా |
| 5 | 11 | అమరేంద్రుడిట్లుక | అమరేంద్రుడిట్లొక |
| 6 | 13 | సమవర్తతాది | షమవర్తతాధి |
| | 17 | నృష్టేః | సృష్టేః |
| 7 | 5 | భూమని | భూమిని |
| 8 | 9 | జిగీషితయా | జిగీషయా |
| | 17 | దేవనామాసీత్ | దేవానామాసీత్ |
| 10 | 17 | యజ్ఞకర్మలకు యజ్ఞకర్మకుశలుతు | యజ్ఞకర్మకుశలురు |
| 11 | 10 | శయ్యాసనమ్ము | శయ్యాసనమ్ముల |
| | 15 | బ్రాహ్మణానగ్రహం బునం | బ్రాహ్మణానుగ్రహం బునం |
| 12 | 20 | విచక్షణంః | విచక్షణః |
| | 21 | విజయపదమ్ | విజయప్రదమ్ |
| 13 | 17 | శిలకల్ప | శిల్పకల్ప |
| | 18 | దర్మితవాన్ | దర్శితవాన్ |
| 14 | 10 | ధీవోనో | ధీవానో |
| | 11 | జినాన్ | జనాన్ |
| 15 | 8 | రథకారాధి | రథకారాది |
| | 14 | మనుషాశ్యం | మనుష్యోం |
| | 15 | భూమిరధ్ ఆకాశరధ్ జలరధ్ | భూమిరథ్ ఆకాశరథ్ జలరథ్ |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 18 | 3 | జ్వాలేదగ్ని స్స్ఫురతీతః | జ్వాలేదగ్నిస్స్ఫురతీతః |
| | 4 | స్యాద్భుతాశనః | స్యాద్ధుతాశనః |
| | 23 | అంతర్విధేయంః | అంతర్విధేయః |
| 19 | 4 | భిష్మ | భీష్మ |
| | 12 | యోవరాజ్యమున | యౌవరాజ్యమున |
| | 18 | మహీత్మనః | మహాత్మనః |
| 21 | 18 | వా.భా | వ్యా.భా |
| 24 | 10,11 | బ్రోతి సకల జనుల | బ్రోతే సకల జనులు |
| 30 | 21 | వర్ధకి స్తక్షక | వర్ధకి స్తక్షక |
| 31 | 1 | తీర్దులు | తీర్థులు |
| | 2 | రాజనీతీశాస్త్ర | రాజనీతిశాస్త్ర |
| 34 | 1 | స్దపతి | స్థపతి |
| 41 | 13 | పంరకీర్తితాః | పంచకీర్తితాః |
| 44 | 2 | యజమునులు | యజమానులు |
| 45 | 4 | ప్రధమా | ప్రథమా |
| | 13 | జోతిరగ్ని | జ్యోతిరగ్ని |
| 47 | 7 | తష్ట | త్వష్ట |
| 49 | 8 | దీననౌర్వము | దీననోర్వము |
| | 21 | హిరణ్యయం | హిరణ్మయం |
| 50 | 3 | విశ్వకరర్మాంశ | విశ్వకర్మాంశ |
| 51 | 23 | కౌనచిత్ | కేనచిత్ |
| 54 | 7 | శిష్యాస్తష్టుశ్చ | శిష్యాస్త్వష్టుశ్చ |
| 56 | 3 | రాకాన్ | లోకాన్ |
| | 7 | నిశ్శ్నాక | నిశ్శ్వోక |
| | 16 | కలితమై | కలితమైన |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 59 | 11 | విశ్వకర్వ | విశ్వకర్మ |
| 62 | 13 | భౌమునుడే | భౌమునుడో |
| 65 | 22 | Eigthth | Eight |
| 67 | 21 | distance | distant |
| 76 | 22 | Bhddhistie | Buddhistic |
| 81 | 13 | భౌవద | భౌవన |
| 88 | 15 | [illegible] | యద్ద్రస్రావపి |
| 93 | 19 | ధీయతాః | ధీమతాః |
| 94 | 18 | భౌధాయన | బౌధాయన |
| 95 | 10 | పరమాత్మనకు | పరమాత్మనకు |
| | 20 | గరుడపురాడ | గరుడపురాణ |
| | 24 | Hastayohniyammakra | Hastayohniyamaka |
| 97 | 11 | త్వం మింద్రాభి | త్వమింద్రాభి |
| | 12 | మహానపి | మహానసి |
| 98 | 8 | యజురాబ్రహ్మణము | యజుర్బ్రాహ్మణము |
| 99 | 10 | దహింపబడి | దలంపబడి |
| | 14 | నాకార్ణవంబైన | నేకార్ణవంబైన |
| 100 | 6 | దీర్ఘతమముని | దీర్ఘతమముని |
| | 11 | నమ్మానియూ | నమ్మునియు |
| 101 | 9 | శిల్పిసంమతః | శిల్పిసమ్మతః |
| 105 | 7 | Sandhya | Sadhya |
| 106 | 15 | జ్ఞాన నిష్టులు | జ్ఞాన నిష్ఠులు |
| 109 | 17 | జలములకు | జలములను |
| | 19 | ననగస్త్య | నగస్త్య |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 110 | 15 | హితంబగు | హితంబుగా |
| 123 | 13 | విజ్ఞానమపి | విజ్ఞానమస్తి |
| 129 | 14 | మయుడొదలించు | మయుడొదవించు |
| | 19 | మాయీనాం | మాయినాం |
| | 22 | సిర్వే | సర్వే |
| 130 | 3 | మాయీనాం | మాయినాం |
| 131 | 4 | సత్కృంతుండైనాడు | సత్కృతుండైనాడు |
| 134 | 4 | చదవికెగసి | చదలికెగసి |
| | 7 | నెచ్చటకి | నెచ్చటికి |
| | 15 | ఆహింరథో | ఆహ్వాంరథో |
| 135 | 21 | సర్గ శ్లో | సర్గ 58, శ్లో |
| 138 | 12 | వింటి | వింట |
| 139 | 7 | బలియల్ | బలిమిన్ |
| 140 | 4 | నేర్చునాడనుటలో | నేర్చినాడనుటలో |
| | 19 | యచ్ఛాత్రమయ | యచ్ఛాత్రమయం |
| 141 | 7 | సత్త్వమో | సత్త్వమా |
| 143 | 7 | లోహితాక్ష సపతి | లోహితాక్షస్థపతి |
| 146 | 10 | 313 | 314 |
| | 13 | జీతము | జీవితము |
| 150 | 23 | అణత్ర | అణ్వస్త్ర |
| 159 | 17 | శతా | శితా |
| 160 | 22 | పాన్రాణాం | పాత్రాణాం |
| 163 | 9 | య ఇనా | య ఇమా |

# అవలోకిత గ్రంథ పట్టిక

కవిత్రయము వారి శ్రీ మదాంధ్ర మహాభారతము

వ్యాస భారతము - ఔత్తరాహ - దాక్షిణాత్య ప్రతులు

హిందీ మహాభారత - వచనానువాదము
చతుర్వేదీ ద్వారకా ప్రసాద్ శర్మ

వాల్మీకి రామాయణము - ఆంగ్లానువాద సహితము
గోరక్ పూర్ ప్రెస్

అధర్వ వేదము - సాయణ భాష్యోపేతము
చౌఖాంబా సంస్కృత సీరీజ్ - వారణాసి
క్షేమకరణ్ దాస్ త్రివేది - భాషా భాష్యము
దయానంద సంస్థాన్

ఋగ్వేదము - సాయణ భాష్యోపేతము - చౌఖాంబా
దయానంద సరస్వతి భాషా భాష్యము
దయానంద సంస్థాన్

కృష్ణ యజుర్వేదము - సాయణ భాష్యోపేతము
ఆనందాశ్రమ గ్రంథావళి, పూనే
దయానంద సరస్వతి భాషా భాష్యము

శుక్ల యజుర్వేదము - దయానంద సరస్వతి భాషా భాష్యము
దయానంద సంస్థాన్.

యజుర్బ్రాహ్మణమ్, తైత్తిరీయ బ్రాహ్మణము
భాగవతాగ్ని విష్ణు పద్మ మత్స్య, మార్కండేయ, స్కందాది
పురాణములు (సంస్కృతాంధ్రములు)

పైప్పలాద సంహిత, బృహత్సంహిత
బ్రాహ్మణోత్పత్తి మార్తాండ
బృహదారణ్యకోపనిషత్తు - శంకరభాష్యము
ద్వాదశోపనిషత్తులు - వావిళ్ళ రామస్వామి శాస్త్రి
బృహద్దేవతా, మనుస్మృతి
నిరుక్త - స్కంద భాష్యము
ఆంధ్ర రుద్ర భాష్యము - చదలవాడ సుందర రామశాస్త్రులు
గార్గేయాగమమ్
బృహద్విమాన శాస్త్రమ్ - భరద్వాజ మహర్షి కృతం
భారతీయ ప్రాచీన విజ్ఞాన శాస్త్రము - రాణీ శ్రీనివాసశాస్త్రి
రుద్రయామల వాస్తు తంత్రమ్
శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రమ్
మయ మతము, మానసారము
వాస్తు నారాయణీయము - వాడ్రేవు సూర్యనారాయణమూర్తి
రథశాలాది కరణమ్ - కనుపర్తి బసవాచార్య స్వామి
విశ్వకర్మాన్వయ ప్రదీపికా - జ్ఞానానంద
విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము - వడ్డెపాటి నిరంజనశాస్త్రి
విశ్వకర్మ వాస్తు శాస్త్రము
శిల్ప రత్నమ్
శిల్పదర్శనము - డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు
శిల్పము – శిల్పశాస్త్రములు (వ్యాసము)
- స్థాపత్య వేదాచార్య పెదపాటి నాగేశ్వరరావు

ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరాలు - జంబూ ద్వీపము
- పండిత కోట వెంకటాచలము

నన్నయ - విజ్ఞాన నిరతి - గొబ్బూరు వెంకటానంద రాఘవరావు

రామాయణం విశేషములు - సురవరం ప్రతాపరెడ్డి

కౌటిల్య అర్థశాస్త్ర - శ్రీ భారతీయయోగి హిందీ అనువాద సంహితం

శ్రీ విశ్వకర్మా మహాపురాణ్ - సం॥ జయకృష్ణ శర్మాగురుదేవ్

సుధార మంజరీ - రామ్‌కుమార్ విశ్వకర్మా, వారణాశి

శ్రీ విశ్వకర్మా వంశ ప్రకాశ్ - వైద్యవర్ జ్యేష్టరామ్ సూత్రధార్

వేదోంకా యథార్థ స్వరూప్ - ధర్మదేవ్ వాచస్పతి

రూప మండనం - భూమికా - డా॥ బలరామ్ శ్రీవాత్సవ

యంత్ర సర్వస్వము - విమాన శాస్త్రము - భరద్వాజముని

భారతీయ వాస్తుశాస్త్ర ప్రతిమావిజ్ఞాన - డా॥ ద్విజేంద్రలాల్ శుక్లా

జాంగిడ్ బ్రాహ్మణ్ నిదేశికా - ఆనందస్వరూప్ భరద్వాజ్, ఢిల్లీ

అమరకోశము - మేదినీకోశము - వైజయంతి

నానార్థ రత్నమాల - శబ్దార్థ చంద్రిక - శబ్ద రత్నాకరము

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు మరియు

శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము మూడు భాగములు

# BOOKS IN ENGLISH

A Dictionary of Architecture - P.K. Acharya

An Encyclopaedia of Hindu Architecture —P.K. Acharya

An Introduction to the commentary on the Vedas
Swamy Dayananda Saraswathi Eng. Tr. Ghasi Ram

Bloom Field —Hymns of Atharvaveda

Ralph T.H. Griffith —Hymns of Rigveda

E. J. Rapson —The Cambridge History of Indus

Dr. R.K. Mookerjee —Hindu Civilisation

Dr. Radha Kumud Mukerjee —Ancient India

A.C. Benerjee —Studies in Brahmanas

Will Durant —The Story of Civilisation :
Our Oriental Heritage

P. C. Roy —Mahabharath Eng. Tr.

Valmiki Ramayana —Geetha Press and
Gorakhpur Edition. (Eng. Tr)

E. W. Hopkins —The Great Epic of India

The Art of Indian Asia —Ed. Joseph Campbell

Dr. P.L. Bhargava —India in the Vedic Age

Narayana Chandra Bandopadhya —Hindu Polity and
Political Theories

C. Ramachari —The Three Aptyas and their Descendants

P. A. Mankad —Introduction to Aparajita Priccha

Heinrich Zimmer —Philosophies of Life
—Ed. Joseph Campbell

Manasara Silpasastra —compiled and edited by
Joseph Compbell

Beginnings of Buddhistic Art —M. Foucher

Bharatiya Vastu Sastra —Dr. Dwijendralal Sukla

Jeanine Miller —The Vedas

Dr. C. Kunhan Raja —The Quintessence of the Rigveda

D.D. Kosambi —The Culture and Civilisation of
Ancient India

E. Vedavyas —Hinduism in Space Age

Dr. Kantilal F. Sampura—The Structural Temples in Gujarat

Stella Kramrich —The Hiudu Temple